ఆంధ్రపత్రిక
సచిత్ర వారపత్రికనుండి
పునర్ముద్రితము.
రెండవ కూర్పు
1000 కాపీలు

వెల 2-0-0

ముద్రణ:
ఆంధ్రపత్రికా ముద్రణాలయము
చెన్నపురి
డిశంబరు 1954.

1

# డాన్ క్విక్ సెట్



## 1

లా మంచా అనే ఒక గ్రామంలో సామాన్య కుటుంబీకుడు ఒకాయన వుండేవాడు. ఆయన పేరు డాన్ క్విక్ సాడ.

ఈయనకు పెండ్లీ పేరంటం ఏమీ కాలేదేమో; పొద్దస్తమానం పుస్తకాలు ముందు వేసుకు కూర్చొనేవాడు. దానికితోడు ఆయనకు ఏవుద్యోగమూ లేదు కూడాను. ఆయన చదివిన పుస్తకాలైనా ఎటువంటి వనుకొన్నారు? అన్నీ వీరుల, మహావీరుల గాథలు. అలా ఎడతెరిపి లేకుండా వీరుల గాథలన్నీ చదివి చదివి తల కెక్కించుకొనేసరికి అతనిలో వింతప్రకృతి ఒకటి బయలుదేరింది. అహర్నిశలూ యీ వీరుల జీవితగాథలు తలపోసివున్న మీదట తానూ ఒక వీరుడుగా తయారు కావాలనీ, తన పేరుకూడా ఆ మహావీరుల పేర్లతోపాటు ఆచంద్ర తారకంగా నిలిచిపోవాలనీ కలలు కన్నాడు. కలలు కనటంతో ఆగాడా? ఎబ్బే. ఆ పుస్తకాలలో వర్ణించిన విధంగా తానుకూడా దుష్టశిక్షణకు శిష్టరక్షణకు,

కంకణం కట్టుకున్నాడు. ఆమాదిరి దీక్షను ఎప్పుడైతే తీసుకొన్నాడో వెంటనే బయలుదేరాడు—వీరుడుగా వ్యవహరించటానికి కావలసిన సరంజామా అంతా సమకూర్చుకోవటానికి.

వాళ్ల యింట్లో అటకమీద తాత ముత్తాతల నాటి కవచం ఒకటి తుప్పపట్టి వున్నది. పనిగట్టుకు అటకమీదికి ఎక్కి దానిని కిందికి దించి వీలైనంతమటుకు దానితుప్పు వదిలించాడు. ఎక్కడికక్కడ వూడిపోతున్న ఆ కవచం తాలూకు బందులన్నిటినీ తంటాలుపడి అతికించాడు. కిర్రుకిర్రు లాడుతున్నా కవచం మటుకు పనికి వస్తుందనిపించింది కాని, తలమీద పెట్టుకొనే వుక్కుటోపీ వున్నదే—అది తన తలకు చాలా పెద్దది అయింది. అసలు అందులో సగభాగం వూడిపోయి ఎక్కడవున్నదో ఎంత వెతికినా కనిపించనేలేదు. కనిపించకపోతే పోయిందని, వున్న మటుకు ఆటోపీనే అట్టముక్కలూ సీనా రేకుముక్కలూ అవీ అంటించి ఎలాగో ఓలాగు దాని ఆకారం తెల్చాడు.

ఇకపోతే కావలసింది ఒక మంచి గుర్రం. తన దగ్గిర ఒక గుర్రం అయితే వున్నది కానీ అది మంచిదనటానికి వీలులేదు. ఏమంటారా ?—దానికి దాదాపు అతగాడి తాతయ్యకు వుండే వయస్సు వుంటుంది. దానిని ఒక్కసారి చూసినవారికి ఎవరికైనా సాధారణంగా గుర్రం వంట్లో ఎన్ని ఎముకలు వుంటాయో యిట్టే తెలిసిపోతుంది. గుర్రం ముసలి

న్లైతే అయింది. వీరుడయినవాడు యివన్నీ చూస్తూ కూర్చుంటే వాడు వీరుడెప్పటికి ఔతాడు? ఎలా అవుతాడు? అందుకని ఆ గుర్రాన్నే వీరోచితమైన వాహనంగా ఆయన పరిగ్రహించాడు. సాధారణంగా ప్రతివీరుడూ తన గుర్రానికి ఏదో ముద్దుపేరు పెట్టుకొంటాడుగా? అందుకని తానూ తన గుర్రానికి 'రోజినాన్‌టీ' అనే పేరు పెట్టాడు. ఆ పేరుతో తన గుర్రాన్ని పిలుస్తుంటే అందులో ఎన్నో రకరకాల సంగీతం వున్నట్లు ఆతని చెవులకు వినిపించేది గుర్రానికి పేరుపెట్టిన శుభముహూర్తాన్నే 'డాన్ క్విక్ సాడా' అనే తన దేశవాళీనామధేయాన్ని కాస్త విన సొంపుగా వుండాలనే వుద్దేశంతో 'డాన్ క్విక్ సెట్'గా మార్చేసుకొన్నాడు.

అమ్మయ్య! ఇప్పటికి తనకు వీరుడికి వుండ వలసిన అన్ని లక్షణాలూ ఏర్పడ్డాయి. (కాకపోతే— కిర్రు కిర్రు మంటుంది కానీ) ఒక మంచికవచం వున్నది. (తలకు పెద్దదైంది కానీ) ఒక వుక్కుటోపీ వున్నది. (అన్నట్లు—యీటోపీ పెట్టుకొన్నప్పుడల్లా అది పడిపోకుండా నుదుటికీ తలకు చుట్టూతా తుమ్మ జిగురుతో అంటించుకోవాలి.) (ఆట్టే దూరం పరుగెత్తలేదు కానీ) చక్కని గుర్రంకూడా వున్నది. మంచి యీటె కూడా దొరికింది. తన పేరు ఎంచక్కా ముద్దు వచ్చేట్లుగా మారిందీ! ఇహ పోతే వున్న కొరతల్లా ఒక్కటే. ప్రతివీరుడి కథలోనూ ఒక అమ్మాయి

వుంటూ వుంటుంది. ఆ అమ్మాయిపేరు తలుచుకొనే ప్రతివీరుడూ అంతంత సాహసకార్యాలు చేసేవాడు. మరి తనకు అలాటి అమ్మాయి ఎవరూ లేదే? ఏ అమ్మాయీ లేకపోతే తనేం సాహసకార్యాలు చేయగలడు? ఏమిటి చెయ్యటం అని ఆలోచించాడు. తెగ ఆలోచించాడు. అసలు అలాటి అమ్మాయి వుంటేనే గాని కథసాగదు. తను ఏపని చేసినా ఆ అమ్మాయి కోసమే చెయ్యాలి. ఒక్కొక్క యుద్ధంలో తాను విజయచిహ్నంగా సంపాదించిన శత్రువుల కత్తులు, తాను నరికిన తలకాయలు వీటి నన్నిటినీ తాను ఏకాయకిని తీసుకువెళ్లి ఆమె పాదాలముందు నజరానాలుగా పడవేయాలికదా? అసలు - ఓ అమ్మాయి అంటూ వుండి, ఆ అమ్మాయిపేరు అలా తన మనస్సులో ఎల్లప్పుడూ ఆరని దీపంలా వెలుగుతూ వుంటేనే కదా తనచేతికి శక్తీ తన కత్తికి పదునూ వచ్చేది? పెద్ద చిక్కే వచ్చిపడింది. తాను యింతవరకు ఎరిగివున్న ప్రతిస్త్రీనిగురించీ మనస్సులో సుదీర్ఘంగా చర్చించుకొన్నాడు. వారిలో ఏ ఒక్కర్తెకీ తన హృదయాధిదేవత కాగల అర్హతవున్నట్లు అతనికి తోచలేదు. అయితే మాత్రం? తను అంతట్లో వెనక్కి తగ్గేమనిషా? అలాటి స్త్రీమూర్తిని సంపాదించి తీరుతానని ప్రతిజ్ఞపట్టాడు. మనస్సులో యీ అభిప్రాయం అట్టే పెట్టుకొని తనవూరి చుట్టుప్రక్కల వున్న గ్రామసీమలన్నీ గాలించాడు. అలా తిరగగా,

౨

## డాన్ క్విక్ సెట్

తిరగగా చివరకు అల్లంతదూరాన పోతున్న ఒకానొక స్త్రీమూర్తి యీతని హృదయంలో హత్తుకొన్నది. భేష్. ఈమె ఆకారం అదీ, తాను యింతవరకూ కలలు గంటున్న స్త్రీమూర్తికి సరిపోలుతున్నది. ఆమెకు తను 'డల్‌సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. పేరైతే కవిత్వంలో వుండే పేరుల్లాంటిదే పెట్టాడు కానీ, ఆమెకు పెద్దహోదా అదీకూడా వుండాలికదా? అందుకని ఆమెకు ఒక పెద్ద రాజకుమార్తెహోదా వున్నట్లే తాను ఒప్పేసుకొన్నాడు. పాపం ఆ పల్లె పడుచుకు యీ గొడవ అంతా. ఏమీ తెలియకుండానే డాన్ క్విక్ సెట్ ధర్మమా అని, ఓ రాకుమార్తె అయి కూర్చొంది. (ఆవిడ పేరు మనం పలుకవలసి వచ్చినప్పుడల్లా 'లేడి డల్‌సీనియా' అని గనుక అనక పోయామో—వీరశూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారికి మాంఛి కోపం వచ్చేస్తుంది.) సరే—తను వీరుడు కావటానికి వున్న ఆ ఒక్క కొరతకూడా తీరిపోయింది. ఆతని మనస్సు సంతోషంతో పొంగి పోయింది. దూరంగా కదలిపోతున్న ఆ స్త్రీమూర్తిని వుద్దేశించి డాన్ క్విక్ సెట్ తనలోనే తాను యిలా అనుకొన్నాడు.

"ఓ అందాలరాసి ; 'ఓ ముత్యాలకోవా! త్రుటి మాత్రంబున యీ వీరుని మానసంబును కొల్లగొట్టితివి కదా! నాహృదయసీమకు యికపై నీవేకదా రాణివి,

ఈ భూతలముపై జరుగు నన్యాయముల దొలగింపుమని నాకు ఆజ్ఞయిచ్చి, యీ దీనుని నీ సమక్షమునుండి తొలగించుచుంటివా? సరే. నీమనోజ్ఞ రూప లావణ్యములకు బందీనయిన నేను నీ ఆజ్ఞను పాలించి దుష్ట శిక్షణ, శిష్టరక్షణ ఒనరించి, నీమెప్పు నొందెదనుగాక."

(తాను చదివిన ప్రతివీరుని గాథలోనూ ఆయా వీరులు యీ మాదిరి భాషనే ఉపయోగించి వున్నందువల్ల, తనుకూడా యీ మాత్రం గొప్పగా మాటలు ఏరి కూర్చినందుకు తనను తానే డాన్ క్విక్ సెట్ అభినందించుకొన్నాడు.)

వీరుడు కావటానికి అన్ని హంగులూ ఏర్పడ్డాయన్న దిలాసాతో డాన్ క్విక్ సెట్ ఆరోజు రోజు అంతా కుంటిగుర్రం ఎక్కి తెగతిరిగాడు. కానీ తన ధైర్య సాహసాలను ప్రకటించుకొనేందుకు ఏవిధమైన అవకాశమూ రాలేదు. ఆ పుస్తకాలలోని వీరులకందరికీ బయలుదేరటమే తడవుగా ఏదో పెద్ద రాక్షసి ఎదురు అవటమూ, ఆ రాక్షసితో యీ వీరుడు హోరాహోరీ కత్తియుద్ధంచేసి, వాడిని హతమార్చి, అంతవరకు ఆ రాక్షసిచేతిలో చిక్కి హింసించబడుతున్న అపూర్వసుందరిని విముక్తి చేయటమూ జరిగినట్లుగా వర్ణించబడివున్నదే. నాసికా రంధ్రాలనుంచీ నిప్పులు చెరిగే భయంకర మృగమైనా కనీసం తనకంటపడివుంటే, తన పదునైన కత్తితో యిట్టే

7

డాన్ క్విక్ సెట్

దాని గొంతుకకోసి తనచేతి దురద యింత తీర్చుకొనే వాడుకదా! అదీ కనుపించలేదు. తనంతటి వీరుడు సాహసకృత్యాలు చేయటానికి సిద్ధమైతే, చేసేందుకు పని ఏదీ దొరకకపోవటమేమిటని ఆతనికి బలే చిరాకు పుట్టుకొచ్చింది. అయినా సరే ఆగకుండా పూరికే ఆ గుర్రమెక్కి తెగతిరిగాడు. చీకటి పడవచ్చే సమయానికి తనూ, తన గుర్రం 'రోజినాన్టీ' కూడా బాగా అలసిపోయారు. ఈ వేళకు చెప్పుకోదగిన సంఘటన ఏమీ జరుగదుకాబోలని డాన్ క్విక్ సెట్ నిరుత్సాహపడ్డాడు కూడాను. ఇంతలో అల్లంతదూరాన రోడుమలుపులో ఒక హోటలు కనిపించింది. ఆ హోటలు గుమ్మంలో యిద్దరు పల్లెటిపిక్కు ఆడవాళ్లు నిలబడివున్నారు. ప్రక్కనే వున్న పొలంలో పందులు కాచుకొనే మనిషి ఒకడు తన మందను మళ్లేసుకోవటానికని కొమ్ముబూరా ఊదటం మొదలు పెట్టాడు.

ఏదో పెద్ద పొడిచెయ్యాలని వుబలాటపడుతున్న డాన్ క్విక్ సెట్ కు ఆ హోటలు ఒక పెద్దకోట అయినట్లు, ఆ కోటగుమ్మంలో నిల్చునివున్న ఆడవాళ్లు యిద్దరూ గొప్పవంశంలో పుట్టిన స్త్రీరత్నాలైనట్లు, వారివద్ద పహరాకై నిలబడివున్న ఆ మరుగుజ్జువున్నాడే - వాడు డాన్ క్విక్ సెట్ వంటి వీరశూరాగ్రేసరుని రాకను తెలియపరుస్తూ బహరా వేసినట్లూ

తోచింది. డాన్‌క్విక్‌సెట్ తన మనసులో యిన్ని ఊహాలు చేస్తున్న యీ సమయంలోనే ఆ పల్లె పడుచు లిద్దరూ యీచుకుపోయిన ఆ గుర్రంమీద యీ డాలు, డవాలు తగిలించుకొని వస్తున్న మనిషిని చూడటం తటస్థించింది. అసలే మసక మసకగా చీకటి పడుతున్నదేమో, వాళ్లిద్దరూ యీవింతఆకారాన్ని చూచి భయపడిపోయి కెవ్వున కేకవేసి పారిపో బోయారు. వాళ్లు హోటల్లో దూరబోయేలోగా డాన్ క్విక్‌సెట్ వాళ్ల దారికి అడ్డంవచ్చి నిలుచుని—

"భీతహరిణేక్షణలారా! బేలలై యిటు పారిపోయెద రేల? నేను వీరులవర్గమునకు చెందినవాడను. వీరులైనవా రెవ్వరైననూ మిముబోలిన వుత్తమవంశసంజాతలకు కీడు చేయుదురే? భయపడవలదు; భయపడవలదు." అంటూ అభయహస్త మెత్తాడు. ఆ పల్లెపడుచులకు యీ పెద్దమనిషి ఆకారం, ఆయన తొడిగిన ఆ తుప్పుకవచం, తుమ్మ జిగురుతో అంటించుకొన్న ఆ ప్రకృటోపీ కొటున్న టెక్కి తోడు, నాటకాలలో మాదిరిగా యీ సంభాషణ శైలి ,యివన్నీ చూస్తే చమత్కారంగా తోచింది. ముష్టి ఎత్తుకొనే తమను పట్టుకొని యీయన వుత్తమ వంశ సంజాత లనటంతో మరీ నవ్వువచ్చి, పగలబడి నవ్వటం మొదలుపెట్టారు. ఈ యికయికలు, పకపకలు చెవినిపడ్డ హోటలుయజమాని, అసలు విషయం ఏమిటో అని గబగబా పరుగెత్తుకొంటూ

వచ్చాడు. ఆతని శరీరం కొంచెం స్థూలమేమో, పరిగెత్తటం చేతకాక దొర్లుకొంటూ దొర్లుకొంటూ వచ్చాడు. వచ్చినవాడు ముట్టెదించుకుపోయిన ముసలి గుర్రంమీద యీ బుట్టబొమ్మను చూచి, ఆతడు మాట్లాడే ఆధోరణి చూచి, తనకూ నవ్వు వచ్చింది. ఎంతకైనా వ్యాపారం చేసే మనిషి కదూ! పైకి పొంగి వస్తున్న నవ్వు అణచివేసుకొని తనుకూడా డాన్ క్విక్ సెట్ బాసనే అనుకరిస్తూ—

"హేపిరా గ్రేసరా! తమకిదే మా స్వాగతంబు; సుస్వాగతంబు. రండు. ఒకింత విశ్రమించి మే మీయ గల అల్పాహారంబుల సేవించి సేదదీర్చుకు." అన్నాడు. ఆ హోటలు యజమాని తనకిచ్చిన స్వాగతానికి డాన్ క్విక్ సెట్ ఎంతో ఆనందించాడు. ఆ హోటలు యీయన కంటికి కోటలా కనుపిస్తున్నదికనుక దాని యజమానిని ఆ కోటకు గవర్నరుగా యీయన గుర్తించాడు. అట్టి గవర్నరుగారిపట్ల గౌరవభావం ప్రకటించాలనే ఆలోచన రాగానే డాన్ క్విక్ సెట్ గుర్రం మీంచి చప్పున దిగాడు హోటలు యజమాని (కాదు కాదు ---గవర్నరుగారు) డాన్ క్విక్ సెట్ గారి గుర్రాన్ని పశువుల కొష్టంలోకి నడిపించుకు వెళ్ళాడు. డాన్ క్విక్ సెట్ ఆ యిద్దరు అంగనలవైపుకు తిరిగి తనవంటిపై గల కవచం వగైరా సామాను నింపాదిగా ఒలిచిపెట్టవలసిందిగా కోరాడు. వారిద్దరూ కూడా యీ తమాషాకు లోలోపల నవ్వుకుంటూ అందుకు

ఉపక్రమించారు. కవచమూ, కాలికివేసిన తొడుగులు తీసివేశాక వాళ్ళిద్దరూ కలిసి నెత్తిమీది ఉక్కుటోపీని ఊడదీయబోయారు. ఆ టోపీకి, డాన్‌క్విక్ సెట్ నుదుటి మధ్యను రంగు రంగుల రిబ్బన్లు అట్టముక్కలు సీనారేకుబిళ్ళలు అతికించివున్నందువల్ల టో పీ ని ఊడదీయటం వీళ్ళకు కష్టమే అయింది. అదీకాక అసలు ఆ టోపీ మాత్రం తలమీదినుంచి తీసివేయ టానికి చస్తే ఒప్పుకోనని డాన్ క్విక్‌సెట్ పంతం పట్టాడు.

ఈలోగా హోటలుయజమాని (కాదు, కాదు - గవర్నరుగారు) ఉడికీ ఉడకని ఉప్పుచాపలు, గవులు కంపుకొట్టుతున్న రొట్టెముక్కలు పళ్ళెలలో పట్టు కొచ్చి అతివినయంగా డాన్ క్విక్‌సెట్ ముందు పెట్టాడు. ఆ వంటకాలు ఎంత వాసనగొడుతున్నా, ఎంత తినరానివిగావున్నా, డాన్ క్విక్ సెట్ అంచనా ప్రకారం యీలాంటి కోటలో తనకు పెట్టేది పంచభక్ష్య పరమాన్నాలే కాని అన్యం కాదాయెను. అందుకని ఆ చేపలు అవి కముల్చుకు బయటకు వస్తున్నా, డాన్ క్విక్ సెట్ మాత్రం ఆప్యాయంగానే తిన్నాడు. తిండి యీతీరుగా వుంటే తినేందుకు వీల్లేకుండా రెండు చేతులతోనూ తలమీది టోపీ పట్టుకొనివుండవలసి వచ్చింది. ఈ పరిస్థితులలో ఆఅంగనలు యిద్దరూ దగ్గిరచేరి రొట్టెముక్కలు, చేపముక్కలు ఆతని నోటికి అందించారు. ఒక చెంపను తింటూవున్న పదార్థం

నోటికి హితవులేక వెళ్ళుకువస్తున్నా, యీ విధంగా వుత్తమవంశసంజాతలైన స్త్రీరత్నా లిద్దరు యిరు పార్శ్వాల చేరి సేవిస్తుండగా యీ 'పంచభక్ష్య పరమాన్నాలు' యిలా తినగలిగే భాగ్యం మరి ఎవరికీ వుండబోదు కదా అనుకొంటూ డాన్ క్విక్ సెట్ విందు ఆరగించుతున్నాడు. ఇంతలో బయట ఎవడో పందులు కాసుకొనేవాడు పందులను అదలించటానికి కొమ్ము వూదాడు. ఆధ్వని విని అది తన గౌరవార్థం యీ కోటలో వినిపించిన వాద్యవిశేషమేనని డాన్ క్విక్ సెట్ చంకలు ఎగురవేశాడు.

బయట వినిపించిన బాకాధ్వని తన గౌరవార్థమే కోటయజమాని వూదించాడని డాన్ క్విక్ సెట్ తనలో తానే వుబ్బిపోయాడు. ఇంతలో అతని మనస్సులో ఒక శంక బయలుదేరింది. చెటల్లే విప్పారివున్న ఆతని ముఖం ఒక్కసారిగా ముడుచుకుపోయింది. ఆ శంక ఏమిటో తెలుసా ? తనకైతే వీరుడికి వుండవలసిన ఒక కవచం, ఒక వుక్కుటోపీ, ఒక గుర్రం, ఒక ఆరాధ్య దేవత అన్నీ వున్నాయి కానీ వీరాభిషేకం కాలేదుగదా అని. అది కాకపోవటం వీరుడైనవాడికి ఎంతటి కొరత? వీరాభిషేకం చేయించుకోకుండా సాహసకార్యాలు మొదలు పెట్టటానికైనా తనకు అర్హత లేదే ! చ్ఛ... చ్ఛ...చ్ఛ...ఎంత పొరపాటు. ఈ లాంఛనం యిదివరకే అయిపోయిందనిపించుకొని యీ వీరవిహారానికి బయలుదేరివుంటే తీరిపోయేది కదా ! ఇప్పుడు

మాత్రం మించిపోయిందేముందని తింటూ తింటూ వున్న తిండిని ఆపేసి, ఆ పళ్ళేలను పట్టుకుపొమ్మని ప్రక్కనవున్న స్త్రీరత్నాలను పురమాయించాడు. వున్నపళంగా లేచి పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ హోటల్ యజమాని (కాదు కాదు—కోటగవర్నరు గారు) ఏమూల వున్నాడో వెదుక్కుంటూ పోయి, ఆయనముందు సాష్టాంగపడి రెండు కాళ్లూ పుచ్చుకొని తనకు వీరాభిషేకం చేయమని బ్రతిమాలాడు.

ఆ హోటల్ యజమానికి యిదంతా వింతగానే తోచింది. వెర్రికాకపోతే—యీయన వీరు డేమిటి? ఈ వీరుడికి తాను వీరాభిషేకం చేయించట మేమిటి? అసలు అంతకు ముందే యీ డాన్‌క్విక్ సెట్ గారి బుర్ర కేమైనా చెదలుపట్టాయేమో అన్న అనుమానం ఆ హోటలు యజమానికి ఎలాగూ కలిగింది. ఇప్పుడు ఆ వ్యక్తి వచ్చి అలా తన కాళ్లు పట్టుకు బ్రతిమలాడటంతో యీయన అనుమానం దృఢమైంది. ఈ పిచ్చివాడిని వుబ్బవేసి కాలం సరదాగా వెళ్ళబుచ్చవచ్చు కదా అని హోటల్ యజమాని పైకిమాత్రం డాన్ క్విక్ సెట్ కోరికను ఎంతో మన్నిస్తున్నట్లు ఆయనను వీరుడుగా గుర్తిస్తున్నట్లు ప్రవర్తించాడు. ముఖంలో ఎక్కడా ఎగతాళిఛాయలు కనుపించనీయకుండా చూసుకొని, "హే! వీరాగ్రేసరా, నీ అభ్యర్థనను అనుసరించి నీకు వీరాభిషేకము చేయ నిచ్చగించుచున్నాను. వీరాభిషేకమునకు పూర్వము

నీవొక వీరోచితకార్యమును ఒనరింపవలసివున్నది కదా ? నీ కవచాదులను ఒకచో నుంచి యీ రాత్రి రాత్రి అంతయు వాటిని ఏ తుస్కరుడూ ఎత్తుకొని పోకుండా కాపాడుకొనుము. రేపటి ప్రాతఃకాలమున నే నీ యీప్సితము నెరవేర్చెద గాక." అని గంభీరంగా అన్నాడు. అలా అంటూ హోటల్ అని పిలువబడే తనకోటలో యీ కవచాదులను దాచివుంచదగిన భవనం ఏదీ లేదనీ, అక్కడే అల్లంతదూరంలో కనిపిస్తున్న నీళ్లగాబులో ఆ కవచాదులను పడవేసి తొలికోడి కూసేవరకు కాపలా కాయవలసిందనీ సలహా యిచ్చి తాను తప్పుకొన్నాడు. హోటల్లోపలికి పోయి యింకా కొంతమందిని కూడగట్టుకువచ్చి డాన్ క్విక్ సెట్ కు కనిపించకుండా ఒకచోట నిల్చొని యీయన ఏం చేస్తాడో చూస్తున్నాడు.

డాన్ క్విక్ సెట్ ధీమాగా తన కవచాదులను తీసి గుర్రాలు నీళ్లుతాగే ఆ తొట్టిలో పడవేసి, యీటె పుచ్చుకొని దానిచుట్టూ తిరుగుతూ కాపలా కాస్తున్నాడు.

పుచ్చపువ్వులా వెన్నెల కాస్తున్నది. ఆ వెన్నెల అదీ చూసేసరికి డాన్ క్విక్ సెట్ మనస్సు బలే తేలిక పడింది. వీరాభిషేకం కాలేదన్న ఆ ఒక్క కొరత కూడా రేపు తెల్లవారేలోగా తీరిపోతున్నదాయెను. మరి అతని మనసు ఎందుకు తేలికపడదు ?

ఆవిధంగా రాత్రిలో చాలా భాగం ఏగొడవా లేకుండా ప్రశాంతంగానే గడిచిపోయింది. ఒక ఝామును రాత్రి గడిచాక సరుకులు మోసుకుపోయేవాడొకడు తన కంచర గాడిదను తీసుకొని ఆ హోటలు ఆవరణలోకి వచ్చాడు. ఆ కంచరగాడిద అలసిపోయివున్నదేమో, యిన్ని నీళ్లు అయినా పట్టుదామని కళ్లెం పుచ్చుకొని గాబుదగ్గిరకు నడిపించుకువచ్చాడు. తీరా వచ్చిచూస్తే, తనగాడిద నీళ్లు తాగేందుకు వీలులేకుండా ఆ తొట్టిలో తుప్పుపట్టిన కవచం పడివుండటం చూచి అతడికి వళ్లు మండుకుపోయింది. విసుక్కుంటూ కసుక్కుంటూ అతడు ఆ కవచాన్ని తీసి యివతల పారేశాడు. ఇదంతా చూస్తున్న డాన్ క్విక్ సెట్ ఆపాదమస్తకం కోపంతో కంపించిపోయాడు. ఒక్కమారు పెద్దగా హుంకరించి తనచేతిలో వున్న యీటెమడముతో వాడి నెత్తిన ఒక్కటి పెట్టాడు. దెబ్బ బలంగా తగిలిందేమో, దెబ్బ తిన్నవాడు కిక్కురు మనకుండా పడిపోయాడు. డాన్ క్విక్ సెట్ ఒక్కసారిగా విజయాట్టహాసంచేసి ముందుకు వంగి క్రింద పడివున్న తన కవచాన్ని అతిపదిలంగా ఎత్తి మళ్లీ గాబులో పడవేసి, ఎప్పటిలాగు ఏమీ జరుగనట్లు కాపలా కాయటం మొదలుపెట్టాడు.

మరికొద్దిసేపట్లోనే మరొకడు యిలాగే తన కంచరగాడిదను తీసుకువచ్చి నీళ్లు త్రాగించ

బోయాడు. గాబులో అడ్డంగా యీ కవచం పడివుండటం చూసి యితడూ చిరాకుపడి దాన్ని తీసి యివతల పారేశాడు. ఇంతకు ముందే యీపని చేసినందుకు ఒకడికి శాస్తి అయివుండగా, వీడెవడో తలమాసిన వాడు మళ్లీ అదేపని చేస్తున్నందుకు డాన్ క్విక్సెట్‌కు కోపంతోపాటు జాలికూడా కలిగింది. అక్కడికీ ముందుగానే చావబాదటం ఎందుకని, పెద్ద పెద్ద తిట్లు జతపరచి వీలైనన్ని విధాల వాడికి హెచ్చరికలు చేశాడు. కోపంవచ్చిందంటే తాను మనిషిని కానని ఎన్నిమార్లు చెప్పినా వాడు వినకుండా తన కవచాన్ని తీసి యివతల పారేసేసరికి, నిజంగా యితనికి మనిషికి వచ్చేంత కోపం వచ్చేసింది. ఏమైతే అదే అవుతుందని బలంకొద్దీ ఆ యీటెమడిమ పుచ్చుకొని ఆ వెంకె ఘటంతలపై ఒక్క దెబ్బ వేశాడు. ఒళ్లు తెలియని ఆవేశంలో కొట్టాడేమో, వాడి బుర్ర కాస్తా బద్దలు అయింది. వాడు 'చచ్చాన్రో' అంటూ నేలమీద కుప్పన కూలబడ్డాడు. వీడి కేక విన్న మరికొంతమంది సరుకులుమోసే ముఠావాళ్లు గబగబా అక్కడకు పరుగెత్తుకుంటూ వచ్చి, తమ ముఠాలో ఒకణ్ణి కొట్టి చంపుతున్న డాన్ క్విక్సెట్‌మీద అందరూ కలసి రాళ్లు రువ్వటం ప్రారంభించారు. వాళ్లు విసిరే రాళ్ళు తగలకుండా చేసుకోవటానికి డాన్ క్విక్సెట్‌కు ఏ దిక్కూ తోచక, తానింతవరకు ఏ గిల్లగాబు చుట్టూ అయితే పహారా తిరుగుతున్నాడో ఆ గాబు

ప్రక్కకే పోయి, దానిచాటున ముడుచుకు కూర్చున్నాడు.

ఇదంతా యింతసేపూ చాటునుంచి చూస్తున్న హోటల్ యజమాని, యిక పరిస్థితులు విషమించిపోతున్నాయని గుర్తించినవాడై, అనుచర బృందంతో యివతలకు వచ్చి 'అగమ'ని అందరినీ అదిలించాడు. ఇప్పటికి యీ వెర్రివాడి వెకిలిచేష్టల్తో ఆతనికి ముఖం మొత్తిపోయింది. ఆ కారణంచేత డాన్‌క్విక్‌సెట్‌ని తొలికోడి కూసేటంతవరకు కాపలా కాయనక్కర లేదని పురమాయించాడు. వీరాభిషేకం చేయటానికి యింతవరకూ ఆతడు ప్రదర్శించిన ధైర్యసాహసాలే చాలునని కూడా ఆ హోటల్ యజమాని బాహాటంగా ప్రకటించాడు.

ఒక కుర్రవాణ్ణిపోయి వెలిగించిన కొవ్వువత్తులు రెండు పట్టుకురమ్మని కేకవేశాడు. ఆ పల్లె పడుచులను యిద్దరినీ నిద్దురలేపి తీసుకురమ్మన్నాడు. ఈ ఏర్పాట్లు అన్నీ ముగిశాక, తాను హోటల్ పద్దులు వ్రాసే చిట్టా తీసుకువచ్చి ఒకపేజీ తెరిచి పట్టుకొని ఏవేవో మంత్రాలు చదివినట్లుగా ఆపద్దులే బిగ్గరగా చదివేశాడు. డాన్ క్విక్‌సెట్‌ను మోకరిల్లమని బారెడు పొడుగున్న కత్తి ఒకటి పుచ్చుకొని ఆ కత్తిఅంచుతో ఆతని భుజంపై తట్టాడో, కొట్టాడో—మొత్తానికి ఆ క్రతువు పూర్తి చేశాడు.



“పాపభూయిష్టమైన యీ భువిని ధర్మమును కాపాడుము. అధర్మమును అణచివేయుము. సాక్షాత్తు

ఆ పరమేశ్వరుడు నిమిత్తమాత్రుడనైన నాద్వారా నీకీ ఆజ్ఞయిచ్చుచున్నాడు. నేడు మొదలుకొని ధర్మ రక్షణమే నీ దీక్ష. ఈదీక్షనిర్వహణమునందు నీ ప్రాణమునైనను లెక్కసేయకుము." అంటూ మతబోధకుల ధోరణిలో వుపన్యాసం దంచివేశాడు. డాన్ క్విక్ సెట్ కళ్లవెంట ఆనందాశ్రువులు జొటజొట రాలాయి. ఆ అంగనలు యిద్దరూ డాన్ క్విక్ సెట్ దగ్గరకు వచ్చారు. ఒకామె పొడుగాటి కత్తిని ఆతని నడుముకు బిగించి కట్టింది. మరొకామె గుర్రంమీద జీనూ అదీ సిద్ధంచేసింది. అంతటితో డాన్ క్విక్ సెట్ గారి వీరాభిషేకమహోత్సవం వైభవోపేతంగా ముగిసింది.

డాన్ క్విక్ సెట్ మహానందంతో వుప్పొంగిపోయాడు. తన వీరాభిషేకంలో పాల్గొన్న వ్యక్తులందరికీ పేరు పేరున కృతజ్ఞతాపూర్వకమైన అభివందనాలు అందచేశాడు. ఈ మహోత్సవంలో ఔత్సుక్యంతో పాల్గొన్న ఆ యిద్దరు స్త్రీలవిషయమూ యితడు మరింత శ్రద్ధగా అడిగి తెలుసుకొన్నాడు. ఒకామె తాను చెప్పలు కుట్టేవాని కూతురుననీ, తన పేరు 'టొలోసా' అనీ చెప్పింది. రెండో ఆమె తానొక పిండిమర యజమాని కూతురుననీ, తనపేరు 'మొలివేరా' అనీ చెప్పింది. ఈ యిద్దరు కన్యలు తనకు వీరాభిషేకం చేయించటంలో కనుపరచిన శ్రద్ధకు మెచ్చి డాన్ క్విక్ సెట్ వారిద్దరికీ 'లేడీ'

బిరుదులు యిచ్చేశాడు. ఇకపై వారు తమ నామధేయాలకు ముందు యీ 'లేడీ' బిరుదాలను కూడా చేర్చుకొని 'లేడీ టొలోసా' అనీ, 'లేడీ మొలినేరా' అనీ పిలిపించుకోవలసిందిగా అనుమతించాడు. డాన్ క్విక్ సెట్ వెర్రివాగుడుకు వారిద్దరూ లోలోపల నవ్వుకొంటూనే, పైకి మాత్రం ఆయన ఆజ్ఞమేరకు లేడీబిరుదాల్ని స్వీకరించి పాటిస్తామని ఆయనకు వాగ్దానం చేశారు.

ఈ భాగోతం అంతా పూర్తి అయ్యేసరికి ఆకాశంలో తూర్పున తెల్లరేకలు అముతున్నాయి. తనను వీరుణ్ణిగా చేసినందుకు ఆహోటల్ యజమానిని (కాదు కాదు—కోటగవర్నరుగారిని) తదితరులను మరొకసారి మనసార అభినందించి, వారందరివద్దను శెలవు పుచ్చుకొని డాన్ క్విక్ సెట్ తన ముద్దుల గుర్రం 'రోజినాన్టీ' మూపున ఎక్కినవాడై విశాల ప్రపంచంలోకి వెళ్లాడు.

## 2

డాన్ క్విక్ సెట్ తాను వీరుణ్ణి అయ్యానన్న వుబలాటం తీరకముందే, ఆమరునాడే, ఒక విచిత్ర సంఘటనలో చిక్కుకుని, పళ్లు హూనం చేసుకొన్నాడు.

ఆ తెల్లవారుఝామున వీ రా భి షే కం చేయించుకొని బయలుదేరి 'రోజినాన్టీ'ని జోరుగా,

పోనిచ్చాడు. ఫలానిచోటికి పొమ్మని ఆగుర్రానికి తాను పురమాయించకుండా, ఆ గుర్రం తీసుకు పోయినచోటికి తానే పోవటం మంచిదని అతనికి అనిపించింది. అలా అనిపించటానికి కొన్ని కారణాలు వున్నాయి. ఈరోజుల్లో అన్యాయం జరుగనిచోటు అంటూ ఎక్కడ వుందీ? ఎక్కడా లేదు. అలాంటప్పుడు ముందుగా ఏ అన్యాయాన్ని అణచాలీ అనే సమస్యను పరిష్కరించే బాధ్యత గుర్రానికే వదిలేస్తే మంచిది. ఇది మొదటికారణం. రెండోది— తన గుర్రం రోజినాన్టే వున్నదే—అది బలే తెలివైన గుర్రం! అసలు ఒక్కొక్కప్పుడు నిజంగా తనకంటే కూడా అదే తెలివైనదేమోననే అనుమానం డాన్క్విక్సెట్‌కు అప్పుడప్పుడూ తగులుతూనేవుంటుంది. అలాంటప్పుడు ఎక్కడికి పోవాలి అనే విషయాన్ని తేల్చలేక తన బుర్ర పాడుచేసుకోవటంకంటే కూడా ఆ విషయాన్ని తెలివిగల యీ గుర్రానికి వదిలేయటమే తెలివైనపని అనిపించుకొంటుంది. అందుకని తాను నిశ్చింతగా గుర్రం ఎక్కి కూర్చున్నాడు. ఆ గుర్రం మాత్రం తాను యింతవరకూ వుండటానికి అలవాటుపడివున్న 'లామంచా' గ్రామంలోని డాన్క్విక్సెట్ గారి పశువులకొష్ఠం వైపుకే దారి తీస్తున్నది. ఆనందపారవశ్యంలో మునిగి తేలుతున్న డాన్క్విక్సెట్ యిది గమనించనేలేదు. ముసలి గుర్రం తక్కుతూ తారుతూ మందగమనంతో

ముందుకు పోతూనేవున్నది. ఇంతలో అల్లంత దూరంలో పెద్దపెద్ద గొడుగులు వేసుకొనిపోతున్న గుంపు ఒకటి డాన్ క్విక్సెట్ కంటబడింది. ఆరుగురు వర్తకులు గుర్రాలమీద ఎక్కి, ఎండ తగలకుండా పెద్ద గొడుగులు పట్టుకొని పోతున్నారు. వీళ్ళకు నలుగురు జమానులు. ఆ జమాన్లు కూడా గుర్రాలమీదే స్వారీ చేస్తున్నారు. కంచరగాడిదలను తోలే మరి ముగ్గురు కూడా వీళ్లవెంట కాలినడకను వస్తున్నారు.

వీరాభిషేకం కూడా పూర్తి చేయించుకొని సాహసకార్యాలు చేయాలని తపించి పోతున్న డాన్ క్విక్సెట్ కళ్లకు, వాళ్లదారిని వాళ్లు పోతున్న యీపదిమంది మనుష్యులూ పెద్ద రాక్షసుల్లా కనిపించారు. అలా అతని మనసుకు తోచీ తోచటంతో వాళ్లు పోతున్న దారికి అడ్డంపడి తన యీటెను హద్దుగా పెట్టి "ప్రాణములపై ఆశవున్నవారెవ్వరైననూ సరే—యీహద్దును దాటుటకుముందు 'లామంచా' సామ్రాజ్ఞి 'డల్సీనియా డెల్ టొబొసా' రాకుమారిని మించిన అందగత్తె యీ ముల్లోకములం దెచ్చటను లేదని ఒక్కమాటు గొంతెత్తి చాటవలె. ఇది నాయాజ్ఞ." అంటూ హుంకరించాడు.

ఈ వాగుడూ, ఆమనిషీ ఆకారమూ చూసి యీ వర్తకులు కూడా వెనుకటి హోటల్ యజమాని మాదిరిగానే, యిదేదో వెర్రి వేషం క్రింద జమకట్టుకొన్నారు. ఆ పదిమందిలో ఒకడికి కాసేపు పెనిత్రో

కులాసాగా కాలక్షేపం చేయాలనే బుద్ధిపుట్టింది. అందుకని లేనిపోని నమ్రత నటిస్తూ "మహాభాగా, ఏ రాకుమారి సౌందర్యాతిశయాన్ని మీరు యింతగా కొనియాడుతున్నారో ఆమెను మేమెవ్వరమూ చూచి వుండలేదు. తమరు దయచేసి ఆమెను మాకు ఒక్కసారి చూపిస్తే, ఆమెకు నిజంగా అంతటి అందంవుందని మాకు తోస్తే, మీరు కోరినట్లే తప్పక ఆమెను మించిన అందగత్తె యీ ముల్లోకాలలో ఎక్కడా లేదని చాటగలం" అన్నాడు. డాన్ క్విక్సెట్ మాత్రం ఏం తక్కువ తిన్నాడా! "మూఢులారా? ఆమెను ఒకసారి చూచినతరువాత ఆమె అందమునుగూర్చి మీరు ప్రస్తుతించుటలో గొప్పదనము ఏమున్నది? ఆమెను చూడకయే ఆమెను మించిన అందగత్తె 'నభూతో నభవిష్యతి' అని గుర్తించి ప్రస్తుతించటంలోనే కదా మీ జన్మలు సార్థకమయ్యేడిని? మీరట్లు ఆమెను ప్రస్తుతింప నిరాకరించుచో, వ్యర్థములైన మీ నాలుకలను, యిదే, నాకత్తితో శత సహస్ర ఖండములుగా ఖండించెద. కాచుకొనుడి." అంటూ బిగ్గరగా అరిచాడు.

"మహాశయా! మీరు ఆమెను చూపించక పోయిన పోనే. ఆమె చిత్రాన్నైనా చూపించండి. ఆ బొమ్మలో ఆమెకు ఒకకన్ను గ్రుడ్డిదైవున్నా కూడా, మీరుకోరినట్లే ఆమె అందగత్తె అని ఒప్పుకొంటాం"

అని యిందాక మాట్లాడిన వర్తకుడే యిప్పుడు మళ్లీ సమాధానం యిచ్చాడు.

"ఏమేమీ! నా హృదయాధిదేవతను అంధురాలందువా! కుటిలజన ధిక్కారము సైతునా! ధిక్కార...ధిక్కార" మంటూ ఆ వర్తకుడిమీదికి తన యీటెను గురిచూసి గుర్రాన్ని ముందుకు దూకించాడు. పాపం, ఆ వర్తకుడు యీతని కోపానికి బలి అయ్యేవాడే! కానీ ముసలిగుర్రం మత్తుగా నిలుచుని వుండి వుండి, ఒక్కసారిగా కదలబోయేసరికి ముందు కాళ్లు వంగక కూలబడి పోయింది. గుర్రంతో పాటు డాన్ క్విక్ సెట్ కూడా క్రిందపడి వుండలాగా చుట్టుకుపోయి పల్లంలోకి దొర్లుకొంటూ, దొర్లుకొంటూ పోయి, అల్లంత దూరంలో ఆగిపోయాడు. తగిలిన దెబ్బలకుతోడు ఆ యినపకవచము, వుక్కుడాలు, వుక్కుటోపీ యివన్నీ కలసి అతని వంటిమీద పెద్ద గాడిద అంతబరువు తేలి అతణ్ణి తెగ కుంగదీశాయి. మనిషి కదలలేకపోయాడు. సమయం కనిపెట్టి కంచర గాడిదలు కాసే మనిషి ఒకడు గబగబా వచ్చి యీతని యీటెను వూడలాక్కొని, దానిని మూడు ముక్కలుగా విరగగొట్టి, ఒక్కొక్క ముక్కతో ఒక్కొక్కసారిచొప్పున క్రిందపడివున్న డాన్ క్విక్ సెట్ వీపుమీద తాషామర్పా వాయించాడు. చేతుల దురద తీరేదాక అలా డాన్ క్విక్ సెట్ వీపుమీద మద్దెల వరుసలన్నీ వాయించి, అంతకుముందే ముందుకు

సాగిపోతున్న తమ బృందంవారిని కలుసుకొనేందుకు దౌడు తీశాడు.

డాన్ క్విక్ సెట్‌కు యీ దెబ్బలతో బొమికల్లో సున్నం లేకుండాపోయింది. దీనికి సాయం, యీ యినపతొడుగు ఒకటి. దీనిదుంపతెగ-యిది మణుగుల బరువు వున్నది. లేవబోతే ఒక చెయ్యికానీ, ఒక కాలుకానీ ఏదీ స్వాధీనంలోకి రాలేదు. చేసేది ఏమీలేక ఆకాశంలోకి గ్రుడ్లప్పగించి చూస్తూ అలాగే గంటల తరబడి పడివున్నాడు. ఇప్పటికీ అలాగే అక్కడే పడి వుండేవాడేమో కానీ,—యింతలో వాళ్లవూరివాడే ఒక రైతు, పొలంపనిమీద పోతూ ఆ దారివెంట వచ్చాడు. ఎవడో మనిషి యిలా కట్టెలా పడివుండటం చూసి జాలివేసి, దగ్గరకు వచ్చాడు. తన వూరి మనిషేనని పోల్చుకొన్నాడు. డాన్ క్విక్ సెట్ ఆరైతుతో తనకేమీ గాయాలు తగలలేదనీ, కొద్దిగా బొప్పెలు మాత్రం కట్టాయనీ చెప్పుకొన్నాడు. చిందర వందరగా పడిపోయివున్న ఆ కవచాన్నీ, టోపీనీ, డాలును, ముక్కలు ముక్కలుగా పడివున్న యీటెను పోగుచేసి కట్టగా కట్టి ఆరైతు రోజినాన్‌టీ వీపుమీద పడవేసి దానిని తాను నడిపించుకువచ్చాడు. డాన్ క్విక్ సెట్‌ను నింపాదిగా లేవనెత్తి తన గాడిదమీద ఎక్కించి, ఆ గాడిదనూ, యీ గుర్రాన్నీ కూడా చీకటిచాటున స్వగ్రామానికి చేరవేశాడు.

డాన్ క్విక్ సెట్ కొంపకు చేరేసరికి మంత్ర బోధకుడూ, పూరిమంగలీ తనయింటి అరుగుమీద చేరి దాదితో బాతాఖానీ వేస్తున్నారు. వాళ్లంతా యీాయన యీస్థితిలో యింటికి తిరిగివచ్చినందుకు దిక్కుతోచక తికమకపడ్డారు. అప్రస్తుతకొద్దీ వాళ్లడిగిన అన్ని ప్రశ్నలకు డాన్ క్విక్ సెట్ తాను పదిమంది భయంకర రాక్షసులతో యుద్ధంచేస్తూ గుర్రంమీద నుంచి క్రిందపడి దెబ్బలు తిన్నానని మాత్రం సమాధానం యిచ్చాడు. ఆవేళకు యిక తనను 'ఏమిటి, ఎందుకు' అంటూ ప్రశ్నలు వేసి వేధించక, కాసేపు విశ్రాంతిగా పడుకోనిమ్మని బ్రతిమాలాడు.

## 3

ఆరోజు ఆ పదిమంది వర్తకులతోనూ యుద్ధంచేసి చావుదెబ్బలు తిని యింటికి చేరిన డాన్ క్విక్ సెట్ పదిహేను రోజులపాటు ఏవూసూ ఎత్తకుండా యింటిపట్టునే వుండిపోయాడు. ప్రతిరోజూ ప్రొద్దునా, సాయంకాలం వంటిమీద గాయాలన్నిటికీ అతిశ్రద్ధగా మందు పట్టించుకు పొద్దస్తమానం కదలకుండా పక్కమీద పడుకొనేవాడు. ఇంతవరకు యీాయన పోయిన పోకడలవిషయం కర్ణాకర్ణిగా విన్న పూరివారందరూ, ఒకరి తరువాత మరొకరుగా

వీళ్లయింటికి వచ్చి మంచం ఎక్కిన యీ పిచ్చిణ్ణి పరామర్శలు చేసి వెళ్లారు.

ఈయనయింట్లో దాది ఒకామె వున్నది. ఎన్నో ఏండ్లుగా యీ యింట్లోనే పనిచేస్తున్న కారణం చేతనూ, ఆ యింట్లో వేరే ఆడదక్షత లేని కారణం చేతను, ఆమెకు ఆయింటి వ్యవహారాలలోని అనుపానులన్నీ తెలిశాయి. ఇప్పుడు ఆమె ఒకవిధంగా ఆయింటికైన మనుష్యులల్లో ఒకతె అన్నట్లుగా వ్యవహరిస్తోంది

ఆ యింట్లో పన్నెండు పదమూడేండ్ల చిన్న అమ్మాయి కూడా వున్నది. ఈ అమ్మాయి డాన్ క్విక్ సెట్ తోబుట్టువు కూతురు. ఆ పిల్ల తల్లి తండ్రులు చనిపోయినప్పటి నుంచి యీ మేనమామదగ్గిరే వుంటున్నది. డాన్ క్విక్ సెట్ కూడా తనకు పెళ్లామూ పిల్లలూ ఎవరూ లేకపోయినందువల్ల, యీ పిల్లను తీసుకొనివచ్చి, తనదగ్గిరే అట్టే పెట్టుకు పెంచుతున్నాడు.

కాబట్టి ఆయింట్లో డాన్ క్విక్ సెట్ ను గురించి ఆందోళనపడేవాళ్లు ఆ ముసలమ్మ, యీ పసిపిల్ల తప్పించి వేరే ఎవరూ లేరు. వీళ్లిద్దరూ అసలు జరిగిన విషయమంతా ఆనోటా ఆనోటా విని దిగులుపడ్డారు. దెబ్బలు తిని యింటికి తిరిగి వచ్చాక డాన్ క్విక్ సెట్ మళ్ళీ సాహసకార్యాల వూసు ఎత్తకుండా కుదురుగా వుంటున్నందుకు వాళ్లిద్దరూ లోలోపలే ఎంతో

సంతోషించారు. ఎంత సంతోషంగా వున్నా, యీ కయ్యాలిమనిషికి మళ్లీ ఎప్పుడు పురుగుతొలుస్తుందో, ఎప్పుడు చెప్పకుండా పోయి చావుదెబ్బలు తిని వస్తాడోనని వాళ్లల్లో వాళ్లే గుంజాటన పడుతూ వున్నారు.

డాన్ క్విక్ సెట్ ఆ పదిహేను రోజులూ పైకి మాత్రం ఎంతో బుద్ధిమంతుడల్లే వేళకి మందులు పుచ్చుకొంటూ, పథ్యంపానం చూసుకొంటూ వున్నాడు. ఒక్కొక్క గాయం నయమై, ఆ పుళ్ళన్నీ కొంచెం కొంచెంగా చెక్కులుకట్టటం మొదలయ్యేసరికి, అబ్బాయిగారికి కాలిదురద ఎక్కువైంది. ఒకరోజు మధ్యాహ్నం పథ్యం పుచ్చుకొని మంచంమీద పడుకొని చూరుకేసి చూస్తున్నాడు. ఇంట్లో వుండే ఆయిద్దరూ దొడ్డివేపున ఏవో పనులు చూసుకొంటున్నారు. అతని ఆలోచనలకు భంగం కలిగించే ధ్వని ఏదీ ఆచుట్టుపట్ల ఎక్కడా లేదు. ఇంకేం—తన గాయాలన్నీ నయమై, తనకు మళ్లా యథాప్రకారం బయటతిరిగే ఓపిక వచ్చాక చేయవలసిన సాహసకార్యాల విషయమై ఆలోచనలు చేయటం ప్రారంభించాడు. ఈసారి తాను జైత్రయాత్ర చేయబోయేలోగా తానొక బంటును సంపాదించుకోవటం అత్యవసరమని అతనికి తోచింది. బంటు ఎందుకంటారా? ఆయన చదివిన ప్రతి పుస్తకంలోనూ ప్రతి వీరుడికీ ఒక బంటు తోడుగా వున్నట్లు వర్ణించబడివుంది.

వీరాభిషేకం కూడా చేయించుకొని వీరుడన్న ముద్ర వేయించుకొన్నతరువాత అందరు వీరులకు మల్లే తనకూ ఒక బంటు వుండటం అవసరమేనా మరి! ఏమైనాసరే యీసారి వీర విహారానికి పోయేటప్పుడు తన ప్రక్కను ఒక బంటు వుండకతప్పదని మనస్సులో నిశ్చయం చేసుకొన్నాడు.

పదిరోజులు గడిచాక మంచంమీద నుంచి లేచి యింట్లోనే నాలుగు అడుగులు వేయటం మొదలు పెట్టాడు. ఇలా రెండు మూడు రోజులు గడిచేసరికి మరి కొంత ఓపిక వచ్చింది. వీధి ముఖం చూశాడు. వీధిలోకి



ఎప్పుడైతే రాగలిగాడో, నమ్మతగిన బంటుకోసం వెదకటం అప్పుడే ఆరంభించాడు. అలా వెదుకగా వెదుకగా ఒక్క వ్యక్తి నచ్చాడు అతడికి. ఆ వ్యక్తిపేరు శాంకో పాంజా. వాడేదో వాడిమానాన కూలీనాలీ చేసు

కొంటూ పెళ్లాం బిడ్డలను పోషించుకొంటూ వున్నాడు. మనిషి స్వతహాగా నమ్మకస్తుడు; అయితేనేం? అమాయకుడు. అటువంటి వ్యక్తిమీద డాన్ క్విక్ సెట్ గారి దృష్టిపడింది.

తాను యిలాగు, లోకసంరక్షణార్థం ధర్మసంస్థాపనార్థం వీరుడుగా వ్యవహరించబోతున్నాననీ, యిట్టి పవిత్రవుద్యమంలో తనకు తోడుగా వుండి తనకు రాగల కీర్తిలో కొంత భాగం పంచుకోమనీ డాన్ క్విక్ సెట్ వాణ్ణి ఆహ్వానించాడు. వాడికి యీాయన చెప్పేది ఏమీా బోధపడలేదు. అక్కడికీ, ఎన్నెన్నో రకాలుగా ఆ పవిత్ర వుద్యమాన్ని గురించి డాన్ క్విక్ సెట్ వర్ణించి చెప్పాడు. అలా చెప్పగా చెప్పగా వాడికి డాన్ క్విక్ సెట్ తలపెట్టిన పని గొప్పదనే అనిపించింది. కానీ యిలా అర్ధాంతరంగా చేస్తున్న పని వదిలివేసి, ఆయన వెంటపోతే తనకు ఏమిటి వస్తుందో—డాన్ క్విక్ సెట్ ఎంత చెప్పినా కూడా—వాడికి బోధపడలేదు. చివరకు యిదేమీా కాదని డాన్ క్విక్ సెట్ ఒక విషయం నిక్కచ్చిగా చెప్పివేశాడు. తనకు ఎలాగూ వీరాభిషేకం వగైరా అయిపోయినవి కనుక, తాను యిక ముందు అరనిముషమైనా ఆగకుండా ప్రపంచం అంతా తిరుగుతూ, ఎన్నెన్నో రకాల సాహసకార్యాలు చేయబోతున్నాడనే విషయంలో ఎంత మాత్రం సందేహం లేదన్నాడు. అలా ప్రపంచంలో తను దిగ్వి

జయ యాత్రలు చేసి అనతికాలంలోనే సకల సంప దైశ్వర్యాలకు ఆలవాలమైన దీవి నొకదానిని తన వశం చేసుకుతీరుతానన్నాడు. అప్పుడు ఆ దీవికి తప్పకుండా ఈ శాంకోపాంజాగారినే గవర్నరుగా చేసి పారేస్తానని వాగ్దానం యిచ్చాడు. ఎన్నిరకాల ఆశలు చూపించినా లొంగని శాంకో పాంజా, 'నిన్ను గవర్నరును చేస్తా'ననేసరికి, ఎందుకో, యిట్టే లొంగి పోయాడు. అప్పుడే తానొక గవర్నరు అయిపోయి నట్లు, తన నెందరో గౌరవిస్తున్నట్లు ఈ వెర్రి బాగులవాడు వూహించుకోసాగాడు.

సరే—డాన్ క్విక్ సెట్ గారు వీరవిహారానికి ఈసారి బయలుదేరినప్పుడు ఆయనను అనుసరించ టానికి శాంకోపాంజా ఇష్టపడుతున్నట్లు తేలి పోయింది. కాని శాంకోపాంజా ఒక్కటే ఒక్క షరతు పెట్టాడు. అదేమిటంటే—ఈ వీర విహార యాత్రలకు పోయేటప్పుడు తనను తన గాడిదను ఎక్కి ప్రయాణం చేయనివ్వాలని. బంటు దొరికాడని చంకలు కొట్టు కొంటున్న డాన్ క్విక్ సెట్ గారికి ఈ షరతు వినేసరికి గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టు అయింది. ఏమంటారా?— తాను యిన్ని వీరుల గాథలు చదివినా వాటిలో ఏ ఒక్క గాథలోనూ వీరుడి వెంట వెళ్ళే బంటు, గాడిద నెక్కిపోయినట్లు ఎక్కడా చెప్ప బడివుండలేదు. అలా ఆ పుస్తకాలలో లేనప్పుడు వీణ్ణి గాడిదను ఎక్కనీయటం ఎలాగు? ఎక్కవద్దంటే

వాడు అసలు తనవెంట రానుపొమ్మంటాడేమో! వీణ్ణి తనవెంట రావటానికి ఒప్పించే సరికే తాతలు దిగివచ్చినంత పనైందే! ఇప్పుడు వాడు పెట్టిన ఆ ఒక్క షరతుకూ ఒప్పుకోకపోతే యింత దూరం వచ్చిన వ్యవహారం మళ్ళీ మొదటికి వస్తుంది కదా అని అతనికి భయంకూడా వేసింది. సరే—తను వీరవిహారాని కంటూ బయలుదేరాలి కాని, బయలు దేరిన తరువాత ఎవడో మరొక పొగరుబోతు వీరుడు ఎదురు కాకపోతాడా, వాడిని సునాయాసంగా ఓడించి వాడి పొగరడిచి, వాడి తాలూకు గుర్రాన్ని కాస్తా తాను వూడలాక్కోలేకపోతానా అని తనకు తనే ధైర్యం చెప్పుకొన్నాడు. ఆవిధంగా సునా యాసంగా సంపాదించే గుర్రాన్ని తన నమ్మిన బంటు శాంకోపాంజాకు బహూకరించవచ్చునని నిశ్చయం చేసేసుకొన్నాడు. ఆ విషయం శాంకో పాంజాకు చెప్పివేశాడు. అంతటితో ఆ సమస్య తీరి పోయింది.

మళ్లీ యిల్లువదిలి బయలుదేరటానికి అన్ని ఏర్పాట్లూ ముగిశాక, డాన్ క్విక్ సెట్ గారికి కాలిమురద మరీ ఎక్కువైంది. ఒంట్లోకూడా మామూలుకంటే ఎక్కువగానే ఓపిక చేరుకొన్నట్లు తోచింది. ఇంకేం? ఒకనాటి అర్ధరాత్రివేళ ఎవ్వరికీ చెప్పకుండా, గుట్టు చప్పుడు కాకుండా, వీళ్లిద్దరూ యిల్లు విడిచి బయలు దేరారు. డాన్ క్విక్ సెట్ తన కవచం, ప్రక్కలోపి

ధరించి, తన ముద్దుల ముసలిగుర్రం 'రోజినాంటీ' మీద ఎక్కాడు. శాంకోపాంజా మాత్రం డాలు, డవాలూ తగిలించుకోకుండా, వున్నపళంగా నే తన బూడిదరంగుగాడిద 'డాపుల్' ను ఎక్కి చక్కావచ్చాడు.

గుర్రంమీద ఒకరూ, గాడిదమీద ఒకరూ ఎక్కి, అర్ధరాత్రి దాటాక బాగా 2, 3 గంటలు ప్రయాణంచేశారు. తెల్లవారవచ్చే సరికి వీళ్లు తమ ఆవాసాలకు ఐదారుమైళ్ల దూరంలో తేలారు. మంచుతెరలు యింకా విప్పని ఆ వాతావరణంలో డాన్ క్విక్సెట్ కళ్లకు అల్లంత దూరాన చేతులు చాచుకొని ముప్ఫయి నలభైమంది రాక్షసులు ఆకాశం అంటేలా, అంత ఎత్తున నిల్చుని వున్నట్లు ఓదృశ్యం కనిపించింది. పోతూపోతూ వున్న గుర్రాన్ని ఒక్కసారిగా నిలిపి, ఆ దిక్కే మళ్లా పరీక్షగా చూశాడు. ఆ రాక్షససమూహం బారలు చాపిన చేతులను తెగవూపుతూ తనను యుద్ధానికి రమ్మని పిలుస్తున్నట్లు అతనికి తోచింది. వెన్నంటి వస్తున్న బంటు, శాంకోపాంజావైపుకు తిరిగి "ఆవృక్ష సందోహములపైనుండి కనుపించు ఆ రాక్షససమూహ మును గాంచితివా; శాంకో? ఆ రాక్షసులు ఒకరు కాదు; యిద్దరు కాదు; కనీసము నలుబదిమంది అయి నను అందు నిలబడియున్నారు. మదమావహించి యున్న యీ మ్రుక్కడుల కరముల నన్నిటినీ నా కర

వాలమునకు ఎరలుగా జేసెద చూడు మిదే నా ప్రతాపము." అంటూ రోజినాంటీని అదిలించబోయాడు.

ఈలోగా శాంకో పాంజా, పుసులు కట్టివున్న కళ్లను ఒకసారి గట్టిగా నలుపుకొని, ఆ రాక్షసులున్న వైపుకు పరీక్షగా చూశాడు. అలా కొంతసేపు పరీక్షగా చూసి, "మీకు కనిపిస్తున్నది రాక్షసులు కావు. అవి గాలికి నడిచే మరలు." అని సవినయంగా చెప్పకొన్నాడు. ఈమాటలు వింటూవుంటే డాన్ క్విక్సెట్‌కు కోపం వచ్చింది.

"వీరులు, వీరోచితకార్యములు అనిన ఏమో ఎరుగని నీ మందబుద్ధికి ఈ భయంకర రాక్షస సమూహము సాధారణమైన గాలిమరలుగా తోచుటలో అబ్బురమేమున్నది! మన కన్నెదుట తోచు ఆకారములు రాక్షసులవే. ఈ భయంకర రాక్షసులు నిర్దాక్షిణ్యముగా మానవాళిని సదా పీడించుచున్నారు. లోక భయంకరులైన యీ రాక్షసులను ఈ క్షణంబున దునుమాడి లోకకళ్యాణమునకు నాందీవాచకము పలికెద గాక! అంతియగాక యీ దుష్టులవద్దగల అశేష సంపదలను కైవసమొనరించుకొనెదగాక! ఆ దుండగీండ్రతో నేను యుద్ధక్రీడలో నిమగ్నుడనై యుండగా, పిరికిపందవైన నీవు, కనుచూపుమేరలో ఎచ్చటనూ కానరాకుము." అంటూ శాంకో పాంజాను విసిరికొట్టాడు.

ఆయన ఎంత కసిరికొట్టినా, వెర్రిబాగుల శాంకోపాంజా తన స్వామికి ఏ ఆపద వస్తుందో అన్న దిగులుతో, ఆయనను సాహసించవద్దని హెచ్చరికలు చేశాడు.

వీరావేశంలో మునిగి తేలుతున్న డాన్ క్విక్ సెట్ యివన్నీ ఏమీ లెక్క చెయ్యకుండా గుర్రాన్ని అదిలించి, యీటెపుచ్చుకు ఆ ఆకారాల వైపుకి మాంచి వేగంతో వెళ్లాడు. దగ్గిరవున్న ఒక ఆకారాన్ని వుద్దేశించి "మీరు ఎన్ని చేతులు త్రిప్పినా మీ ఒక్కొక్క చేతిని శత సహస్రఖండములుగా ఖండించి కుప్పలుకుప్పలుగా పోసి తీరెద. కాచుకోనిడి: యిదే మీపాలిటి యముడను వచ్చుచున్నాను." అంటూ తన యీటెను విసరబోయాడు. ఆ యీటెకొన, వడివడిగా తిరుగుతున్న గాలిమర తాలూకు ఆకులసందున యిరుక్కొన్నది. ఆ ఆకులు తిరుగుతున్న వేగానికి యితనియీటె, పూచికపుల్ల విరిగినంత తేలికగా ఫుటిక్కున విరిగి మూడు ముక్కలు అయింది. అంతటితో పోయినా బాగుండును! ఆ ఆకులు మాంచి వేగంతో తిరుగుతున్నాయేమో, ఆ యీటెను వదలకుండ పట్టుకొనివున్న డాన్ క్విక్ సెట్ గారి కుడిభుజం కలుక్కుమన్నది. అంతేకాదు. ఆ వూపుకు, గుర్రం వీపుమీద కూర్చొనివున్న యింత మనిషీ, అమాంతం ఎగిరి క్రిందపడ్డాడు. పడీ పడటంతో బారపువుండ దొర్లినట్లు దొర్లాడు. బాగా యాభై గజాల దూరం దొర్లుకొంటూపోయి అక్కడ ఆగాడుకానీ,

లేచేందుకు ఏసరంతైనా ఓపిక లేక గ్రుడ్లప్పగించి చూస్తూ అక్కడే కట్టెలా పడివున్నాడు.

ఇదంతా దూరంనుంచి చూస్తున్న శాంకో పాంజా తన యజమానికి పట్టిన దుర్గతికి చింతిస్తూ, ఆయన పడివున్న చోటికి చప్పున చేరుకొందామని తన గాడిదను అదిలించాడు ఆగాడిద పోగలిగినంత వడిగా పోయింది. డాన్ క్విక్ సెట్ పడివున్న చోటికి చేరాక, శాంకో పాంజా డిగ్గున తన గాడిదమీదనుంచి దిగి, గబగబా పోయి "పోవద్దూ అంటే విన్నారూ? వారు రాక్షసులు కారండీ; మామూలు గాలిమరలండీ. అని నెత్తిన నోరు పెట్టుకు అరిచానే; విన్నారూ? ఎంతలావు దెబ్బ తగిలిందీ? ఎంతలావు దెబ్బ తగిలిందీ!" అంటూ కంట తడిపెట్టుకొన్నాడు.

"వదరకుము. వదరకుము. రాక్షసులతో నే తలపెట్టిన యీ ఘోరభయంకర యుద్ధమునందు అంతిమ విజయము నాదియేనని గుర్తించిన భూపాల మాంత్రికు డెవడో, నాకు రాబోవు కీర్తినిగుఱించి ఈర్ష్య వహించినవాడై, అంతవరకును రాక్షసరూపములలో నున్న యీ దుండగీంద్రులను, నేను ఈకెు నెత్తునలికి గాలి మరలుగా మార్చివేసినాడు. ఇందులకు సందియము లేదు. రాక్షసుడు ఒక్కడైనను మిగులక వీరెల్లరూ క్షణకాలంబున గాలిమరల రూపము గైకొనుట యనిన, అది, మంత్రప్రభావమున చే కాక అన్యమార్గంబుల సాధ్యమగునే!" అంటూ యింకా ఏమేమో

అనబోతుంటే విరిగిన ఎముక ఒకటి వున్నట్లుండి కదలి వంట్లో పెద్దగా బాధ పెట్టింది.

శాంకో పాంజా తంటాలుపడి తగినన్ని వుపచారాలు చేసి, వుండ చుట్టుకుపోయిన ఈ మనిషిని నింపాదిగా సరిదీసి, 'రోజినాంటీ' వీపుమీదకి ఎక్కించాడు. మళ్ళీ యిప్పట్లో యింట్లోనివాళ్లకు తమ ముఖం చూపకూడదన్న అభిప్రాయంతో బయలుదేరిన మనుష్యులైనకారణంచేత, ఏమైతే అదే అవుతుందని యింటికి పోకుండా 'లాపిస్' కనుమ వైపుకు దారితీశారు. ఆవైపుకే వీళ్లు పోవటానికి కారణం లేకపోలేదు. ఆ ప్రాంతంలో, అన్నిచోట్లకంటే జనసమ్మర్దం ఎక్కువ. జనసమ్మర్దం ఎక్కువగా వుంటే నే అన్యాయాలు ఎక్కువగా జరిగేది. అలాంటిచోటికి పోతేనే డాన్ క్విక్ సెట్ వంటి వీరాగ్రేసరుడికి చేతినిండా పని తగిలేది.

## 4

ఆరోజు రోజుఅంతా ఆ స్వామీ, యీ బంటూ ఎక్కడా ఆగకుండా ఒకరు గుర్రంమీదా, యింకొకరు గాడిదమీదా స్వారిచేస్తూ అలా తిరుగుతునేవున్నారు. అదేమి దురదృష్టమో వీళ్లకు ఎదురొక్కసేందుకు ఏ ఒక్క దుష్టుడూ కనుపించనేలేదు. అలా తిరిగితిరిగి చివరికి విసుగెత్తి పొద్దుగ్రుంకాక ఒక

చెట్ల గుబురు చూసి అందులో విశ్రమించారు. అప్పుడే నిద్రపోవటం ఎందుకని డాన్ క్విక్సెట్ మాత్రం అలా కళ్లు తెరుచుకు చూస్తున్నాడు. ఇంతలో అతనికో ఆలోచన తట్టింది. నిన్న ఆ గాలిమరలో యిరుక్కుని విరిగిపోయిన యీటెను వెంటనే బాగుచేయకపోతే మళ్లీ దాంతో ఎప్పుడు ఏం పని పడుతుందో? ఎవరు చెప్పగలరు? అందుకని—ఆ చెట్టుకొమ్మల్లో మంచి నిడుపాటి కొమ్మనొకదానిని చూసి దానిని ఫెళ్లున విరిచాడు. ఒక చట్రాతిమీద కూలబడి కాళ్లు బారజాపి, కత్తితో ఆ కొమ్మమీది ఆకులూ అవీ శుభ్రంగా చెక్కేశాడు. బాగా చేత్తో పట్టుకోవటానికి వీలుగా గుండ్రంగా చెక్కి దానికి యీటె మొన తగిలించాడు. ఇదంతా పూర్తి కావటానికి పక్కా గంట సేపు పట్టింది. గుదులుపట్టిన కాళ్లూ చేతులు ఒక్కమారు విదిలించుకొని బిగ్గరగా ఆవలించి, ముద్దుల గుర్రం 'రోజినాన్‌టీ' ప్రక్కనే తానూ నడుం వాల్చాడు. మళ్ళీ ప్రొద్దున్నే ధర్మసంస్థాపకులిద్దరూ నిద్ర లేచి, అధర్మాన్ని అన్వేషిస్తూ బయలుదేరారు.

సూర్యుడు బాగా నడినెత్తికి వచ్చేసరికి వీళ్లిద్దరూ 'లాపిన్' అనే కొండకనుమదగ్గరకు చేరారు. వీళ్లుఅక్కడికి చేరేసమయానికి ఒక పెద్ద ఊరేగింపులా ఒక గుర్రపుబండీ కొందరు మనుష్యులు, ఆ రెండు కొండలమధ్యనున్న యిరుకు బాటలోంచి వస్తున్నారు.



ఆ వూరేగింపుకు ముందువైపు నల్లటి గౌనులు వంటినిండా కప్పుకొనివున్న యిద్దరు మతబోధకులు వున్నారు. వాళ్లిద్దరూ రెండు కంచరగాడిదలమీద ఎక్కి వస్తున్నారు. వాళ్ళకు కొంచెం వెనగ్గా ఒక గుఱ్ఱపు బగ్గీ నింపాదిగా వస్తున్నది. ఆ బగ్గీకి పైభాగాన నాలుగు కూసాలకూ నాలుగు ఎఱ్ఱజండాలు తగిలించి వున్నాయి. గాలికి ఆ నాలుగు జెండాలు రెపరెప కొట్టుకొంటున్నాయి. బగ్గీకి వెనుక నలుగురైదుగురు

గుఱ్ఱాలు ఎక్కి వస్తున్నారు. వాళ్ల వెనక యిద్దరు ముగ్గురు మూటలు చేరవేసేవాళ్లు నడిచివస్తున్నారు. నల్లటి ముసుగులతో వున్న యీ మతబోధకులు వారి వెనకాల యీ గుఱ్ఱపు బండీ, దాని వెనుక కొంత పరివారమూ ఎప్పుడైతే డాన్ క్విక్ సెట్ కంటబడ్డారో అప్పుడే ఆయనకు తోచింది—యిందులో ఏదో గొప్ప దుర్భేద్యమైన రహస్యం వున్నదని.

శాంకోపాంజావైపుకు తిరిగి “శాంకో, అదృష్టదేవత నన్ను వలచి ఎదురువచ్చుచున్నది; చూచితివా! మందగమనముతో యిటు కదలివచ్చు యీ వూరేగింపులో ఏదో గొప్ప రహస్యము యిమిడి వున్నది. నల్లని దుస్తులు ధరించి అందరికంటెను ముందు, గాడిదలపై నెక్కి వూరేగింపును నడిపించుకొని వచ్చుచున్న ఆ యిద్దరును నేపాల ఘోరపాల మాంత్రికులు. ఇందులకు ఎట్టి సందియమునూ లేదు. వారి వెనుకగా కదలలేక కదులుచున్న ఆ రథమున్నదే—అందు అపురూప సౌందర్యరాశి అయిన ఒక రాకుమార్తె వుండితీరవలె. అమాయకురాలైన ఆ అందాలరాణిని యీ మోసగాండ్రిద్దరూ మాయ జేసి బందీగా గొనిపోవుచున్నారు. ఏమి సాహసము? ఏమి సాహసము? అన్యాయవర్తనులై అమాయక ప్రజానీకమును యీ రీతిని హింసించు ఆ మాంత్రికులనిదే నా కరవాలమున కాహారముగా జేసితీరెదను. నీ విచ్చటనే వుండి మదీయ వీర విహారములను కను

లార గాంచుము." అంటూ డాన్ క్విక్సెట్ గుర్రాన్ని అదిలించబోయాడు.

శాంకోపాంజా ఆయనదారికి అడ్డంవచ్చి "స్వామీ! తొందరపడవద్దు; తొందరపడవద్దు. తొందరవల్ల తొంభైవిధాల - నష్టమన్నారు పెద్దలు. తొందరపడి సాహసకార్యాలు చేయబోతే మొన్నటి ఆ గాలిమరల గొడవకు మించిన గొడవ కాగలదు. నల్లని దుస్తులు ధరించివున్న వారిద్దరూ నాకంటికి సన్యాసుల్లా కనిపిస్తున్నారు. వారివెనుక వస్తున్న బగ్గీలో మర్యాదస్తులైనవారెవ్వరో, ఒకవూరినుంచి మరొక వూరికి, ఏదో పనిమీద ప్రయాణమై పోతున్నట్లున్నారు. ఏమైనా ముందుగా తొందరపడక అడిగి తెలుసుకొని మరీ మన చేతులకు పని చెప్పటం మంచిది" అన్నాడు.

శాంకోపాంజాకు తోచిందే నిజం. ఏమంటే— ఆ బండీలో గొప్పయింటి ఆడపడుచు ఒకామె తన భర్తదగ్గరకు "సెవిల్లీ" పట్టణానికి తరలి పోతున్నది. నల్లటి దుస్తులు ధరించివున్న ఆ మత బోధకులతో యీామెకు ఎలాంటి సంబంధమూ లేదు. మార్గమధ్యంలో ఆ గుర్రపుబండీ యీ సన్యాసులూ తారసిల్లారు. అంతే!

ఏమైతే నేం? డాన్ క్విక్సెట్ కు యిదంతా ఏమీ అక్కరలేదు. శాంకో పాంజా చెప్పేమాటల్లో ఒక్కటైనా అతని చెవుల్లో దూరనేలేదు. చెవుల్లో

పొరపాటున ఏదైనా ఒక మాట దూరినా, అది బుర్రకు ఎక్కనే లేదు. ఏదో ఘనకార్యం చేసెయ్యాలన్న దురద అంతకంతకూ ఎక్కువైపోయింది. వెర్రి ఆవేశం వచ్చేసింది. ఇంకేముంది? గుర్రం డొక్కలో ఒక్క తాపు తన్నాడు, అది కుంటి కాలు ఎగురు వేసుకొంటూ ఆ ఊరేగింపువైపుకు పరుగు లంకించుకొంది. అలా పోయిపోయి ఆ గుంపు నట్టనడాన గుర్రాన్ని తక్కున ఆపి, డాన్ క్విక్సెట్ ఆ సన్యాసుల నిద్దరినీ బండబూతులు తిట్టటం మొదలు పెట్టాడు. వీరగ్రాంథికభాషలో యింత పెద్ద పెద్ద తిట్లు తిట్టవలసిన అవసరం యీ ఏమనిషికి ఎందుకు వచ్చిందో అర్థంకాక, ఏం చెయ్యటానికి తోచక, ఆ సన్యాసు లిద్దరూ అలా దిగ్భ్రాంతులై ఎక్కడ వున్నవాళ్లు అక్కడే నిలుచుండిపోయి, గుడ్లు అప్పగించి చూస్తున్నారు.

"ఓరీ రాక్షసులారా! రాజవంశమున పుట్టిన ఆ అబల నిట్లు బలాత్కారముగా ఎత్తుకొనిపోవుదురే? ఎంతటి కండకావరము? ప్రాణములపై నాశయున్నచో మీ దుస్తంత్రమును వీడి, ఆమెను నాకు అప్పగించి మీదారిని మీరు పొండు. లేక యమపురికేగ నుత్సాహించుచున్నవారైనచో, రండు, యిదే నా భుజబలమును చవిజూపెద" అంటూ బిగ్గరగా అరుచుకొంటూ, తొడలు చరుచుకొంటూ, రంకెలు వేసు

కొంటూ చేతులు తిప్పుకొంటూ, మీసాలు మెలివేసుకొంటూ, నానాఖంగారుచేయుటం మొదలుపెట్టాడు.

ఈలోగా ఆ యిద్దరు సన్యాసులూ కొంచెం తేరుకొని తాము ఏ పాపమూ ఎరుగమనీ, ఆ బండీలో వస్తున్నవారికీ తమకూ ఎట్టి సంబంధమూ లేదనీ చెప్పుకొన్నారు. అలాగైనా యీ పిచ్చివాడి కోపం తగ్గుతుందేమో అని వాళ్లు ఎంతో ఆశపడ్డారు. పిచ్చి ఆవేశంలో వున్న డాన్ క్విక్ సెట్ బుర్రకి వీళ్లు చెప్పేది ఏమీ ఎక్కటంలేదు. నయాన వీళ్లు యింత యిదిగా చెప్పుకుంటే అదేమీ వినిపించుకోకుండా, ఆ యీటె పుచ్చుకొని ఆ యిద్దరు సన్యాసుల్లో ఒకడి మీదకు విరుచుకుపడ్డాడు. ఇతను వెళ్లిన విసురుకు, పాపం ఆ సన్యాసి ప్రాణం కాస్తా అక్కడే గుటుక్కుమనవలసిందే. కాని అతడు, యితడి దూకుడూ అదీ చూసి, భయపడిపోయి, తక్షణమే గాడిదమీదనుంచీ కిందికి దూకేశాడు. కొద్దిలో గండం తప్పిపోయింది. ఇదంతా చూస్తున్న రెండో సన్యాసికి తాకు ఎత్తుకొంది. తన గాడిదను చింతబరికె పుచ్చుకు తెగ బాదాడు. ఆ గాడిద కుప్పిగంతులు వేస్తూ, పెద్దగా ఓండ్రపెడుతూ దౌడుతీసింది. అప్పటి కప్పుడే ఆ రెండో సన్యాసి రెండుమూడు ఫర్లాంగుల దూరం వెళ్లిపోయాడు కూడాను.

ఇంతసేపూ అల్లంత దూరాన నిలుచుని వేడుక చూస్తున్న శాంకోపాంజాకు యింతలో ఏం బుద్ధి

పుట్టిందో ఏమో— క్రిందపడివున్న ఆ సన్యాసి పని పట్టించటానికి తానూ పూనుకొన్నాడు. వాడి జేబులూ అవీ తడివి, డబ్బూ దస్కం ఏమైనా వుంటే అవన్నీ తన జేబులోకి ఎక్కిస్తున్నాడు.

గుర్రపుబగ్గీ వెనుక వస్తున్న కూలీలలో యిద్దరు యిక్కడ జరిగే భాగోతాన్ని యింతలో చూసి, చప్పున పరుగెత్తుకొంటూ వచ్చారు. వాళ్లు వచ్చి చూసేసరికి, సన్యాసిని క్రిందపడవేసి వాడిపీకమీద ఎక్కి కూర్చొని, శాంకోపాంజా వాడి జేబులన్నీ తడుముతూ వుండటం వాళ్లకళ్లబడింది. వీళ్లు అదలించేసరికి శాంకో పాంజాకు నిజంగా భయం వేసింది. అందుకని తాను చేస్తున్నది వీరోచిత సాహసకార్యమని వాళ్లతో ఎంతగానో చెప్పుకొన్నాడు. వీరోచిత సాహసకార్యాలంటే వాళ్లకు సరిగా అర్థమౌతుందో లేదో అని, వీరులు అంటే ఎవరో, వాళ్లు యుద్ధాలు ఎందుకు చేస్తారో, అలా యుద్ధాలుచేసి శత్రువుల తాలూకు వస్తువులను ఎందుకు జాగ్రత్తపెట్టుకొంటారో, అదంతా పెద్ద వుపన్యాసకుడిలా వివరించటం మొదలుపెట్టాడు. ఆ కూలీలిద్దరికీ వీడు చెప్పే గొప్పలు ఏమీ కాబట్టలేదు. ఇద్దరూ కలిసి వీణ్ణి రెక్కలు వెనక్కివిరిచి పట్టుకొని, ఒకడితరువాత మరొకడుగా, వీపుమీద, లెంపల మీద, పొట్టమీద గుద్దులు గుద్ది క్రిందపడవేశారు. అంతకీ కసితీరక, వాడి వీపుమీదికి యిద్దరూ ఒక్క

మారుగా ఎక్కి, కాసేపు నటరాజనృత్యం చేశారు. వాళ్ల కాళ్లక్రింద పడి నలిగిపోయిన శాంకో పాంజాకు యిక నోటమాట పెగలటం లేదు. అమ్మో, బాబో, అనటంకూడా మానివేశాడు. అప్పటికి వాళ్లిద్దరికీ కూడా కాస్త అలుపు వచ్చింది. కదలకుండా కట్టెలా పడివున్న శాంకో పాంజాను వాడి మానానికి వాణ్ణి వదిలేసి, వాళ్లదారిని వాళ్లు చక్కాపోయూరు.

ఇక్కడ యింత కాండ జరుగుతూవుంటే అక్కడ డాన్ క్విక్ సెట్ ఏంచేస్తున్నాడనుకొన్నారు? ఆయిద్దరు మంత్రగాళ్లలో ఒకడిని నేలమట్టం చేశాను కదా అనీ, మరొకడికి బుద్ధివచ్చి పారిపోయూడు కదా అనీ సంబరాలు పడుతూ, పెద్దగా సకిలింపులు సకిలిస్తూ, గుర్రాన్ని ఆ బండిదగ్గరకు పోనిచ్చాడు. మీసాలు మెలివేసుకొంటూ పోయి నిల్చొని, బండిలో వున్న 'రాజకుమారి'ని పిలిచాడు. ఆవిడకు యింతసేపూ ఏదో పోట్లాటలు జరుగుతున్నట్లూ, ఎవరో తిట్టుకొంటున్నట్లు కొట్టుకొంటున్నట్లు రకరకాలుగా శబ్దాలు వినిపిస్తూనే వున్నాయి. ఇదంతా ఏమిటో ఆమెకు ఏమీ బోధ పడటంలేదు. అసలే ఏమీ అర్థంకాక ఆవిడ తికమక పడుతుంటే వీడెవడో, యీ యీచుకుపోయిన మనిషి, యిప్పుడు యిలా వెకిలనవ్వులు నవ్వుకొంటూ, మీసాలు మెలివేసుకొంటూ, నిల్చొనివుంటే ఆమెకు చిరాకువేసింది; భయంకూడా పుట్టుకొచ్చింది.

అమాయకురాలైన ఆమెను బందీగా చేసి పట్టుకుపోతున్నందుకు ఆ ముష్కరులను తాను హతమార్చేశానని డాన్ క్విక్ సెట్, పెద్ద గర్వంగా చెప్పుకోసాగాడు. తను అసలు ఎన్నడూ బందీ అయిందీ తెలియక నేపోతే, 'నీబందీ విడిపించానని' వీడు అంటూవుంటే, ఆమెకు అంతా అయోమయంగా తయారైంది.

డాన్ క్విక్ సెట్ అంతటితో ఆగిపోయినా బాగుండేది. ఆమెను ఆ దుష్టుల బారినుండి రక్షించినందుకు తనకు కృతజ్ఞతాసూచకంగా ఆమె ఒక పని చేయవలసివుంటుందని నిర్దేశించాడు. ఉన్నపళంగా బండిని వెనక్కు మళ్లించి 'టొబోసా' గ్రామానికి పోయి, అందుగల అనన్యరూపసి డల్సీనియా రాకుమారి ఎందున్నదో అరసిచూచి, ఆమెకు, తానీనాడు ప్రదర్శించిన వీరోచిత ధైర్యసాహసాలను ఓపినంతమటుకు వర్ణించి చెప్పవలసిందిగా కోరాడు. దీంతో ఆమెకు చిర్రెత్తుకొచ్చింది.

డాన్ క్విక్ సెట్ యిలా బండిదగ్గర చేరి ఆమెను అలా చికాకు పెడుతూ ప్రసంగటమూ, తూర్పు దిశగా ప్రయాణమైపోతున్న బగ్గీగుర్రాలను పడమరకు తిప్పాలని పెనుగులాడుతుండటమూ, యిదంతా చూస్తున్న ఆమె హాంగుదారుడికి ఒకడికి బలే కోపం వచ్చింది. వాడు గబగబా ముందుకు వచ్చి బండిని 'సెవిల్లీ' వైపుకు పోనిస్తావా, లేదా

ఒక్క ముక్కలో తేల్చి చెప్పమని డాన్ క్విక్ సెట్ ను గదమాయించాడు. డాన్ క్విక్ సెట్ మాత్రం యిలాంటి బెదిరింపులకు అంత తేలికగా లొంగిపోయే ఘటమా! ననేమీ వీల్లేదు పొమ్మన్నాడు.

డాన్ క్విక్ సెట్ ఒరలోనుంచి కత్తి సర్రున లాగి, ఆ కాపలామనిషిమీద పడ్డాడు. గాడిద నెక్కివున్న ఆ కాపలావాడు, డాన్ క్విక్ సెట్ కత్తి తగులకుండా తప్పించుకోవటానికి వీల్లేక, గాడిదమీదనుంచి క్రిందకు దిగటానికైనా సందు దొరకక, ప్రక్కనే నిలుచునివున్న బగ్గీలోంచి పట్టుదిండు ఒకటి చప్పున చేతికి చిక్కించుకొని, దాన్నే డాలుగా ప్రయోగించి డాన్ క్విక్ సెట్ కత్తిదెబ్బలు కాచుకొన్నాడు. సందు చూసుకొని తన కత్తికూడా ఒరలోంచి లాగి కత్తికి కత్తి తాకించాడు. కత్తీకత్తీ ఎప్పుడైతే కలిశాయో, యిద్దరికీ ఒళ్లూపై తెలియని పట్టుదలలు వచ్చేశాయి. కత్తియుద్ధం జోరుగా సాగిపోతోంది. ఠంగ్ ఠంగ్ మంటూ కత్తిదెబ్బలు అల్లంత దూరానికి కూడా వినిపిస్తున్నాయి. ఆ యిద్దరిలో ఎవరో ఒకరు చస్తేనే కాని యీ యుద్ధం అంతం కాదేమో ననిపించింది. యుద్ధం అలా భయంకరంగా సాగిపోతూ వుండగా వున్నట్లుండి ఆ హంగుదారుడు కత్తిపుచ్చుకొని డాన్ క్విక్ సెట్ కుడిబుజంమీద చావుదెబ్బ ఒకటి కొట్టాడు. నిజంగా డాన్ క్విక్ సెట్ కు, అతని కుడి భుజానికి అంతటితో ఋణం తీరిపోవలసిందే! కానీ

తుప్పుపట్టినదే అయినా, ఆ వుక్కు-కవచం ఒకటి వుండబట్టి, ఎంతో మేలయింది. అంత పెద్ద ప్రమాదం కొద్దిలో తప్పిపోయింది. అంతలావు దెబ్బ తిన్నమీదట డాన్ క్విక్ సెట్ కు కోపం మరీ రెచ్చిపోయింది. డల్ సీనియా రాకుమారి పేరు భూనభోంతరాళాలు దద్దరిల్లిపోయేలా ఒక్కమారు పెద్దగా వుచ్చరించి తన కత్తిమొన వాడి గుండెల మీదికి గురిచూచి వాడిమీదికి పోబోయాడు.

ఈ దెబ్బతో ఒకళ్ల నొకళ్లు కడతేర్చాలని కృతనిశ్చయులై యిద్దరూ తమకత్తులు విసురుగా త్రిప్పుతూ, ఆ చుట్టుపట్ల వుండే వాతావరణాన్ని అంతటినీ ఖణేల్ ఖణేల్ మనే కత్తిదెబ్బల మోతలతో నింపివేశారు. ఈ దృశ్యం చూస్తున్నవారందరు వూపిరి బిగబట్టి అలా చూస్తునేవున్నారు. ఆ యిద్దరిలో ఎవరో ఒకరు యీ క్షణమో, మరుక్షణమో చేలకొరగక తప్పదని వారిలో ప్రతి ఒక్కరూ భయపడసాగారు.

ఆ హాంగుదారుడు విసిరిన కత్తిదెబ్బ వచ్చి, డాన్ క్విక్ సెట్ గారి తలపైగల వుక్కుటోపీకి బలంగా తగిలింది. ఇంతలావు వుక్కుటోపీ కూడా దెబ్బకు ముక్కలు ముక్కలు అయింది. ఆ టోపీతో పాటు డాన్ క్విక్ సెట్ గారి నుడిచెవిలో కొంతభాగం కత్తిరించుకుపోయింది. చెవికూడా కత్తిరించుకుపోయేసరికి డాన్ క్విక్ సెట్ కు కోపం మరీ మితిమీరిపోయింది. వళ్లూపై తెలియని ఆవేశంతో యీయన వాడి పని పట్టా

లని మహోద్ధృతంగా విజృంభించి, వాడిమీద బలమైన దెబ్బఒకటి తీశాడు. ఈదెబ్బతో ఆ హాంగుదారుడు ఎక్కివున్న గాడిదకు తారుఎత్తుకొంది. అది యిక అక్కడ నిలబడకుండా పరుగు లంకించుకొంది. పెద్దగా ఓండ్రపెడుతూ ముందుకాళ్ళతో కాసేపు, వెనుక కాళ్లతో కాసేపు గంతులు వేసింది. ఇలా రెండుమూడు నిమిషాలపాటు యిది నాట్యమాడి, నాట్యమాడి, తన వీపుమీద కూర్చొనివున్న ఆ హాంగుదారుణ్ణి అమాంతం విసిరి క్రింద పారేసింది. వాడి వొళ్లంతా అంగుళంమేర ఖాళీ లేకుండా, ఎక్కడ పడితే అక్కడ, గాయాలు తగిలాయి; నెత్తురు వరదలుకట్టి ప్రవహించు తోంది. కాలూ చెయ్యి కూడదీసుకొనే ఓపిక లేక నేలమీద ఎట్లా పడ్డవాడు అట్లాగే వుండిపోయాడు.

డాన్ క్విక్ సెట్ గారి కోపం అంతటితో నైనా ఆగలేదు. ఎకాయెకిని పోయి వాడి గొంతు మీద ఎక్కి కూర్చొని, శరణు వేడమన్నాడు. లేకపోతే వున్నపళంగా వాడి కంఠం వుత్తరించెయ్యగల నని హెచ్చరించాడు. ఈయన యింత బిగ్గరగా సవాలు చేస్తున్నా, మట్టి నాకుతున్న ఆ హాంగు దారుడు వులుకలేదు; పలుకలేదు. గొంతెత్తి ఏమాట చెప్పటానికైనా పాడినట్లో వినమన్నైనా ఓపిక వుంటేగా! వాడు బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడక పోవటంచూసి, డాన్ క్విక్ సెట్ నిజంగానే వాడి కంఠం కోసెయ్యటానికి కత్తియెత్తాడు. ఆ దృశ్యం బండి కిటికీ



లోంచి చూస్తున్న ఆమెకు విపరీతమైన భయంవేసి, వణుకు పుట్టుకు వచ్చింది. ఏమి చెయ్యటానికీ దిక్కుతోచక, దబదబా బండి దిగివచ్చి తనకు కాపలాకోసం వస్తున్నవాడి ప్రాణాలు కాపాడమని డాన్ క్విక్ సెట్ గారిని బ్రతిమాలింది.

ఆ ఆడకూతురు అంత బ్రతిమాలుతున్నా, చేతికి చిక్కినవాణ్ణి ప్రాణాలతో వదిలెయ్యటం డాన్ క్విక్ సెట్ కు మొదట్లో ఎంతమాత్రం రుచించలేదు. చివరకు ఒక షరతుపెట్టి, అందుకు ఒప్పుకొనేట్లయితే వాడిని ప్రాణాలతో వుండనిస్తానని మాత్రం మాట యిచ్చాడు. ఆ షరతు ఏమిటంటే— అన్ని గాయాలతో వున్న వీరుడు, తక్షణమే 'టొబోసో'కు పోయి, 'డల్ సీనియా' రాకుమారిని శరణు వేడాలని' ఆ రాజకుమారి వీణ్ణి జాలితలచి వదిలివేసేట్లయితే తనకేమాత్రపు అభ్యంతరమూ వుండబోదని చెప్పాడు

ఆమె, పాపం, అంత భయపడివున్నదేమో, యీ 'టొబోసో' గ్రామం ఏడక్కన వున్నదని కానీ, ఆ 'డల్ సీనియా రాకుమారి'ని వెదికి తెలుసుకోవటం ఏలాగు అని కానీ, ఏమీ అడుగకుండానే డాన్ క్విక్ సెట్ పెట్టిన ఆ షరతుకు ఒప్పేసుకొంది. ఆ విధంగా తన ప్రత్యర్థిసమూహం తనకు లొంగిపోయి తను పెట్టిన షరతులన్నీ పాటిస్తున్నందుకు డాన్ క్విక్ సెట్ కు బలే సంతోషం వేసింది. గర్వం కూడా పుట్టుకొచ్చింది. అప్పటికి వాళ్ల దారిని వాళ్లను పోనిచ్చాడు. వాళ్లు మాత్రం బగ్గిని వెనక్కు తిప్పకుండా ముందుకే ప్రయాణం సాగించారు.

ఈలోగా శాంకో పాంజా కొంచెం తేరుకొని, అంతసేపూ కదలకుండా పడివున్న వాడల్లా, లేచి నిల్చొని, ఒంటిమీద దుమ్ము దులుపుకొంటున్నాడు. ఎక్కడెక్కడ ఎంతెంత పెద్దగాయాలు తగిలాయో చూసుకొని లోలోపలే కుళ్లుకుంటున్నాడు. వీరుడైన డాన్ క్విక్ సెట్ గారు వాణ్ణి పెద్ద గావుకేకతో పిలిచి, వాడు వచ్చేదాకా అయినా ఆగకుండా, పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ పోయి, ముద్దులగుర్రం 'రోజినాన్టీ' పైన ఎక్కి కూర్చొన్నాడు. ఆ ముసలి గుర్రం చెక్కిలి నొక్కసారి ముద్దు కూడా పెట్టుకొన్నాడు. ముందుకు పొమ్మని దాన్ని హెచ్చరించాడు. శాంకో పాంజా కూడా తన గాడిద 'డాపుల్'ను వెదికి పట్టుకువచ్చుకొని, దానిమీద ఎక్కి కూర్చొన్నాడు. అది సంపా

దిగా అడుగుతీసి అడుగు వేస్తూ, రోజినాన్టే పోయిన మార్గాన్నే అనుసరించి పోతున్నది. శాంకో పాంజా కళ్లవెంట నీళ్లు గిరున తిరిగాయి. మట్టికొట్టుకు పోయిన చొక్కాతో కళ్లనీళ్లు తుడుచుకొన్నాడు.

## 5

డాన్ క్విక్‌సెట్‌కు బలే గర్వం పుట్టుకొచ్చింది.

గర్వం పుట్టుకువచ్చింది అంటే తప్పేముంది? పుట్టిననాళ్లకు పురుషుడు యజ్ఞం చేశాడన్నట్లు, వీరాభిషేకం చేయించుకొని యిన్నాళ్లయితే, యిప్పటికి కదా - తానొక సాహస కార్యం చేసింది! అందులోనూ ఎటువంటి సాహస కార్యం? ఒక్కరా, యిద్దరా? దగ్గర దగ్గరగా పదిమందిదాకా అవిథ తాలూకు మనుష్యులుంటే, యిందరికీ తాను ఒక్కడు, ఒక్కడూ అంటే ఒ—క్క—డు—, సమాధానం చెప్పగలిగాడు. హా! ధీరుడంటే అల్లా వుండాలి!! తన ధాటికి ఓర్వలేక పదిమంది పిక్కబలం చూపిస్తే ఎంతటివాడికైనా బుజాలు పొంగవా?

డాన్ క్విక్‌సెట్ యిలాగు తియ్యా తియ్యని ఆలోచనలు చేసుకొంటూ గుర్రం ఎటు పోతున్నదీ,— అసలు పోతున్నదీ, పోకుండా నిలుచున్నదీ కూడా— గమనించటం లేదు.

ఇంతసేపూ శాంకోపాంజా ఏమి ఆలోచిస్తున్నాడో తెలుసా? వాడు యిల్లువిడిచి బయలుదేరిన క్షణం నుంచీ, వాడి దృష్టిఅంతా డాన్ క్విక్‌సెట్ జయిస్తానన్న ఆ దీవిపైనే వుంటున్నది. ఇప్పుడు డాన్ క్విక్‌సెట్ ఎవరితోనో యుద్ధం చేసి, విజయంసాధించటం వీడు కళ్లారా చూస్తూనే వున్నాడుగా! తన యజమాని యీయుద్ధంలో ఆ దీవిని కొన్తా తప్పక జయించి వుంటాడని వీడికి వల్లమాలిన నమ్మకం ఏర్పడింది. దీవిని జయించినతరువాత కూడా తనకా గవర్నరు పదవి యిచ్చివెయ్యకుండా తన యజమాని యింకా ఎందుకు ఆలస్యం చేస్తున్నాడో వాడికి, ఎంత ఆలోచించినా, అర్థంకాలేదు.

ఇక, వుండబట్టలేక నమస్తా [illegible] తనగాడిద 'డాపుల్'ను చటుక్కున [illegible] నుంచి దిగిపోయి, డాన్ క్విక్‌సెట్ [illegible] కొన్నాడు.

"స్వామీ! ఆలస్యం చేస్తే [illegible] వినమాత్రం [illegible]ండంటారు పెద్దలు. శుభ [illegible] చేసెయ్యమని కూడా ఆ పెద్దలే అన్నారు కదా [illegible] నప్పుడు, మీరు ఆ దీవులను జయించాక కూడా, గవర్నరుగా చేసెయ్యకుండా నన్నెందుకు వేధిస్తున్నారు?" అంటూ వెక్కి వెక్కి ఏడవటం మొదలు పెట్టాడు.

వీడి అమాయకత్వం చూసేసరికి డాన్ క్విక్ సెట్‌కు జాలివేసింది. "మదీయ శాంకో! నీవెంత జ్ఞాన శూన్యుడవు! వీరులు, వీరోచిత కార్యములు నీకు బొత్తిగా తెలియకుండుట కడుంగడు శోచనీయంబు. నే నింతదనుక సలిపిన పోరాటము దీవులకై కాదని గుర్తింపలేకపోయితివి కదా! ఏ మందును— నీ మందబుద్ధిని? అయిననూ—శాంకో—యింతలో నిరుత్సాహపడనేల! మన మింకనూ ఎన్నియో యుద్ధముల జేయవలసియున్నది. ఆ యుద్ధములలో ఎందరో రాజులను ఓడించవలసియున్నది. ఆ రాజులలో ఎవరో ఒకనివద్దనుంచి నీకై ప్రత్యేకముగా నొక దీవిని వూడలాగికొని, ఆ దీవికి నిన్నే తప్పక గవర్నరుగా చేసితీరెదను. ఇంతలో తొందర పడెద వేలనోయి! నా శాంకో, నీవాకింత ఓపికపట్టిన, దీవి ఏమి ఖర్మము— ఒక పెద్ద భూఖండమునే మనము వశము చేసుకోగలము. అప్పుడు దానికి నీవే రాజ్యపాలనాధికారము వహింతువు లెమ్ము. వీరుడైనవాడు—అందును డాన్ క్విక్‌సెట్ వంటి వీరాగ్రేసరుడు, ఆడిన మాటను ఎన్నటికైనా తప్పునా! వేగిరపడకుము; వేగిరపడకుము," అని అతనిని ఎంతో బుజ్జగించాడు.

శాంకోపాంజాకు కూడా తన యజమాని మాటలు వినగా వినగా, వాటిలో కొంత నిజం లేకపోలేదనిపించింది. ఇక ఆవిషయమై అట్టే పట్టుదల పట్టటం మంచిదికాదని తోచింది. డాన్ క్విక్‌సెట్‌ను

మళ్ళీ గుర్రం ఎక్కించి, తానుకూడా పోయి యథాప్రకారం 'డాపుల్' మూపున ఎక్కాడు.

ఇద్దరూ కలసి తాము సంపాదించబోయే రాజ్యాలు, సామ్రాజ్యాలు, భూఖండాలు, ద్వీపాలు, ద్వీపకల్పాలనుగూర్చి యిచ్చవచ్చినట్లు చిత్రించుకొంటూ, యిచ్చకాలు ఆడుకొంటూ ప్రక్కనే వున్న అడివిమార్గంగుండా వాహనాలను నడిపించారు. అలా కొంతదూరం పోయేసరికి డాన్ క్విక్సెట్‌కు కడుపులో ఆకలిబాధ ఎక్కువ కాసాగింది. ఆకలిబాధ ఎక్కువ అవుతున్నకొద్దీ, మాటల ధోరణి తగ్గింది. యావగా చెట్లకొమ్మలకేసి చూడటం మొదలుపెట్టాడు — కాయో కసరు ఏమైనా కంటపడుతుందేమోనని! అంత వుత్సాహంగా రాబోయే విజయాలనుగూర్చి ముచ్చటించుకొంటున్నవారల్లా, వున్నట్లుండి యిద్దరూ మౌనంలో పడ్డారు. లోపల ఆకలిమంటలు మరీ ఎక్కువ అయినాయి. ఇక వుండలేక డాన్ క్విక్సెట్ —

"శాంకో! యీ సమీప ప్రాంతమందెచ్చటనైనను చక్కనికోట యొకటి కంటబడిన బాగుండును కదా! ఆ కోటలోనికి బోయి, వారాదరముతో నియ్యగల యాహారమును తిని క్షుద్బాధ నుపశమింపజేసుకొనవచ్చునే!" అంటూ అంగలార్చాడు.

ఆకలిబాధకంటే కూడా యితనిని మరొక బాధ ఎక్కువగా పీడిస్తోంది. ఆవిషయం మాత్రం

అతడు బయటపెట్టలేదు. అలా బయట పెట్టటం వీరుడి లక్షణం కాదు కూడాను. ఇందాక జరిగిన కత్తియుద్ధం సంఘర్షణలో—ఆ గుర్రపుబగ్గీలో వస్తున్న ఆ స్త్రీ తాలూకు హంగుదారుడు, కత్తిపుచ్చుకొని తన పుర్రెటోపీమీద కొట్టినప్పుడు ఆ టోపీ ముక్కలు ముక్కలు కావటమే కాకుండా, తన కుడిచెవిలో కొంతభాగం కత్తిరించుకుపోయి చిల్లపెంకులా ఎగిరి పడింది. ఆ మట్టుపట్లు ఎంత కలయచూసినా, తెగిన చెవిముక్క ఎక్కడ పడిందీకూడా కనుపించనైనా కనుపించలేదు. ఆముక్క కనుపించినా యింత బాధ వుండకపోనేమో! యుద్ధం చేస్తున్నప్పుడు— ఆ వుద్రేకంలో యీబాధ అంతగా తెలియలేదు. యుద్ధం అయిపోయి, యిలా యీ అడివెంట వస్తున్నప్పుడు, ఎక్కడ [illegible] ఆ [illegible] తనకు చేసిన [illegible] తానూ, [illegible] భూఖండం అనుభవించి [illegible] బాధ కనుపించ [illegible]. ఆ ధోరణి [illegible] కొనసాగినా బాగుండేది! [illegible] వచ్చిపడింది. సామాన్యంగా, [illegible] తెలిసి వస్తుందో, లేనిపోని బాధలు కూడా [illegible] అప్పటి కప్పుడు పుట్టుకొస్తాయి కదా! [illegible] యింతసేపు కానరాకుండా నలుపు వెనుకనున్న ఆ చెవి కోత తాలూకు బాధ, ఒక్కమారుగా పెద్ద వరదవచ్చి

పడ్డగాని వృత్తాంతంగా, తెలిసివచ్చింది. ఎంత బాధగా వున్నదో గది పదిహేను నూటల్లో ఎవరికైనా చెప్పుకొన్నా కొంతమటుకు బాధ వుపశమిస్తుందేమో అనుకొంటే, వీరుడైనవాడు అలాటి బాధలు పైకి చెప్పరాదాయెను? అందుకే—కోట ఏదైనా కంటబడితే బాగుండు ననుకొన్నాడు. ఆ కోటలో చాటుగానో, మాటుగానో ఎవరికి తెలియకుండా యింత చిలకముక్కు చెట్టు ఆకు పసరుతెచ్చి, ఆ దెబ్బకి పూసుకొంటే ఆ బాధ వుపశమిస్తుంది కదా అని ఆశపడ్డాడు. ఆ ఆశకొద్దే, కోట ఎక్కడైనా కనుపడుతుందేమో నని మాత్రం పైకి అన్నాడు.

డాన్ క్విక్సెట్ [illegible] బాధ అంతా శాంకో పాంజాకు [illegible]. [illegible] ఎక్కటినుండో [illegible] అన్నతున్న [illegible] [illegible] బాధకూడా [illegible] [illegible] కొన్నాడు [illegible] [illegible] పోయిన [illegible] [illegible] పాటు వున్నాయని [illegible]

[illegible] ఒకటికి శాంకో పాంజా [illegible], డాన్ క్విక్సెట్‌కు నోటు వచ్చింది. "అయితే బయటకు తియ్యి, తిండాకలని నోరు తెరిచి అన్నాడో యేలోగానే, శాంకో పాంజా వెదికముఖం పెట్టి, "నా దగ్గిర అయితే యీ రొట్టెముక్కలు, జున్నుముక్క, వుల్లి

పాయి వున్నాయి కానీ, మీలాంటి వీరులు, దొడ్డ మనుష్యులు యివి తినకూడదేమో ?" అంటూ వెనక అనుమానం ఒకటి బయటపెట్టాడు. డాన్ క్విక్ సెట్‌కు దీనితో తలపై పెద్దపిడుగు పడ్డట్లయింది. ఒక చెంపను ఆకలితో చెవులు ఘుడియలు పడిపోతూవుంటే, తినటానికి యిప్పట్లో ఏదీ దొరకదేమో అని భయపడి చస్తుంటే, శాంకో పాంజా యిలా తనవద్ద తినటానికి కొన్ని వస్తువులు వున్నాయని బయటపెట్టి, 'అవి మీలాంటి వీరులు తినకూడదేమో' అంటూ అడ్డు పెట్టేసరికి, అతడికి వళ్లు మండుకువచ్చింది. 'పరవా లేదు లే, యిటు తే' అందామా అంటే—ఏ గడ్డి పడితే ఆ గడ్డి కరిచే అల్పుడి క్రింద తనను యీ శాంకో పాంజాయే జమ కట్టేస్తాడేమో! పోనీ—వాడు ఒక్కడే అలా అనుకొన్నా యింతలో కొంప ముంచుకు పోయేది ఏమీ లేదు. తాను యిలాగు వుల్లిపాయలతో కడుపు నింపుకొన్నాడనే వార్త, వీరసమూలంగా ఆనోటా ఆనోటా ప్రాకిందంటే వీరుడుగా తనకు యింక వచ్చే మంచిపేళ్లయినా పుట్టవే! పెద్ద చిక్కే వచ్చి పడింది. ఏం చెయ్యటానికీ తోచ లేదు. కొంచెం సేపు ఆలోచించాడు. బంగారంలాంటి ఆలోచన ఆ (మట్టి) బుర్రలో గబుక్కున మెరిసింది.

"శాంకో! నీ అమాయకత్వమును జూచినకొలదీ నీపై నాకుగల జాలి అధికమగుచున్నది. ఎంత చెప్పి నను, ఎంత చూచిననూ, నీకు వీరులు, వీరోచిత

కార్యముల తీరులు బోధపడకయున్నవే! ఈమహాత్తర విషయములను గూర్చి నే నెన్నివిధముల బోధించినను, ప్రత్యక్షముగా ఆచరించి చూపినను, నీకు యిసుమంతయు బోధపడక యున్నదే! కటకట—నే నేమి చేయుదును? నే జదివిన వీరగాథ లన్నిటియందును వీరులైన వారు పెద్దపెద్ద రాజభవనములలో మాత్రమే విందులు కుడిచినట్లు వర్ణింపబడియున్నది. అంతవరకు నది సత్యమే. కాని-వున్నచోట వుండక, వున్నచోట మానక, ఎల్లప్పుడును సంచారకార్యక్రమములందు మునిగితేలు యీ వీరు లందరునూ, మనుష్య మాత్రులే అయినందున, ప్రతిదినము, దినమునకు రెండుసార్లు అయినను కడుపునకు ఏదియో ఒకింత వేయక వారికినీ తప్పి యుండదు వారు సామాన్యముగా అడవులు, ఎడారులలో ప్రయాణములు చేయుదురు కదా! అచ్చట ఆహారపదార్థములు ఎట్టివి? కందమూలములు, ఆకు లలములు, ఎండు ఖర్జూరములు. ఇంతియే గదా! ఆ వీరులు వీటితోనే కాలము గడుపుకొని యుండవలయును. వారు తిన్న ఆ కంద మూలముల కంటెనూ, ఆ యాకులలములకంటెను నీ సంచిలో నున్న యీ రొట్టెముక్కలు, వుల్లిపాయలు మిక్కిలిగా వీరులకు భోజ్యవస్తువులే. కాన తొల్లిటి వీరులు భ్రమింగిన ఆ ఆకులలములకంటె రుచికరములైన ఆహారపదార్థములు నీవద్ద నుండగా, వానిని నావంటి వీరునకు సమర్పించరాదేమోనన్న కుశంక నీమంద

బుద్ధికి ఏల తోచెడినో నాకు అర్థముగాకయున్నది. వెఱ్ఱిమొర్రి అనుమానములతో ప్రమేయము పెట్టుకొనక, నీవద్దగల ఆహారపదార్థముల నిటు తెమ్ము" అన్నాడు.

ఎంత చిన్న విషయానికి ఎంత పెద్ద వుపన్యాసం యీయవలసివచ్చింది ? ఇంత పెద్ద వుపన్యాసం యిచ్చినందుకు ఫలితం కనుపించింది. ఆ శాంకో పాంజాకు పుట్టుకొచ్చిన అనుమానాలు తొలగిపోతున్నట్టే ఆతని ముఖంలో కవళికలను బట్టి డాన్ క్విక్సెట్ కు అర్థమయింది.

"ఏదో తెలియనివాణ్ణి; నన్ను మన్నించాలి స్వామీ ! మీరు చెపుతున్న కథల గాథలు నేనేమీ చదువకపోవటమే నా అజ్ఞానానికి కారణం. నేను పుస్తకాలు చదువక పోవటానికి కారణం, నాకు చదువు రాకపోవటమే. నాకు [illegible], [illegible] గాథలు [illegible], [illegible] యిప్పుడు [illegible] మాత్రం ఏం లాభం ? [illegible] యిక ముందు మాత్రం తగినంత జాగ్రత్త [illegible]. వీలైనప్పుడల్లా మీ కోసం [illegible] ఎండు ఖర్జూరపు కాయలు, కందమూలాలు, [illegible], యీసంచినిండా పోసిపెట్టాను. ఇక [illegible] మంటారా — నాకు ఎలాగూ [illegible] పట్టాభిషేకం వగైరాలు ఏమీ కాలేదు కనుకనూ, పరీక్ష పుచ్చుకొన్నవాడిని కాను కనుకనూ, కందమూలాలు,

ఎండు ఖర్జూరపళ్ళే తినాలనే నియమం నాకు లేదు కనుకనూ, మనంపోయే మార్గాలలో ఎక్కడైనా కోళ్ళూ, కొక్కిరాయిలు, కాబేజీ, బీట్‌రూటూ బంగాళాదుంపలూ, మసాలాదినుసులు, కోబ్బరి లౌజు, వాటితోనే కాలం గడుపుకొంటానులెండి" అన్నాడు శాంకోపాంజా; అక్కడికి తాను ఏదో హీనమైన తిండి తినబోతున్నట్లు దిగులుగా ముఖం పెట్టి.

శాంకో పాంజా ముందు ముందు నిజంగానే కోడి మాంసంలాంటి మంచి మంచివి అన్నీ తనే తినేసి, తన ముఖాన యింత దురదకంద పారేసి, 'నువ్వు వీరుడివి కనుక, యివే తినాలని' అంటాడేమోనని డాన్ క్విక్ సెట్‌కు గాభరా వేసింది. తనబోటు అంత మంచి భోజనం తింటూవుంటే తాను ఆ గడ్డీ గాదం ఎక్కడ తినాల్సి వస్తుందోనన్న ఆ వేదన ఎక్కువైంది. అందుకని మళ్ళీవుపన్యాసధోరణి లంకించుకొని, వీరులు కేవలము కందమూలాలే తిని తీరాలనే నియమం ఎక్కడా లేదనీ, దొరికితే ఏమైనా తినవచ్చుననీ, శాంకోపాంజాకు అరగంటసేపు వివరించి చెప్పాడు. వాడికి యివన్నీ నచ్చచెప్పాక కానీ, వాడు సంచిలోనుంచి ఆ రొట్టె ముక్కలూ, జున్నుముక్క, వుల్లిపాయలు బయటకు తియ్యలేదు. ఎండి పసుగుబావున్న ఆ రొట్టెముక్కల్లో రెండూ, పాసిపోయిన జున్నుముక్కలో సగం, డాన్

క్విక్‌సెట్‌కు యిచ్చాడు. ఉల్లిపాయ చెక్కొట్టి అందులోనుంచీ కూడా ఒక ముక్క కోసి అందించాడు. ఇద్దరూ ఆ రొట్టెముక్కలూ, అవే పంచభక్ష్య పరమాన్నాలనుకొని, వాటినే పీక్కుతిని, చల్లని నీళ్లు త్రాగి త్రేన్చారు.

ఆవిధంగా 'విందు' ముగించుకొని యిద్దరూ మళ్లీ వాహనాలు ఎక్కి బయలుదేరారు. అప్పటికి ప్రొద్దు గూకింది. కాలి కాలి వున్న కడుపులకు ఏదో యింత తిండి పడేసరికి, యిద్దరికీ కంటిమీదికి కునుకు వచ్చింది. నడుం వల్చటానికి యింత చోటు ఎక్కడైనా కనిపిస్తే బాగుంటుందని యిద్దరికీ అనిపించింది.

అలా కొంతదూరం జోగుతూ జోగుతూ పోయేసరికి, అక్కడ గొఱ్ఱెలు కాచుకొనే వాళ్ల పల్లె ఒకటి వీళ్లకంట పడింది. ఆ పల్లె యింకా రెండు మూడు ఫర్లాంగుల దూరంలో వుండగానే, మంచి పోపులవాసన ఘుమాయించింది. ఆ ఘుమాయింపుకు యిద్దరూ సమ్మోహితులై, ఆ వాసన వస్తున్నవైపుకే వాహనాలను పోనిచ్చారు.

అక్కడ గొఱ్ఱెల కాపరులు కొందరు చేరి పెద్ద కోలాహలంగా వంటలు వండుకొంటున్నారు. వాళ్లు మంచి హుషారులో వున్నారేమో, యీ ఆగంతుకులను యిద్దరినీ చూడగానే వారికి బ్రహ్మాండమైన స్వాగతమిచ్చారు. ఆ రాత్రికి తమతో పాటు భోజనంచేసి అక్కడే పడుకోమని ఆప్యాయంగా

ఆహ్వానించారు. అనుకోకుండా వచ్చిపడ్డ యీ అదృష్టానికి వీళ్లు యిద్దరు మహానందం పొందారు.

'రోజినాన్టీ'ని 'డాపుల్'ని తీసుకొనిపోయి అక్కడే ఒక చెట్టుకు కట్టివేసి వీళ్లు యిద్దరూ, ఆ గొర్రకాపరుల భోజనాలు జరుగుతున్న చోటికి చిరునవ్వులు ఒలకబోసుకొంటూవచ్చారు. అక్కడివాళ్లుఅందరుగొర్రెతోళ్లు నేలమీద పరచుకొని నెగడుచుట్టూ కూర్చొనివున్నారు. నెగడుమీద పెద్ద గంగాళంలో కమ్మని పులుసు సలసల కాగుతున్నది. వీరుడి వేషంలోవున్న డాన్ క్విక్ సెట్‌ను, తమతో పాటు నేలమీద చతికిలపడమంటే బాగుండదని, ఆగొల్లవాళ్లు, నీళ్ల గాబునొక దానిని బోర్లించి, దానిమీద ఆయనను ఆసీనుడుకమ్మన్నారు. శాంకో పాంజాకూడా ఆయన ప్రక్కనే కూలబడ్డాడు. గొల్లవాళ్లు యీ అతిథుల నెంతో మర్యాదచేశారు. వాళ్లు తినగలిగినంత తిండిపెట్టి, త్రాగేందుకు కొంత మంచిరకం సారాకూడా యిచ్చారు. ఇద్దరూ పూటుగా పొట్టలు నింపుకొన్నారు. గొల్లవాళ్లు వాళ్లలో వాళ్లు ఆడుకొనే పరాచికాలు వింటూ ప్రొద్దు గడిపారు. వాళ్లు వన్నె చిన్నెలుగా చెప్పుకొంటున్న కథలన్నిటినీ చెవులు రిక్కించి విన్నారు.

భోజనాల హడావుడి అంతా ముగిసేసరికి మరొక గొల్లవాడు ఎక్కడినుంచో అప్పుడే వచ్చి వీళ్లతో కలిశాడు. ఇతనివయస్సు యిరవై. యిరవై

ఐదు మధ్యను వుంటుంది. కండలు మెలితిరిగి, మనిషి చూడ ముచ్చటగా వున్నాడు. మాటలాడటంలో కూడా బలే చమత్కారం చూపించాడు. అలా సరదాగా కాసేపు కబుర్లు చెప్పి, వాడు పాటలు పాడటం మొదలు పెట్టాడు. గొంతెత్తి పాడుతూ, నాటురకం ఫిడేలు ఒకటి పుచ్చుకు చక్కగా వాయించాడు. అతడి కంఠంకూడా ఎంతో శ్రావ్యంగా వున్నది. ఇతడు పాటలు పాడటం అవీ ముగిశాక, వాళ్లలో నే మరొకడు పెద్ద కథఒకటి చెప్పటం మొదలుపెట్టాడు. అందరూ ఎంతో యిదిగా విన్నారు,-వాడు చెపుతున్న ఆకథను. ఇదంతా పూర్తి అయ్యేసరికి రాత్రి చాలా ప్రొద్దుపోయింది. అందరు నిద్రకుపడ్డారు. మన డాన్ క్విక్ సెట్ ఆయన బంటూకూడా అక్కడే నడుములువాల్చి, బాగా గురకలు పెట్టూనిద్రపోయారు.

## 6

ఆ రాత్రి అంతా ఆవిధంగా ఆ గొల్లపల్లెలో సుఖంగా కాలక్షేపం చేసి, డాన్ క్విక్ సెట్, ఆయన బంటు మర్నాడు ప్రొద్దునే బయలుదేరారు. అదేమి దురదృష్టమో—ఆరోజు వాళ్లిద్దరూ అనవసర మైన ఒక జంజాటంలో యిరుక్కొని చావు తప్పించుకు బయటపడ్డారు.

బాగా ఎండవచ్చాక రెండుమూడు గంటలసేపు అలాగే రోడ్డువెంట వెళ్లినవాళ్లు, అంతలో ఒక

పెద్ద పచ్చికబయలు కనిపిస్తే, అందులోకి తమ వాహనాలను మళ్లించారు. బాగా ఒత్తుగా పెరిగిన పచ్చగడ్డితో, ఆమైదానం కనుల పండువుగా కనుపిస్తున్నది. అక్కడ నుంచి నీళ్ల వాగు ఒకటి ప్రవహిస్తోంది. ఆ వాగు పైనుంచీవచ్చే చల్లనివాయువులు, ఆ తరంగాల ధ్వనిలో వినిపించే సంగీతస్వరాలు, వీళ్ల మనస్సుల నెంతో వుత్తేజపరిచాయి. అప్పటి కప్పుడే బాగా ప్రొద్దెక్కిపోయి, ఎండ చిటచిట లాడుతున్నది. ఇంత ఎండలో పడిపోవలసినంత తొందరపని ఏదీలేని కారణాన, వీళ్లిద్దరు ఆ చల్లనిచోట కాసేపు విశ్రాంతి తీసుకొని మరీ, ముందుకు కదలిపోదామని కూడబలుక్కొన్నారు. ఆ బుద్ధి వాళ్ళకు పుట్టక పోయినా బాగుండేది!

పచ్చికబయలులో కొంతదూరం వెళ్ళి వాగు ఒడ్డున ఆగారు. ఇద్దరూ వాహనాలమీదనుంచీ దిగి, ఒకచోట కూలబడి పిచ్చాపాటీ మాట్లాడుకొంటు న్నారు. నిజానికి 'రోజినాన్‌టీ'ని ఓ చెట్టుకు కట్టి, దాని విషయంలో శ్రద్ధ తీసుకోవలసిన బాధ్యత అంతా బంటు అయిన శాంకో పాంజాదే. రోజినాన్‌టీ అన్ని గుర్రాలలాగా పొగరుబోతు గుర్రం కాదనీ, ఎక్కడ నిల్చోబెడితే అక్కడే వుండిపోయేటంత బుద్ధిగల జంతువు అనీ శాంకోపాంజాకు ఒకవిధమైన నమ్మకం. అల్లరి చిల్లరిగా యజమానిని తప్పించుకుపోయే తత్వం యీ ముసలిగుర్రానికి లేదు కదా అన్న

ధైర్యంతో, దానిని చెట్టుకు కట్టివెయ్యకుండా యథేచ్ఛగా వదిలివేశాడు, శాంకో పాంజా. దాంతోనే వచ్చింది చిక్కు అంతా!

అంత ఎండవేళప్పుడు చల్లని గాలి ఒంటికి సోకేసరికి ఆ స్వామీ, యీ బంటూ వళ్లు మరిచి నిద్రపోయారు. ఆ గాడిదా, యీగుర్రం, అక్కడా అక్కడా కాసేపు తాచ్చాడాయి నోటికందిన పచ్చి గడ్డి చివళ్లను సుతారంగా కొరుకుతూ నింపాదిగా అడుగుదీసి అడుగు వేస్తూ ముందుకు సాగి పోతున్నాయి.

ఇంతలో పెద్ద గుర్రాలమంద నొకదానిని మళ్ల వేసుకొని కొంతమంది కాపరులు ఆ మైదానానికే వచ్చారు. వాళ్లు రోజూ యీ మందను యిక్కడికే తోలుకువచ్చి, వాటి యిష్టంవచ్చినంత సేపు వాటిని మేయనిచ్చి, ఆప్రక్కనే వున్నవాగులో యిన్ని నీళ్లు పట్టి, మళ్ళీ యిళ్లకు మళ్లేసుకు పోతుండేవాళ్లు.

తనజాతికి చెందిన గుర్రాలు యిన్ని ఒక్కసారి ఒక పెద్ద మందగా కంటపడేసరికి, 'రోజినాన్టీ'కి ఏమిటో, వళ్లు తెలియని మైకం కమ్మినట్లు అయింది. అవతల ఆ యజమాని పడుకొని వున్నాడు కదా, ఆయనను అడిగిపోవాలన్న ఆలోచనన్నా లేకుండా యీ ముసలి గుర్రం ముట్టె ఆడించుకొంటూ, గబగబా ఆ మందలో-తానూ, తగుదునమ్మా అని - కలియ బోయింది. పోనీ ఆ గుర్రాలకైనా కాస్త బుద్ధివుండ

కూడమూ? తమ జాతికి చెందిన గుర్రమే కదా, యీ రోజినాన్‌టీ కూడా! అందులోనూ, వయస్సు మళ్లిన ప్రాణికదా! కాస్త మర్యాదగా చూడ కూడదూ! పెద్దా చిన్నా తారతమ్యం లేకుండా, మాటా మంతీ లేకుండా, పూసుకు తిరుగుదామన్న ఆశకొద్దీ వచ్చిన 'రోజినాన్‌టీ' పళ్లు పూడి కిందపడేలా ఒక్కొక్క గుర్రం దీని ముట్టిపైన వెనకకాళ్లతో తన్నటం మొదలుపెట్టింది ఇంకా చూడండి! గుంపుగా వస్తున్న గుర్రాలన్నీ, ఫుట్‌బాల్ గ్రౌండులో ఆటగాళ్లు సర్దుకొన్నట్లుగా అక్కడ ఒకటి, యిక్కడ ఒకటిగా మైదానం అంతటా సర్దుకొని, యీ ముసలిగుర్రాన్ని అటునుంచి యిటు యిటునుంచి అటు తన్నుతూ విలాసంగా ఆట ఆడటం ప్రారంభించాయి.

లల్లాయిపదాలు పాడుకొంటూ వస్తున్న కాపరులు, గుర్రాల మందలో బయలుదేరిన ఆ కలకలాన్ని గమనించి, సంగతేమిటోనని తొందర తొందరగా పరుగెత్తుకొనివచ్చి, యీ దృశ్యాన్ని చూశారు. పరాయివాళ్ల గుర్రం ఏదో వచ్చి, తాము అనువాయితీగా తమ పశువులను మేపుకొనే యీ బీడులో పడి, తెగతింటూ వున్నదని యీ ముసలి గుర్రంమీద కోపం తెచ్చుకొన్నారు. చేతుల్లోవున్న దుడ్డుకర్రలతో ఆ ముసలి జీవాన్ని చావచితక పొడిచారు. అలా వాళ్లఅందరి చేతుల దురదా తీరేదాకా

కొట్టి, కదలలేని స్థితిలో 'రోజినాన్‌టీ'ని వదలి పెట్టారు.

ఈలోగా డన్ క్విక్ సెట్ కు, శాంకో పాంజాకు మెళుకువ వచ్చింది. వీళ్లకు 'రోజినాన్‌టీ' చుట్టుపట్ల ఎక్కడా కనుపించలేదు. కొంచెం దూరంలో కర్రలతో ఎవరినో కొట్టుతున్నట్లు, గుర్రపు డెక్కలు కదులుతున్నట్లు, చప్పుళ్లు వినిపిస్తున్నాయి. ఇద్దరూ ఒక్కసారిగా లేచినిల్చొని, ఆ చప్పుళ్లు వినిపిస్తున్న వైపుకు నురుగులు కక్కుకొంటూ పరుగెత్తారు. తీరా అక్కడికి వచ్చిచూస్తే—ఇంకేముంది? వీళ్లెవరో యీ దుండగులు 'రోజినాన్‌టీ'ని చావబాదుతూ వున్న దృశ్యం ఆతని కంటబడింది. ఒక్కమారుగా ఆతని ముఖమూ, కళ్ళూ జేవురించాయి. శాంకో పాంజాకు కూడా కోపం వచ్చింది. ఆకోపంతో వాడు, గాలికి కదిలే ఎండుటాకులా, ఎగిరెగిరిపడటం మొదలు పెట్టాడు. డన్ క్విక్ సెట్ సర్రున కత్తిదూసి, ముందుకు దూకాడు. శాంకో పాంజాకూడా ఆయన వెనకాలే గంతులు వేశాడు. అవతలవాళ్ళు అంతమంది వుండగా తామిరువురేనన్న విషయమైనా తలపోయకుండా యిద్దరూ చిందులు తొక్కుతూ పెద్దగా రంకెలు పెట్టారు.

అంతమంది కాపర్లలోనూ డన్ క్విక్ సెట్, యాదాలాభంగా నిల్చొనివున్న ఒకడిని వెతికి, వాడి మీద ఒకదెబ్బ చరిచాడు. దాంతో ఆ కాపర్లంద

రికీ మాించి ఆవేశం వచ్చేసింది. అందరూ పెద్దగా కేకలు వేసుకొంటూ ఒక్కసారిగా డాన్ క్విక్ సెట్ మీదకు కమ్ముకువచ్చి, దుడ్డుకర్రలతో తలా ఒకటీ యిచ్చుకొన్నారు. డాన్ క్విక్ సెట్ కు పట్టినగతి చూసి ముందుకు పోవటానికీ ధైర్యంచాలక, వెనక్కు రావటానికీ దిక్కుతోచక తికమకపడుతూ అక్కడే నిలబడివున్న శాంకోపాంజాను కూడా ఆ కాపర్లు ఆ చేత్తోనే రెండు వుతికేశారు. అంతా ఏను నిమిషాలు గడిచేలోగా ఆ మైదానంలో ముందు 'రోజినాన్ టీ', తరువాత డాన్ క్విక్ సెట్, ఆ తరువాత శాంకో పాంజా వరసగా, ముగ్గురూ నేలపై వాలిపోయారు. అప్పటికి ఆ కాపర్లకు, వీళ్లిద్దరూ కొంపతీసి చచ్చిపోయారేమో నని, దిగులు పుట్టుకొచ్చింది. ఎక్కడివాళ్లు అక్కడ తమ పశువులను మళ్లేసుకొని తప్పించుకు పారిపోయారు.

క్షతగాత్రుడైన వీరాధివీరుడు, శూరాగ్రే సరుడు డాన్ క్విక్ సెట్, ఆయన నమ్మిన బంటు కాబోయే గవర్నరు శాంకోపాంజా — యిద్దరూ వొళ్ళు చితకపొడిపించుకొని మాటా మంతీ లేకుండా, బాధతో మూలుగుతున్న రోజినాన్ టీ ప్రక్కనే చాలా సేపు పడివున్నారు.

ఎట్టకేలకు శాంకోపాంజా అతిప్రయత్నం మీద కనురెప్పలు విప్పి, మెల్లిగా మెడ కదలించి తన స్వామివైపు చూచాడు. ఆయనలో అసలే కదలిక

వున్నట్లు కనుపించ లేదు. అంతమాట అనరాదు కాని- ఆయన ప్రాణం కాస్తా 'హరీ' అన్నదేమో అని శాంకో పాంజా గుండె తల్లడిల్లిపోయింది.

"స్వామీ! నా స్వామీ!" అంటూ హీన స్వరంతో ఆయనను పిలిచాడు. ఆ-డాన్ క్విక్ సెట్ గారికి యింకా వూపిరివున్నది. శాంకోపాంజా పిలిచిన పిలుపు ఆయనకు వినిపించింది. కళ్లు తెరవకుండానే, అంతకంటే యింకా హీనమైన కంఠ స్వరంతో "ఏమి సోదరా!" అని బదులు పలికాడు.

శాంకో పాంజాకు ధైర్యం వచ్చింది. తన స్వామి బ్రతికేవున్నందుకు వెయ్యి దేవుళ్లకు దణ్ణాలు పెట్టాడు.

"ఆ! ఏమీలేదు;...మన కాళ్లూ చేతులు మళ్ళీ స్వాధీనంలోకి రావటానికి అసలు ఎన్నిరోజులు పడుతుందో, మీకేమైనా తెలుసునేమో అడుగుదామని పలుకరించాను."

శాంకోపాంజా అడిగిన యీ ప్రశ్నే, డాన్ క్విక్ సెట్ ను కూడా యింతసేపు లోలోపల సలుపుపెట్టి మహా వేధిస్తున్నది. ఆ ప్రశ్నకు సమాధానం ఏం చెప్పాలో తెలియక, "ఇదమిత్థమని ఏమియు చెప్పజాలము! శాంకో!" అంటూ అనునయపూర్వకమైన కంఠస్వరంతో సమాధానం యిచ్చాడు. ఇలా అంటే యీ బంటు మళ్లీ ఎక్కడ

దిగులుపడిపోతాడో అని భయంవేసి, డాన్ క్విక్ సెట్ యీ విధమైన దుర్గతి తమకు ఎందుకు పట్టిందీ, దానికి గల కారణాలు ఎంత అసాధారణమైనవో, తన కెంత ఓపిక లేకపోయినప్పటికీ, ఓపినంతమటుకు వివరించాడు వీరుడుగా వ్యవహరించబోయినందువల్ల నే యీ తిప్పలన్నీ పడవలసివచ్చాయని, శాంకో పాంజా ఎక్కడ అపోహపడతాడో అనే తొందరకొద్దీ, వీరులు, వీరులవర్గం—వారికి గల ప్రాశస్త్యం అంతా మరొకసారి విడమర్చి చెప్పాడు. అక్కడికి మనస్సు ఆగక "శాంకో! అసలు ఇందు జరిగిన పొరపాటు అంతయు నాదియే. నీవేమియును వగజెందకుము. నే నా పొరపాటు చేయకున్నచో, మనకీ గతి పట్టియుండెడిది కాదు. నాకా విషయము బాగుగ తెలియును నీ వది గ్రహించితివో లేదో గానీ, వీరుల వర్గమునకు జెందిన నావంటి వ్యక్తి, యిట్టి క్షుద్రమానవుల జోలికి పోకూడదు. వారిని కన్నెత్తి చూడరాదు; పన్నెత్తిపలుకరించరాదు. వీరులకు నిషేధితములైనపని చేసితిని కనుక నే నాకీ శిక్ష—ఇప్పుడు నే ననుభవించుచున్న యీశిక్ష యికముందైననూ యిట్టి క్షుద్రుల జోలికి బోరాదని హెచ్చరిక చేసినట్లు అయినది. మన మిక సలుపు వీరవిహారములలో మరెన్నడైననూ యిట్టి క్షుద్రులతో తలపడవలసిన అవసరమే వచ్చినచో, వారిజోలికి నేను పోను. నీకు వీరాభిషేకము కాలేదు కనుకనూ, నీవు వీరకంకణము కట్టించుకొననందునను,

అట్టి క్షుద్రులను నీ యిచ్చవచ్చిన రీతిని నీవే పరిమార్చుము. నీ కా అధికారము నిదే యిచ్చుచున్నాను" అని గంభీరంగా అన్నాడు.

ఇంత పెద్ద అధికారం యిచ్చేస్తున్నందుకు శాంకో పాంజా సంతోషిస్తాడు కదా అని యీాయన ఎంతో ఆశపడ్డాడు కాని యీాయనఆశ నిరాశ అయింది. తాను ఎవరితో కూడా పోట్లాడేరకం మనిషిని కానని, శాంకో పాంజా సవినయంగా చెప్పకొన్నాడు. ఎవళ్లు ఎంత అసహ్యాంగా ప్రవర్తించినా, తాను వాళ్లపై కత్తి దుయ్యనే దుయ్యనని, ఏ క్షుద్రుడైనా తప్పి జారి తననొక తప్పడుమాట ఆడినా కూడా వాణ్ణి వెంటనే క్షమించి వూరుకోవటానికైనా ఒప్పకొంటాను కానీ, వాళ్లపైకి కాలు దువ్వి కయ్యానికి పోలేనని నిక్కచ్చిగా చెప్పివేశాడు.

డాన్ క్విక్ సెట్ కు, వీడిమాటలు వింటుంటే బావురుమని ఏడ్పు వచ్చినంత పనిఅయింది. వీడు యింత పిరికివాడేమిటూ; యింత పౌరుషంలేనివాడేమిటూ అని అతనికి బలే దిగులువేసింది. ఆ దిగులు కొద్దీ ఏదేదో మాట్లాడుతూ, "శాంకో! రేపు మనము ఆ దీవిని స్వాధీనపరచుకొనినతరువాత, దానిపై పరిపాలనాధికారము, యింత పిరికిగుండెవైన నీకు, నే నెట్లు అప్పగించగలవాడను!!" అంటూ విస్తుపోయాడు.

ఆ క్షణాన శాంకో పాంజా మనస్సుకు ముందెప్పుడో రాబోయే గవర్నరు పదవి, ఆ వైభవాలకంటె కూడా, ప్రస్తుతం వేధిస్తున్న వళ్లునొప్పులే అతి ప్రధానంగా తోచాయి. అందుకని ఆమాటల ధోరణి మార్పించడం ఎందుకైనా మంచిదని వాడికి తోచినమీదట, "స్వామీ! మీరు ఏమైనా కాస్త లేచి నిలబడగలరేమో ప్రయత్నం చేయకూడదా? ముందు మీరు లేవగలిగితే, పాపం, మన 'రోజినాన్టే'ని కూడా లేవదీసి నిలబెట్టవచ్చునే!" అని సాధింపు ధోరణిలో అన్నాడు.

డన్ క్విక్ సెట్ వెర్రివాడు అయితే కావచ్చు. ఇంగితజ్ఞానం లేనివాడైతే కావచ్చు. కాని, కష్టంవచ్చినప్పుడు ఆ కష్టాన్ని ధైర్యంతో ఎదుర్కొనే సాహసం మాత్రం కలిగివున్న మనిషి. అతని విషయంలో అంతవరకు ఒప్పుకోకతప్పదు. శాంకో పాంజా ఆవిధంగా చెప్పటం ఆరంభించేసరికి యితనికి పౌరుషం వచ్చేసింది. పళ్లబిగువున, లేని ఓపిక తెచ్చుకొని, ఎక్కడి కీళ్లు అక్కడ పట్టుకుపోయినా, అతి ప్రయత్నంతో లేచి నిలబడగలిగాడు. అసలు యిప్పట్లో లేచి మనిషిలా నిలబడలేననుకొన్న తనే లేవగలిగినప్పుడు, యీ బంటుగాడు. యింకా మూల్గుతూ మూలుగుతూ గడ్డిమీదనే ఎందుకు పడుకొని వుండలో యీాయనకు అర్థంకాలేదు. తాను యజమానిని అనీ, వాడు బంటూ అనీ మరొకసారి

జ్ఞాపకం తెచ్చుకొని, ఆ వరసను మూలుగుతున్న వాడిని వెంటనే లేచి నిల్చోమని హెచ్చరించాడు.

ఎన్నడూ లేనిది తనను యజమాని యిలా గదమాయించేసరికి, శాంకో పాంజాకు ఏం చెయ్యాలో తోచక, ఆయన వుత్తరువు వేసిన ప్రకారమే లేచి నిల్చోవటానికి ప్రయత్నం చేయనారంభించాడు. ఎంతోసేపు ముక్కీ, మూలిగీ, రాయిని తిట్టీ, రప్పను తిట్టీ, చెట్టును తిట్టీ, పుట్టను తిట్టీ, చిట్టచివరకు ఎలాగైతేనేం—ఆ దెబ్బలతోనూ, ఆ గాయాలతోనూ కట్టెలా బిగుసుకుపోయిన తన కాయాన్ని, భూమి మీదనుంచీ లేవదీసి, విల్లంబుబద్ద వంగినట్లు వంగి నిలబడగలిగాడు. నిలుచునిపున్నప్పుడు అతని వెన్నెముక అలా వంకరగా తిప్పితే, నిటారుగా వుండటానికి ఎంత ప్రయత్నించినా అవకాశం యివ్వనే లేదు. అలాగే ఆ గూనుతోనే నడుచుకొంటూ పోయి 'రోజినాన్‌టీ'ని లేవదీయటంలో తన యజమానికి యింత సహాయంకూడా చేశాడు. లేచినవాణ్ణి ఎలాగూ లేచానుకదా అని, తన గాడిద 'డపుల్' ఎక్కడికి పోయిందోనని, దాన్ని కూడా వెతికి పట్టి లాక్కొచ్చాడు.

నడుం వంగిపోయినా కూడా అలాగే తంటాలు పడి డాన్ క్విక్‌సెట్‌గారిని లేవనెత్తి 'రోజినాన్‌టీ' వీపున కుదేశాడు. చావుదప్పి కన్ను లొట్టపోయి వున్న 'రోజినాన్‌టీ' కళ్లేన్ని తెచ్చి, తన గాడిదతోకకు అంటగట్టాడు. ఆ గాడిద కళ్లేన్ని తాను చేత్తో పుచ్చు

కొని, యీ జీవాలన్నిటినీ రోడ్డుమీదికి చేరవేద్దామనే తలంపుతో తనగాడిదను అదలించాడు. ఆగాడిద, తను నడవగలిగినంత నింపాదిగా నడక సాగించింది. అథవా—ఆ గాడిద అంతకంటే వడిగా నడిచినా కూడా ఆ 'రోజినాంటీ' కానీ, యీ వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు కానీ, యీ బంటు శాంకో పాంజా కానీ ఆ వేగానికి ఆగలేకపోయేవాళ్ళే!

శాంకోపాంజాకు రోడ్డు ఏవైపున వున్నదో సరిగా తెలియదు. అయినా ఏవైపున వుంటుందోనని ఒక క్షణకాలం యోచించి, ఏవైపున వుంటుందని తనకు తోచిందో ఆవైపుకే, మిగిలిన ప్రాణులను కూడా నడిపించాడు.

ఆ స్వామీ, యీ బంటూ కొంతదూరం అలా ప్రయాణమై వెళ్ళారు. డాన్ క్విక్ సెట్ గారి వళ్లు దెబ్బలతో పచ్చిపచ్చి అయిపోయి, ఆయనకు గుర్రంమీద కూర్చోవటానికీ కుదరలేదు; కాలు కదిపి నడవటానికీ చేతకాలేదు. ఇక యిది పనికాదని - ఏ దెబ్బలూ తినకుండా వున్నది ఆ గాడిద ఒక్కటే కాబట్టి, దాని వీపుమీద అడ్డంగా పడుకొన్నాడు. గాడిదపొట్టకు ఒకవైపున కాళ్లు, యింకోవైపున తలా వేలాడేటట్లుగా పడుకొని ప్రయాణం కొనసాగించాడు.

ఉండివుండీ ఆ ముసలిగుర్రం పెద్దగా సకిలించసాగింది. పాపం! దానికి ఎంత పెద్దదెబ్బలు తగిలాయో ఏమో! డాన్ క్విక్ సెట్ కు మాట్లాడేందుకు కూడా

ఓపిక లేకుండా పోయిందికాబట్టి కానీ, లేకపోతే, ఆ గుర్రంపై ఆయనకుగల అభిమానానికి, దాన్ని తన మూపున ఎక్కించుకుని, తానే గుర్రంలా, తన గుర్రమే రౌతులా దౌడుతీసేవాడే! శాంకోపాంజా తన బుర్ర వుపయోగించి ఆ గుర్రాన్ని తన గాడిదతోకకు కట్టాడు కాబట్టి, ఆ గుర్రం అంతమాత్రమైనా కదలగలుగుతున్నది.

శాంకోపాంజా కూడా ఆ కాపరుల చేతిలో దెబ్బలుతిన్న ఘటమే నేమో-వాడికి ఏమిటో మతిపోయినట్లే వుంది. తన స్వామిని చూడబోతే - ఆయన ఆ వరసను కూర్చో లేక, నిల్చో లేక నడుములు విరిగిపోయి, నానాయాతన పడుతున్నాడు; పోనీ ఆ 'రోజినాన్‌టీ' ని చూద్దామా అంటే, నోరులేని జీవం, దానికి ఎన్ని ఎముకలు విరిగాయో ఏమో, తడవతడవకు, తన గాడిదకంటే మిక్కుటంగా ఓండ్రపెడుతున్నది. ఎవరి విషయం చూసినా యింత నిరాశాజనకంగా వుంటే, శాంకోపాంజా తనకు తగిలిన దెబ్బవిషయం మర్చిపొమ్మంటేమాత్రం ఎలా మరిచిపోగలడు - వాడి ముఖం!

అలాగే భారంగా అడుగుతీసి అడుగు వేస్తూ తన గాడిదను నడిపించుకుపోతున్నాడు. అలా పోగా పోగా, కొంత సేపటికి బాగా చీకటిపడిపోయింది. కన్ను పొడుచుకున్నా ఎదురుగా ఏమున్నదీ కనుపించటం లేదు. కీచురాళ్ళు, యిలకోళ్ళు ఒకటే 'గీ' పెట్టి అరుస్తు

న్నాయి. దూరంగా చెట్లతోపుల్లోనుంచీ నక్కలకూతలు వినవస్తున్నాయి. గుడ్లగూబలు రెక్కలు తపతపకొట్టుకొంటూ రకరకాలైన శబ్దాలు చేస్తున్నాయి. తాము వున్న పరిస్థితీ, యీ అయోమయవాతావరణం యిదీ చూస్తే, శాంకోపాంజాకు పెద్దగా గుక్కపట్టి ఏడ్వేద్దామన్నంతదిగులు ఒక్కమారుగా పుట్టుకొచ్చింది. కానీ-వీరుడితో తిరుగుతూ వున్నందువల్ల, వీడికి కూడా, వచ్చే ఏడ్పును ఆపుకోవటంలోనే గొప్పతనం వున్నదనిపించింది. గుటకమీద గుటకగా గుటకలు మింగి, పెద్ద ప్రవాహంలా వస్తున్న ఏడ్పును గొంతులోనే ఆపివేశాడు. ఏడ్పుఅయితే ఆగింది కానీ, కడుపులో పేగులన్నీ తెంచుకు బయటకువస్తున్నంత హడావుడిగా ఎక్కిళ్లు లంకించుకొన్నాయి. తాగేందుకు యిన్ని నీళ్లైనా దొరికితే బాగుండుననుకొని నాలుగువేపులా కలయచూశాడు.

అటువైపు, ఆ చెట్ల గుబురుల్లోనుంచి మిణుకు మిణుకు మంటున్న దీపాలు కనిపించాయి. ఏ కీకారణ్యంలో యిరుక్కుపోయామోనని యింత సేపూ లోలోపలనే బెగ్గటిల్లిపోతున్న శాంకోపాంజాకు, యీ దీపాలను చూసేసరికి, ప్రాణాలు లేచివచ్చినట్లైంది. ఆ దీపాలు కనిపించేచోట ఎవరైనా మనుష్యులు వుండకపోతారా, వారిని అడిగి యిన్ని మంచినీళ్ళు అవీ పుచ్చుకు యీరాత్రికి గడపలేకపోతామా

అని ఆశపడ్డాడు. ఆ ఆశతోనే, లేనిపోని సత్తువ తెచ్చుకొని, గాడిదను మరికొంత వేగంగా నడిపించాడు.

దీపాలు దగ్గిరపడ్డాయి. కొంచెం ఎత్తైన గోడలున్న యింటిలోనుంచీ యీ దీపపు కాంతులు వస్తున్నట్లు తోచింది. ఆ గోడలు, ఆ దీపాలు ఏమిటై వుంటాయా అని డన్ క్విక్ సెట్, శాంకో పాంజా యిద్దరు మెడలు ముందుకు చాచి పరీక్షగా చూశారు. శాంకో పాంజా కంటికి అది ఒక హోటల్ లా తోచింది. డన్ క్విక్ సెట్ గారికి మాత్రం అది ఒక కోటఅయి వుంటుందనిపించింది. శాంకోపాంజా సవినయంగా చెప్పాడు—అది కోట కాదని. డన్ క్విక్ సెట్ అటువంటి మాటలు ఏవీ వినదలుచుకోలేదు. అది కోట అంటే కోటేనని పట్టుపట్టాడు. ఈయనను ఎలాగైనా ఒప్పించి, అది కోటకాదనీ, మామూలు హోటలేననీ ఆయనకు బోధపడేటట్లు చెయ్యాలని శాంకోపాంజా ఎంతో తంటాలు పడ్డాడు. వీరుల లక్షణమంటే యేమిటో వీడికి యిలాగైనా బోధపరుద్దామనీ, కట్టెదుర కనుపించే ఆ కట్టడం కోటేనని వీడిచేతకూడా ఒప్పింతామనీ డాన్ క్విక్ సెట్ గారు అంతకంటే ఎక్కువ తంటాలు పడ్డాడు. వీళ్ళిద్దరూ ఎవరి పట్టుదల వారు విడవకుండా ఆ కనుపించేది హోటలేనని వాడు, 'కాదు; కోటే' నని యీయనా, బిగ్గరగా వాదించుకొంటూ ప్రయాణం సాగించారు.

నిజానికి అది హోటలే! వాళ్లిద్దరూ యిలా బిగ్గరగా వాదించుకోవటం ఆ హోటల్ యజమానికి వినిపించింది. ఏదో బేరం తగిలేటట్లు వున్నదన్న ఆశతో, ఆయన చేస్తూ చేస్తూ వున్నపని కాస్తా వదిలివేసి గబగబా వీధిలోకి వచ్చి చూశాడు.



దణ్ణెంమీద వేలాడవేసిన గుడ్డమూటరిగా, గాడిద వీపుమీదినుంచి వేలాడుతున్న డాన్ క్విక్సెట్ గారి అవతారం చూసేసరికి అతనికి ఆశ్చర్యం వేసింది. ఈయన కేమైనా రోగంవచ్చి అలా వున్నాడేమోనని అనుకొని, యీయనకు వచ్చిన వ్యాధి ఏమిటని శాంకోపాంజాను అడిగాడు.

గుర్రపువాళ్ల చేతుల్లో తాము దెబ్బలు తిన్న వైనం యీయనకు చెప్పటానికి శాంకోపాంజాకు తగని నామోషీ వేసింది. అందుకని అసలు విషయాన్ని బయటపెట్టకుండా, తన యజమాని అంత ఎత్తు కొండమీదినుంచి కాలుజారి క్రిందకు దొర్లాడనీ, అలా పడటంలో ఆయన వంటిపై అక్కడక్కడా పదునైన రాతిమొనలు గీసుకుపోయి, గాయాలు తగిలాయనీ బొంకేశాడు.

ఈ మాటలు ఎక్కడనుంచి విన్నదో ఏమో— ఆ హోటల్ యజమాని భార్య బయటకు పరుగెత్తుకొంటూ వచ్చింది. ఆవిడగుండె అసలే జాలిగుండె. పాపం! యీ పెద్దమనిషి ఎవరో అంత ఎత్తు కొండ మీదనుంచి కాలుజారి పడి, వళ్లంతా గాయాలు చేసుకొన్నాడంటే ఆవిడకు కళ్లనీళ్లపర్యంతం అయింది. దబదబా పోయి తన కూతుర్నీ, ఇంట్లో పనిచేసేదాసీని పిలుచుకువచ్చింది. వీళ్లందరూ కలిసి, తలా ఒక చెయ్యివేసి, గాడిదవీపుమీద వేలాడపడిపోతున్న

యీవీరుణ్ణి నింపాదిగా దించారు. ఆ గాడిదకు బరువు తగ్గించారు.

ఆడవాళ్లు ముగ్గురూ కలిసి ఆయనను అలా యింట్లోకి తీసుకెళ్లారు. ఆ యింట్లోకల్లా కాస్త మసలటానికి వీలున్నచోటు, క్రిందిబాకుగావున్న అటక ఒక్కటే. దానిమీదికి యీవీరుణ్ణి—ఆవకాయజాడీ అటకమీదకు ఎక్కించినంతపదిలంగా—ఎక్కించారు. ఆవిడ వంటయింట్లోకి పోయి, గూళ్లుఅన్నీ గాలించి మందుడబ్బా ఏదో పట్టుకువచ్చింది. కూతురూ, తనూ, దాసీది ముగ్గురూకూడా అక్కడే నిలబడి, డాన్ క్విక్ సెట్‌గారి వంటిమీద ఎక్కడెక్కడ గాయాలు తగిలిందీ వెతికి యింతింత మందు పట్టించటం మొదలుపెట్టారు. వెతికినకొద్దీ గాయాలు కనిపించాయి. గాయాలు కనిపించినకొద్దీ,వీళ్లు మందు పట్టించారు. గాయాలన్నిటికీ మందు పట్టించటం పూర్తి అయ్యేసరికి డాన్ క్విక్‌సెట్ గారి వళ్లు, మందుడబ్బాలో ముంచి పైకితీసిన చందాన తయారు అయింది.

మందు పట్టిస్తూవుండగా ఆవిడకు ఎందుకు అనుమానం తోచిందో ఏమో — "నాకు చూడగా యీయనకు తగిలిన దెబ్బలు, ఏదో పెద్ద రోకలితో పోటువేస్తే తగిలే దెబ్బల్లా కనిపిస్తున్నాయి కానీ, కొండమీదినుంచి కాలుజారితే తగిలేవాటిలా కనుపించటం లేదే!" అంటూ ఆశ్చర్యం వెళ్లబుచ్చింది. అసలు రహస్యం ఎక్కడ బయటపడిపోతుందోనన్న

తొందరగకొద్దీ, శాంకో పాంజా వెంటనే కల్పించుకొని "చూడండి, అమ్మా! ఈయన ఎక్కిన కొండ సామాన్యమైన దనుకొంటున్నారేమో! అబ్బో! ఆకొండ అలాంటి దిలాంటిది కాదు; అంత ఎత్తు కొండ. ఆ కొండనిండా రాళ్లే. ప్రతిరాయీ—చూశారూ—మన యీ ఈటెమొనలాగా,—మొనలు తేలి, బలే పదునుగా వున్నదంటే నమ్మండి. అందులోనూ యీయన అంత ఎత్తునుంచి కాలుజారి దొర్లారేమో—ఆయన క్రిందపడేలోగా, ఆకొండలో వున్న ప్రతిరాతి మొనా యీయనవంటికి గీసుకుపోయింది. అబ్బ! ఆ దృశ్యం నే చూడలేకపోయాను; అది తలుచుకొంటే నాకు యిప్పుడు ఏడుపువస్తుందసుమండీ!" అంటూ చేతులు ముఖానికి అడ్డంగా పెట్టుకొన్నాడు.

అలా ఒకటి రెండు నిమిషాలు గడిచాక, చిర్రున చీది, లప్పెడు తీసి అక్కడే నేలమీద విసిరి వేసి, ఎడంచేత్తో ముక్కు తుడుచుకొని, "అమ్మా! ఆ మందు యింకా మిగిలితే నాకు కూడా కాస్త యిప్పిద్దురూ" అన్నాడు, ప్రార్థనాపూర్వకంగా.

ఇతడు యీమాట అనేసరికి, అంతసేపూ అటు తిరిగి డాన్‌క్విక్‌సెట్ గారి వంటిమీద మందు పట్టిస్తున్న ఆమె, యిటు తిరిగి "అదేమిటీ! నువ్వు కూడా ఆ కొండమీదనుంచి పడ్డావా; ఏం?" అని ఆత్రంగా అడిగింది.

"ఎబ్బే! లేదండీ! ఏమిటో—ఆయన అంత పాటుపడితే, నాకూ యీ ప్రక్కలన్నీ డోక్కుపోయినట్లే వున్నది. ఆయనఅవస్థ చూస్తుంటే నామటుకు నాకు, నావంటిమీద వేయి గాయాలు తగిలినంత బాధగానూ, నలుపుగానూ వున్నదండి," అని సమాధానం యిచ్చాడు శాంకోపాంజా. ఈ సమాధానంతో ఆ అమాయకురాలు సంతృప్తిపడినట్లే కనిపించింది. దాసీదాని చేతికి ఆ మందుడబ్బా యిచ్చి, ఆయనవంటికికూడా కాస్తమందు పట్టించమని పురమాయించింది. ఆ యింటివాళ్లు వీళ్లిద్దరికీ చెయ్యగలిగినన్ని వుపచారాలు చేసి, యిక కాసేపు విశ్రాంతిగా ఆ గడ్డి పరుపులమీద పడుకోమని చెప్పి, వాళ్లుకూడా పోయి పడుకొన్నారు.

అలిసి సొలిసిన ప్రాణులవటంచేత, యిద్దరికీ వెంటనే కునుకుపట్టింది. అప్పుడు పడుకోవటం పడుకోవటం, తెల్లవారుఝామునకాని యిద్దరికీ మెళకువ రాలేదు. డాన్ క్విక్సెట్ కళ్ళు తెరిచి చూసేసరికి శాంకోపాంజా పక్కమీద కూర్చొని ఆవులిస్తున్నాడు. అవీ, యివీ కబుర్లు అనుకొన్నాక, డాన్ క్విక్సెట్‌కు ఒక ఆలోచన వచ్చింది. మామూలుగా వీరులకు ఏమైనా దెబ్బలు అవీ తగిలితే, వాళ్ళే ఏదో మూలికలు, పసరులు తయారుచేసుకొని, వాటితో అవన్నీ మాన్పుకొన్నట్లు డాన్ క్విక్సెట్ చదివిన పుస్తకాలలో చెప్పబడివున్నది. తనూ ఒక వీరుడే. తనకూ

యిప్పుడు గాయాలు తగిలాయి. వాటికి మందు వేసుకోవాలంటే వాళ్ళు వీళ్లు యిచ్చేమందులు పనికి రావని అతనికి తోచింది. అందుకని తానే ఒక దివ్యౌషధం కనిపెట్టాలనే బుద్ధిపుట్టింది. శాంకో పాంజాతో నెమ్మదిగా యీవిషయం చెప్పి, ఆ హోటల్ యజమాని వద్దకు పోయి యింత సారా, ఉప్పు, మంచి నూనె, దవనం మొక్కలూ వగైరా పట్టుకురమ్మన్నాడు.

యజమాని చెప్పిన ఏపనిఅయినా సరే, చెయ్యననేతత్వం శాంకోపాంజాలో అప్పటివరకు సుతరామూ లేదుగా! తన వళ్ళు ఎంత స్వాధీనంలో లేకపోయినా, వాడు వెంటనే ఆ హోటల్ యజమానివద్దకు పోయి, ఆయన చెప్పిన దినుసు లన్నీ పట్టుకువచ్చాడు. డాన్ క్విక్ సెట్ గారు ముక్కుతూ మూలుగుతూ అట్లాగే లేచి పక్కమీద కూర్చొని, వాడు తెచ్చిన దినుసులన్నీ పాళ్లు పాళ్లుగా చేసి, కలిపాడు. అలా తయారైన ఆ దివ్యౌషధాన్ని బాగా సోలెడైతే తను సేవించాడు. ఆ మందు ప్రభావం ఏమిటో మరి — కడుపులోకి ఆమందు అట్లా పోయిందోలేదో, యీయన యిట్లా నిద్రకుపడ్డాడు. ఆ పడుకోవటం పడుకోవటం, బాగా ఐదు, ఆరు గంటలసేపు గొడ్డునిద్రపోయాడు.

నిద్ర లేచేసరికి మాత్రం, మనిషి బాగా తేరుకొన్నాడు. ముఖం. అదీ మంచి కళగా కనిపించింది. ఎప్పుడైతే తాను తయారుచేసిన యీ దివ్యౌషధం

తన కింత బాగా పనిచేసిందని ఋజువు అయిందో, అప్పుడే, బాగా ఒకగాలను మందు తీసి, శాంకో పాంజానోట్లో కూడా పోసేశాడు. వాడుకూడా యీ మందు మంచిదేనన్న అభిప్రాయంలో వున్నాడేమో; 'కిం' అనకుండా అంతమందూ గుటకలో మింగేశాడు.

అదేం ఖర్మమో, ఏమో—ఆమందు వీడికి వికటించింది. మందు పుచ్చుకోకముందు వున్న కాస్త ఓపికా కూడా ఎక్కడికి పోయిందో—గంటలతరబడి మనిషి అసలు లేవలేకపోయాడు. తెగమూలుగుతూ పక్కమీదే పడివున్నాడు.

వాడు ఆ వరసను మూలుగుతూ వుంటే, డాన్ క్విక్సెట్ తన పక్కమీద లేచి కూర్చొని, వీరులు మాత్రమే సేవించవలసిన యీ 'దివ్య వీరౌషధాన్ని' యీబంటుగాడు సేవించినందువల్లనే యింత కొంప మునిగిందని తెగదెప్పటం మొదలుపెట్టాడు. అంతే కాదు—యికముందు ఎప్పుడైనా వీరులు సేవించే ఔషధాల వూసు ఎత్తితే నీ తల వెయ్యి ముక్కలుగా బద్దలై పోతుందని వీడిని భయపెట్టాడు.

శాంకో పాంజా లేవలేని స్థితిలో వున్నందువల్ల, డాన్ క్విక్సెట్ తానే పోయి 'రోజినాన్‌టే'కి జీనూ అదీ తగిలించాడు. ఆ చేత్తోనే తనబంటుతాలూకు వాహనం 'డాపుల్'ను కూడా సరిజేసి ప్రయాణానికి సిద్ధంగా అట్టేపెట్టేడు. ఆపశువుల పని చూస్తూవుండగా, ఆగొడ్ల చావడిలో తుప్పపట్టివున్న శూలం ఒకటి

యీయన కంటపడింది. మొన్న ఆ గాలమరలలో యిరుక్కొని విరిగిపోయినప్పటినుంచీ తనకు సరైన యీటె అమరనే లేదు. అందుకని కంటికి అగుపించిన యీ శూలాన్ని జాగ్రత్త చేశాడు.

ఈలోగా శాంకో పాంజా కొంచెం తేరుకొన్నాడు. గాడిద నెక్కే ఓపిక వచ్చింది. ప్రయాణానికి అన్నీ సిద్ధంగా వున్నాయి. మిగిలిన పని అల్లా ఆ హోటల్ యజమాని (—కాదు కాదు—కోట గవర్నరు)గారి వద్ద శెలవు తీసుకోవటమే. ఆపనికూడా పూర్తిచేసి పొద్దు వాటారకముందే పోవచ్చుకదా అని, డాన్ క్విక్ సెట్ తానే పెద్ద సంరంభంతో ఆహోటల్ యజమాని (కాదు కాదు — కోట గవర్నరుగారి) వద్దకు పోయి—

"ఖ్యాతి వహించిన మీ యీ కోటలో, మేము యీ రెండు దినములుగా మీవల్ల పొందిన పలు సత్కారములకు మే మాజన్మాంతము మీకు ఋణపడి యున్నాము. ఈక్షణము మొదలుకొని ఎవ్వడు కాని, ఎక్కడ కాని, ఎవడు కాని—దుండగీడు మిమ్మును అవమానించినచో—మాకు కాకిచే కబురంపుడు. శిష్టరక్షణము, దుష్టశిక్షణమే ప్రతిజ్ఞగాగల మేము ఎందున్ననూ, రెక్కలు గట్టుకొని యెగిరివచ్చి వాలి, మీపట్ల చెడుగా ప్రవర్తించిన ఆ పొగరుబోతుల గుండెలను చీల్చి చెండాడెదము." అని ధీరోదాత్తంగా వుపన్యసించాడు. ఈ వుపన్యాసంతో

ఆహోటల్ యజమాని (కాదు కాదు---కోటగవర్నరు) గారు సంతృప్తుడై తనను ఆశీర్వదించి పంపుతాడని ఆశించాడు.

కానీ ఆ హోటల్ యజమాని యీ పప్పులన్నీ తనదగ్గర వుడకవు పొమ్మన్నాడు. అంతగా తల తిరుగుతున్నవాడు ఎవడైనా తనను తూలనాడటమే సంభవిస్తే, యీ వీరుడికి కబురుచేసి యీాయనను వాడిమీాదికి వుసికొల్ప నక్కరలేకుండా నే వాడి కేవిధంగా సమాధానం చెప్పాలో తనకు తెలుసు లెమ్మన్నాడు.

తనకు యిల్లాంటి పోచికోలు కబుర్లతో పని లేదని చెప్పివేసి, యీ రెండు రోజులూ తనహోటల్లో పడి తెగమేసినందుకు, డబ్బు కక్కు, మరీ కదలమని హుంకరించాడు.

ఆయన అంత కరాఖండిగా డబ్బు కక్క మంటేనే కానీ, డాన్ క్విక్సెట్ గారికి యిది తానను కొన్నట్లు కోటకాదని తెలిసిరాలేదు. "ఏమేమిటీ; యిది కోటకాదా? [illegible] పదార్థములను విక్ర యించు భోజనశాలయా ! [illegible] నే ఇంత దనుక ఎరుగకయుంటి నే ! ఏమాశ్చర్యము ; ఏమా శ్చర్యము !! ప్చ్...ప్చ్...ప్చ్... జరిగిన పొరపాటున కిప్పుడు విచారించినమాత్రమున ప్రయోజన మేమున్నది. అయ్యా! ఓ భోజనవిక్రేతా! నే జెప్పెడి సావధానచిత్తుడవై ఆలకింపుము. నేను ఏరుల వద్ద

మునకు జెందినవాడను. ఇతఃపూర్వము సియుడైనవా డెవ్వడూ, ఆహార పానీయాదులకు డబ్బు చెల్లించి నట్లు నే జదివిన ఏ పుస్తకమునందును కానరాదు. అట్టిచో, నేను మాత్రము నీకు ఎట్లు చెల్లించగలను?" అంటూ కళ్లు పెద్దవి చేసి, చేతులు తిప్పుకొంటూ వీధి నాటకాల ధోరణిలో అభినయం మొదలు పెట్టాడు.

అంతటితో ఆ హోటల్ యజమానికి వళ్లు మండుకువచ్చింది. "ఇక నీ వాగుడు కట్టిపెట్టి, నాకు న్యాయంగా రావలసిన పైకాన్ని చెల్లించి, మరీ కదులు. నీ వీరులు, వీరసత్కారాలతో నాకు ఏమీ పనిలేదు. వాటినిగూర్చి తెలుసుకోవలసిన అవసరం కూడా నాకు లేదు. నాకు కావలసిందల్లా---డబ్బు!" అని గద్దించాడు.

వీరులవర్గంపట్ల యింత అవమానకరంగా ప్రవర్తిస్తున్న ఆ హోటల్ యజమానిమీద డాన్ క్విక్ సెట్ గారికి పరమ అసహ్యం వేసింది. "ఛీ! నీవింత మందబుద్ధి వేమి! నీ బ్రతుకు యింత హేయ మేమి?" అంటూ ఆయనపై ఛీత్కరించుకొని ఘనమైన నేలమీద వుమ్మివేసి, గుర్రం డొక్కలలో ఒక తాపు తన్నాడు. ఈసారి కూడా ఎందుకనో 'రోజినాన్ టీ' ఒక్కసారి అదలిస్తేచే పరుగు లంకించుకొంది. పది మార్లు దాన్ని బ్రతిమాలవలసిన అవసరం లేకుండా నే తన గుర్రం, అదిలించటమే ఆలస్యంగా పరుగు లంకించుకొంటే డాన్ క్విక్ సెట్ కు బలే హుషారు

పుట్టుకొచ్చింది. చేతిలోవున్న యీ బెత్తో చెడీ తిప్పు కొంటూ దూరంగా స్వారీచేశాడు.

వీడికి యిన్ని వుపచారాలు చేసి, ఒకటికి, రెండురోజులు కూర్చోపెట్టి మేపితే, చివరకు వీడు పైసాఅయినా యివ్వకపోగా, ముఖంమీద వుమ్మివేసి నంత పనిచేసి వుడాయించినందుకు హోటల్ యజమానికి వల్లమాలిన కోపంవచ్చేసింది. తప్పించుకు పోయినవాడు ఎల్లానూ పోయినాడు కదా అని, యింకా అక్కడే జోగుతూవున్న బంటు శాంకో పాంజాగాడి భరతం పట్టటానికి పూనుకొన్నాడు. వాడి రెక్కలు పెడవిరిచి పట్టుకొని, మాటా మంతీ లేకుండా ముందు వీపుమీద మోచేత్తోనూ, పిడికిలితోనూ కుమ్మినంత సేపు కుమ్మాడు.

ఆ హోటల్లో బసచేసివున్న మరి కొంత మంది కూడా యీ చప్పుళ్లు విని, సంగతేమిటో అని బిలబిలా బయటకు వచ్చారు. వెర్రి బాగులవాడి నొకడిని హోటల్ యజమాని పట్టుకు చితకపొడుస్తూవుంటే, వీళ్ళకూ వాడిపని పట్టాలని సరదా పుట్టింది. ఆ పదిమందీ పోగై, శాంకో పాంజా మీద కసితీరేదాక గుద్దుల వర్షం కురిపించారు. వాళ్ళ కాళ్లు నొప్పులుపుట్టేదాకా తన్నారు. అప్పటికీ సరదా తీరక, ఒక పెద్ద గొంగళి తెచ్చి, దాంట్లో వీణ్ణి వుండగా చుట్టి, కాస్సేపు ఫుట్ బాల్ ని తన్నినట్లు ఆకాశంలోకి ఎగురతన్నారు. గొంగళిచుట్టలోనుంచి, తాపు

తాపుకీ పీపు గోలపెట్టి అరుస్తుంటే వాళ్ళంతా పక పకా నవ్వులాటలు సాగించారు. పీపు ఎంత బిగ్గరగా గోల పెట్టితే, వాళ్ళ కంత యిదిగా వున్నది అల్లా ఎంతోసేపు వాడితో బంతిఆటలు ఆడి, చివరకు వాళ్ళకే విసుగుపుట్టాక, వాడి సంచిలోనుంచీ ఒక పెద్ద దుప్పటిని బయటకు తీసి, దాంతోనే పీణ్ణి ఒక పే ముద్దగా కట్టివేసి, ఆముద్దను తీసుకువచ్చి 'డాపుల్' మూపున కుదేశారు. అక్కడికీ సరదా తీరక, వాళ్ళల్లో ఒకడు ఆ గాడిద తోకకు సీనాకుడబ్బా ఒకటి కట్టి, గాడిదను ఒక్క తన్ను తన్నాడు.

ఆ గాడిద పెద్దగా ఓండ్రపెట్టుకుంటూ గంతులు వేసింది. గాడిద వేసిన ప్రతిగంతుకూ దానితోకకు కట్టిన డబ్బా కూడా నేలమీదనుంచీ ఎగిరెగిరిపడుతూ పెద్దగా చప్పుడు చేస్తుంటే, ఆ చప్పుడుకు హడలిపోయి, యీ గాడిద యింకా బిగ్గరగా ఓండ్రపెట్టుతూ యింకా ఎక్కువ ఎత్తు ఎగురుతూ పోయింది. గాడిద వేసే ప్రతి గంతుకీ, వుండగా చుట్టబడ్డ శాంకోపాంజా ఎగిరెగిరిపడ్డాడు.

అలా ఎంతసేపు ఆ గాడిద చప్పుకొంటూ, తన్నుకొంటూ పరిగెత్తిందోకాని, కొంతదూరం పోయాక గాడిదతోకకు కట్టిన సీనాకుడబ్బా ఎక్కడోవూడి పడిపోయింది. ఆ చప్పుడు ఆగిపోయాక అరగంటకు గాడిదప్రాణం కుదటపడ్డది. గాడిద

గంతులు మానివేసిన గంటకు శాంకోపాంజా ఎగిరెగిరిపడటం మానేశాడు.

డాన్ క్విక్ సెట్ ఎప్పుడో హోటల్ లో నుంచి తప్పించుకు బయటపడినా, శాంకోపాంజాను ఏమి ముప్పు వస్తుందోనన్న భయంకొద్దీ, ఆ చుట్టుపట్లనే తారట్లాడాడు. ఈలోగా ఆ హోటల్ లో వాళ్లు శాంకోపాంజాను దేహశుద్ధి చేసి, గాడిద మీదకు దేసి, బయటకు తోలటం, ఆ గాడిద వాకే దొంకా చూసుకోకుండా తెగ గెంతుతూ అడ్డదిడ్డంగా పరిగెత్తటం, యిదంతా చూస్తూనే వున్నాడు. ఆ గాడిదను ఎలాగైనా పట్టుకొని, శాంకోపాంజాగాడి చెప్పులైనా యింత మూసి ప్రాణాలు కాపాడుదామంటే, ఆ గాడిద ఎందునా అందకుండా పరుగులెత్తింది. ఆ సీనాకేకు డబ్బా వూడిపోయి గాడిద కొంచెం తేరుకొన్నాక కాని, డాన్ క్విక్ సెట్ గారు గుర్రం యెక్కికూడా దాన్ని కలుసుకోలేకపోయాడు.

శాంకోపాంజాను గాజుసీసాను దించినంత భద్రంగా గాడిద వీపుమీదనుంచీ దించి, వాడిచుట్టూ చుట్టబడివున్న బట్టల దట్టింపునంతా ఒలిచి, వాడికి యిన్ని మంచినీళ్లు పట్టి గొంతు అదీ సవరించి, సంగతేమిటని ప్రశ్నించాడు. వాడు తనకు జరిగిన శృంగభంగమంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అనుకోకుండా ఆ హోటల్ ను విడిచివచ్చి వెయ్యటంలో, చిల్లరా మల్లరా దాచి వుంచుకొన్న సంచికాస్తా

అక్కడే వుండిపోయిందన్న వార్త చల్లగా బయట పెట్టాడు.

శాంకోపాంజా, డాన్ క్విక్ సెట్ యిద్దరూ. అలా ఒకరికొకరు ఎదురు బొదురుగా చెట్లకు జేరగిల బడి కూర్చుని, వంతుల ప్రకారం వేడి నిట్టూర్పులు విడిచారు.

## 7

శాంకోపాంజా, యజమాని పోయిన వైపుకే, తన గాడిదను కూడా పోనిస్తున్నాడన్న మాటే కాని, వాడి మనస్సు మాత్రం ఏమీ బాగా లేదు. ఆ హోటల్‌లో అన్ని తన్నులు తిన్నందుకు వాడికి తల తీసేసినంత అవమానంగా వుంది. తన జీవితం యింత నవ్వులపాలు అయిపోయినందుకు, వాడికి ఎందులో నైనా పడి చద్దామా అని కూడా అనిపించింది.

డాన్ క్విక్ సెట్ గారు యిది గమనించారు. నమ్మినబంటు యిలా ముఖం కేలవేసుకు వుంటే ఆయనకు మాత్రం ఏమంత బాగుంటుంది? విజ్ఞాన్ త్త మాటలతో హుషారు చేస్తే నైనా మనిషి తేరు కుంటాడేమో నన్న ఆశకొద్దీ, తన ధోరణి మొదలు పెట్టాడు.

"శాంకో! ఇందసత్యము కాని, అతిశయోక్తి కాని యిసుమంతయు లేదు. ఇదంతయు మాంత్రికుల ప్రభావమే. మన మిప్పుడు వదలివచ్చిన ఆ కోటయున్న దే—

దానిని ఎవరో మాంత్రికులు తమ వశమొనర్చుకొని యున్నారు. నీవట్లు అమానుషముగా ప్రవర్తించిన వారు మనుష్యులు కారు; అవి ఏ మాంత్రికుడో ప్రేరణ చేసి మనపైకి పంపిన భూత ప్రేతములు. అవియే నిన్ను హింసించినవి. అది యట్లుండనిమ్ము! ఆ భూతముల వాతబడి నీ వారీతిని హింసింపబడుచుండ, నే నెంత ప్రయత్నించిననూ నీకు సహాయ మొనరింపలేకపోయితి ననిన, అదియును మంత్రప్రభావమే గదా! ఆ మాంత్రికులు నాపైగూడ మంత్రములను ప్రయోగించి, నన్ను అచ్చటినుండి కదల నశక్తునిగా ఒనరించిరి. ఆ మాంత్రికులెవరో, ఆ మంత్రప్రభావ మెట్టిదో కానీ, నిన్ను హింసించినవారి గుండియలు చీల్చవలెనని నా మనస్సు ఎంత వేగిరపడిననూ, నా అవయవములు స్వాధీనములో లేకుండా పోయినవి కదా! ఏమి చెప్పను శాంకో! నే నారీతిని మంత్రప్రభావమునకు లోబడి మిన్నకుండవలసివచ్చినది కాని, లేక పోయినచో, నిన్ను హింసింప సాహసించిన ఆ ముష్కరులకు, మరి పది జన్మములవరకూ నీజోలికి రాకుండు నట్లు బుద్ధి చెప్పియుండువాడను. వీరాభిషేకము చేయించుకొనని అల్పమానవులను నేను నా చేతితో తాకరాదను నియమ మున్నప్పటికినీ, నీకై, ఆ నియమమును పాటించక, ఆ దుండగీండ్రను కడతేర్చి యుందును కదా!"

ఈమాట అనేసరికి శాంకో పాంజాకు పట్టరాని

కోపంవచ్చింది. "వీరుడు అయ్యేదీ, కాకపోయేదీ,— నావొంట్లో ఏమాత్రపు ఓపిక వున్నా, నేనే వాళ్లపని పట్టివుండేవాణ్ణి." అన్నాడు—కాస్త విసురుగా "మీరేమో వాళ్లు మనుష్యులు కారని, దెయ్యాలూ భూతాలూ అనీ అంటున్నారు కాని నాకంటికి, నా వంటికీ వాళ్లూ మనలాంటి మనుష్యులే ననిపించింది. నన్నావరసను వాళ్లుచావబాదుతూవుంటే, మీరు నాదగ్గర కైనా రాలేకపోయారంటె అందుకు కారణం మంత్ర శక్తిమాత్రం అయివుండదు. ఆచాయల్లో ఎక్కడా మీరు లేకుండా పోవటానికి యింకేదైనా నమ్మదగిన కారణం మీరు కనిపెట్టగలిగివుంటే బాగుండేది. నాకు అసలు యిదిఅంతా చూస్తూంటే—మనకీలాంటి దురవస్థలు యింకా ఎన్నో రాసిపెట్టివున్నా యనిపిస్తున్నది. మనకీ దుష్టశిక్షణాలూ వద్దు; శిష్టరక్షణమూ వద్దు;- వచ్చినదారినే మనపల్లెకు పోయి, యింటిపట్టున వుండిపోతేనే బాగుంటుంది." అన్నాడు దీనంగా.

ఈ మాటలు వినేసరికి డాన్ క్విక్సెట్‌గారి బుర్ర గిరగిరా తిరిగింది.

"ఈ శకునపక్షి నాకెక్కడ దాపురించాడురా" అని లోలోపలే మండిపడ్డాడు. అయినా వీరుడుగా చలామణి అవుతూ, యింతదూరము వచ్చాక, వీడి మాటలకు లెక్కచేసి, వెన్నుచూపితే ఎంత నగుబాటో మనస్సులోనే వూహించుకొన్నాడు. ఇంతటితో తెగ

తెంపులు చేసుకొని వీణ్ణి వెళ్ళిపొమ్మందామా అంటే, మళ్లీ తనకు బంటు ఎవడు దొరుకుతాడు ? వీడు రావటానికే అంత యమయాతన పడ్డాడు కదా ! అధైర్యపడటం వీరుడి లక్షణంకాదని మరొకసారి జ్ఞాపకం తెచ్చుకొని గొంతు సవరించుకొని——

"ప్రియమైన నా శాంకో ! నీ అజ్ఞానమును చూచినకొలది నాకు మతిపోవుచున్నది. వీరుడుగా వ్యవహరించట మనునది, కొన్ని ప్రమాదములతో కూడుకొనిన పని అని ఎరుగవా ? ఒక్కొక్క సమయమున వీరుడైనవాడు ప్రత్యర్థిసమూహముల నడుమ చిక్కుకొని నానా యాతనలు పడవలసివచ్చును. అట్లని వీరుడుగా వ్యవహరించబోవుటయే మానవలెనా, ఇందు నేరమేమున్నది? మాటలు వేయునేల... అచిరకాలమునందే మన మాచరింపబోవు కార్యములు ఎంత మహత్తరములైనవో నీవే గ్రహింపగలవు. ధైర్యమును కోల్పోయి పిరికిపంద వనిపించుకొనక ఓపిక పట్టియుండుము."

ఇంకా ఏమిచెపితే వీడికి బాగా నచ్చుతుందా అని ఆలోచిస్తూ, దిక్కులు చూడటం మొదలు పెట్టాడు. అల్లంత దూరాన రోడ్డుమీద దుమ్ము ఆకాశమంత ఎత్తున లేచి, కదులుతున్న మేఘంలా యాయన కంటికి కనిపించింది. కదులుతున్న మేఘం కంట పడేసరికి, ఆతని నరాలలో నెత్తురు వేడెక్కింది. నుదుటికి అడ్డంగా కుడిచేయి పెట్టుకొని, గుడ్లు పెద్దవిచేసి

ఆదిక్కే పరీక్షగా చూశాడు. ఆ మేఘం తమవైపే వస్తున్నట్లు తోచింది. ఇందులో ఏదో పెద్ద రహస్యం వుండితీరాలనుకొన్నాడు శాంకో పాంజాను పేరు పెట్టి పిలిచి:

"యుద్ధోన్ముఖమైన గొప్ప సేనాసమూహమేదో యీదిశకే వచ్చుచున్నది; కాంచితివా శాంకో? వారి హయముల పాదఘట్టనములచే ధూళి ఎంత దట్టముగా పైకెగసినదో పరికించితివా?" అని హెచ్చరించాడు.

ఇంతసేపూ వీరులు సలిపే యుద్ధాలు ఎంత భీకరాలో వివరిస్తూవున్నాడుకదా! ఇంతలోనే యింతపెద్ద దండు యీ వైపుకే వస్తూవున్నందువల్ల, తానింత వరకూ చెప్పినవిషయం ఋజువుచేసే అవకాశంకూడా లభించినందుకు డాన్ క్విక్ సెట్ లోలోపలే చాలా సంతోషించాడు.

శాంకోపాంజా కూడా అంత పరీక్షగానూ, ఆవైపే చూశాడు. అంతటితో ఆగక, యింకోవైపుకు కూడా తిరిగిచూశాడు. అటువైపునకూడా యిలాగే దుమ్ము, పెద్ద మేఘంలా ఆకాశం ఎత్తున ఎగురుతూ వుండటం యితని కంటపడింది.

"మీరు చెప్పేదే నిజమయితే, మనవైపుకు వస్తున్న సైన్యసమూహం ఒకటికాదు; యిటువైపు నుంచీకూడా మరొకదండు వస్తున్నట్లున్నది." అంటూ తనకుతోచిన అధైర్యాన్ని బయటపెట్టాడు.

"ఆఁ ! అటులనా !! అంటూ డాన్ క్విక్ సెట్, శాంకో పాంజా చూపెట్టినవైపుకు తిరిగి పరీక్షగా చూశాడు. శాంకో పాంజాకైతే వణుకు పుట్టుకు వస్తున్నది కానీ, ఈయనకుమాత్రం యింత త్వరలో నే తన ప్రతాపం కనపరిచే అవకాశం వస్తున్నదికదా అని పించి ఎగిరి గంతులు వెయ్యాలన్నంత సంబరంవేసింది.

ఈ రెండుసైన్యాలూ ఢీకొంటాయనీ, ఆ సంరంభంలో ఎందరో పేరుప్రఖ్యాతులున్న యోధానుయోధులు తనకళ్ళ ఎదుటనే హతమారిపోవటం తప్పదనీ ముందుగానే వూహించుకొన్నాడు

ఈయన యీవరసను రకరకాలుగా వూహాలు అల్లుకొంటూ పరవశుడై పోతుంటే, అవతల శాంకో పాంజాకు పట్టుకున్న గుండెబెదురు అంతకంతకు ఎక్కువకాసాగింది. "స్వామీ! స్వామీ! ఆ మేఘూలు యిటే వస్తున్నాయి. అంతకంతకూ మనకు దగ్గరగా కూడా వస్తున్నాయి. ఇప్పుడు ఎలాగు ? మనం ఏం చెయ్యాలి? అంటూ వెర్రిముఖం పెట్టేశాడు.

డాన్ క్విక్ సెట్ మందహాసంచేస్తూ— "ఏమి చేయువలె నందువేమి? ఆరెండు సైన్యములలో ఏ సైన్యము బలహీనముగా నుండునో, వారిపక్షమున చేరి మనమునూ పోరాడవలసివున్నది," అన్నాడు. అప్పటికప్పుడే ఆయనకు ఏహోచితమైన వుద్రేకం వచ్చేసింది. ఆ వుద్రేకంలో ఏమిటేమిటో మాట్లాడుతూ, ఇప్పుడు జరుగబోయే యుద్ధంలో ఫలానిఫలాని యోధుడు

పోరాడబోతున్నాడనీ, వాళ్ళలో ఫలానిఫలానివాళ్ళు మృత్యువాత పడబోతున్నారనీ ఒకగుక్కలో చెప్పేశాడు.

అంతూపొంతూ లేకుండా ఆయన ఏమిటో ఆ వరసను చెప్పుకుపోతుంటే, శాంకోపాంజా—కళ్ళకు మళ్లే--నోరు తెరుచుకు చూస్తున్నాడు. డాన్‌క్విక్‌సెట్ గారి కేరింతాలన్నీ పూర్తిఅయ్యాక, కొంతసేపటికి తేరుకొని "అయితే స్వామీ! మీరింతసేపూ చెప్పిన ఆ యోధులుకానీ, ఆ రాక్షసులుకానీ యీ సైన్యంలో వున్నట్లు నాకు తోచటంలేదే" అని శాంకోపాంజా అన్నాడు.

"ఏమేమీ! యోధులు, రాక్షసులు ఎవ్వరూనూ కనిపించుటలేదా ? అశ్వఘోషము, రణభేరీనినాదములు వినవచ్చుటలేదా ?" డాన్ క్విక్‌సెట్ గుచ్చి గుచ్చి అడిగాడు.

"ఏమోనండీ, మీరు చెప్పేవి నాకేమీ వినిపించటంలేదు. ఏవో కొన్ని గొర్రెలఅరుపులుమాత్రం వినిపిస్తున్నాయి. అంతే." నిజంగానే యింకేమైనా ధ్వనులు వినిపిస్తున్నాయేమోనని శాంకోపాంజా మళ్ళీ అతి శ్రద్ధగా విన్నాడు. గొర్రెల అరుపులకు మించి వేరే ఏధ్వనీ అతని చెవులబడలేదు. నిజంకూడా అంతే! గొర్రెల అరుపులకుమించి మరి ఏ రణగొణధ్వనీ వినిపించటంలేదు. ఇటువైపునుంచీ కొన్ని, అటువైపునుంచీ కొన్ని గొర్రెలమందలు ఆ మైదానంమీదకు

వస్తున్నాయి. ఈ మందల ముందూ, వెనుక గొఱ్ఱెల కాపర్లు నడుస్తున్నారు. ఇన్ని గొఱ్ఱెలూ కదులుతుంటే'



దుమ్ము దట్టంగా లేచి, డాన్ క్విక్ సెట్ కంటికి కదులు తున్న మేఘంలా కనిపించింది.

ఆ మేఘం దగ్గరకు వస్తున్నకొద్దీ, అందులో నుంచీ గొఱ్ఱెల ఆకారాలూ అవీ అంతకంతకు సుస్పష్టంగా కనిపిస్తూనేవున్నాయి. అయినా సరే— డాన్ క్విక్ సెట్ తన కంటికి కనిపిస్తున్న గొఱ్ఱెలమందను గొఱ్ఱెలమందని ఒప్పుకోక అదేదో పెద్ద సైన్యసమూహమే లెమ్మనాడు. 'అది గొఱ్ఱెలమంద బాబోయ్' అంటూ శాంకోపాంజా ఎంతగా చెవినియిల్లుకట్టుకు పోరి చెప్పుతున్నా, డాన్ క్విక్ సెట్ ఆమాటలేమీ వినిపించుకోకపోగా, "నీవంటి పిరికిపంద యీ ముయ్యేడు జగంబులందు మరెచ్చటనూ లేదు. భయవిహ్వలతకు లోనైవున్న నీ కంటికి సైన్యసమూహములు సైన్య సమూహములుగా కాక, గొఱ్ఱెలమందలవలె కన్పట్టుటలో అబ్బురమేమున్నది! ఆవలకు బోయి నిలువుము. నే సలుపనున్న యీ యుద్ధక్రీడయందు నీ సాయము నా కిసుమంతయు అక్కర లేదు. నీ విచ్చటనే యుండి నే నొంటరిగా సలుపబోవు సమరక్రీడా వినోదముల కన్నులారగాంచి నీ జన్మమును తరింపచేసుకొనుము." అన్నాడు. ఆ వాక్యం ముగించీ ముగించకముందే డాన్ క్విక్ సెట్ తన గుర్రాన్ని అదిలించటమూ, అది గంతులు వేస్తూ ముందుకు పరుగెత్తటమూ జరిగిపోయింది.

శాంకోపాంజా యిప్పటివరకూ పొందిన అనుభవాలమూలంగా, యిప్పుడు జరుగబోయేది

కూడా ఏతీరున వుంటుందో ముందుగానే తెలుసుకోగలిగాడు. అందుకని—దూరంగా పోతున్న తన యజమానిని బిగ్గరగా పిలిచి "మీ కాళ్లు పట్టుకు వేడుకొంటాను క్షణంసేపు నిలవండి. అవి సైన్యాలు కావండీ బాబూ! గొఱ్ఱెలు, గొఱ్ఱెపిల్లలు తప్ప వేరే ఏవీ యిటువేపు రావటం లేదండి" అని నెత్తిన నోరు పెట్టుకు అరిచాడు. ఆయన ఆమాట వినిపించుకొంటేనా!

డాన్ క్విక్ సెట్ ఎకాయెకినిపోయి, ఆ గొఱ్ఱెల మంద నట్టనడుమ తన గుర్రాన్ని ఆపాడు. ఇలా విసురుగా యీ గుర్రం మందలోకి వచ్చి పడేటప్పటికి ఎక్కడి గొఱ్ఱెలు అక్కడ చీలిపోయి, అన్నీ తలాఒక దిక్కు దౌడుతీశాయి. మందను యీ విధంగా చెల్లాచెదరు చేసిపారేసినందుకు ఆగొఱ్ఱెల కాపరులకు యీ వీరుడిమీద మాంచి కోపం వచ్చింది. వాళ్ళకు వచ్చిన తిట్లన్నీ ఆయనమీద ప్రయోగిస్తూ, రాళ్లు పుచ్చుకు వెంటపడ్డారు. ఆయనమీద రాళ్లవర్షం జోరుగా కురిసింది. ఆ దెబ్బలకు ఆగలేక డాన్ క్విక్ సెట్ గారు గుర్రంమీదినుంచీ కిందికి దొర్లిపోయారు. అలా కొంతసేపు గడిచాక పారిపోతున్న గుర్రంవీపుమీద మనిషి లేకపోవటం గొల్లవాళ్లు గమనించారు. డాన్ క్విక్ సెట్ గారు చచ్చిపోయాడేమోనని వాళ్లకు ఒక్కమారుగా భయంవేసింది. అందరూ గుట్టు చప్పుడు

కాకుండా, మందను మళ్లేసుకొని ఆ చుట్టుప్రక్కల ఎక్కడా కనిపించకుండా పోయారు.

దూరంనుంచీ యిదంతా చూస్తున్న శాంకో పాంజా రొప్పుకొంటూ రోజుకొంటూ తన యజమాని దగ్గరకు పరుగెత్తుకు వచ్చాడు.

"శాంకో! నాపై పగబూనిన ఆ మాంత్రికు డెవడో మహాఘటికునివలె నున్నాడు. అతను ఎంతటి ప్రతిభావంతుడు కాకయున్న, ఆ సైన్య సమూహములను తృటిలో గొఱ్ఱెలమందగా మార్చి వేయుగలడు!" అంటూ డాన్ క్విక్ సెట్ గారు తనకు తోచిన అనుమానాన్ని వెళ్ళబెట్టాడు. శాంకోపాంజా ఏదో చెప్పబోయాడు. డాన్ క్విక్ సెట్ వాణ్ణి మాట్లాడనీయకుండా మళ్లా తనధోరణి అందుకొని "నీ కింకనూ సందియమున్నచో, ఆ గొఱ్ఱెల మందలను వొకింత దవ్వు అనుసరించిపొమ్ము. అవే గొఱ్ఱెల మందలు అంతలో సైన్యసమూహముగా మారితీర డివి. అందు సందియము లేదు...అది అట్లుండనిమ్ము! నీవొకసారి నాదగ్గరకు వచ్చి, నా నోటియందు యింకనూ ఎన్నిపళ్లు మిగిలివున్నవో లెక్కించి చెప్పుము. నాకు మాత్రం, ఒక్క పన్ను అయిననూ మిగుల లేదనియే తోచుచున్నది." అన్నాడు.

తానంత చెప్పినా వినిపించుకోకుండా దుడ దుడా పరిగెత్తినందుకు యీాయనకు పళ్లు వూడి తగిన

శాస్త్రి అయిందని శాంకో పాంజా సంతోషించాడు. 'యజమాని తన పళ్ళవిషయం కొంచెం చూసిపెట్టమని అంత గోల పెడుతున్నా, వీడు అదేమీ వినిపించుకోకుండా, తన గాడిద 'డాపుల్' వీపు నానుకు నిల్చొని, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. వీడి వాలకం చూసి, తనకు దెబ్బలు తగిలినందుకు వాడు కుమిలిపోతున్నట్లున్నాడు గాబోలు ననుకొన్నాడు, డాన్ క్విక్ సెట్. "ప్రియమైన శాంకో! నాపాటుకు నీవు వగజెందెడ వేలనోయ్?" అన్నాడు; ఎంతో వుదారంగా.

శాంకో పాంజా మాత్రం యింకా దెప్పిపొడిచే ధోరణి మానలేదు. "అవును; మీరు పడ్డ పాట్లతో నాకేమి పనివుందిలేండి! దగ్గిర వున్న డబ్బుసంచి పోగొట్టుకొన్నా, ఆ వరసను ఆ హోటల్లో వాళ్లు గొంగళిలో చుట్టబెట్టి బంతిని తన్నినట్లు తన్నినా, ఆ పాట్లన్నీ పడ్డది నేనేకానీ, మరెవ్వరూ కాదే!" అన్నాడు.

"ఏమేమీ! డబ్బుసంచి కూడా పోయిందా? మనకిక తిండి దొరకదా?" అంటూ డాన్ క్విక్ సెట్ విస్తుపోయాడు.

"తిండిమాట కేమి లెండి. ఈ పొలాల్లోనే ఏవో కందమూలాలు దొరకకపోతాయా! మీలాంటి వీరులు వాటినే పీక్కు తింటారుగా" అన్నాడు శాంకో పాంజా వెక్కిరింపుగా.

"వీరులు కందమూలములు భక్షింతురని నేను నుడివినమాట సత్యమే. ప్రస్తుతము నా కా కంద మూలములకంటె రొట్టెముక్కలు తినవలయు ననియే అనిపించుచున్నది. కనీసము వుప్పులో వూర బెట్టిన చేపలు దొరికిననూ చాలును. కనుక, ఓ శాంకో, మన మెట్లయిననూ యీ నిర్జనస్థలమును వీడి, ఎంతైన బోవుదము. తినుటకు ఏదైనలభించవచ్చును." అన్నాడు.

## 8

శాంకో పాంజాకు, డన్ క్విక్ సెట్ కు — యిద్దరికీ కరకర ఆకలి వేస్తున్నది. ఏవో తినటానికి వున్నాయి కదా అనుకొంటే, అవి వున్న గోనె కాస్తా పోయింది; పోనీ డబ్బైనా వుంటే ఎక్కడో ఒకచోట, ఏదైనా ఒకటి కొనుక్కొని తినేవాళ్ళేమో కానీ, ఆ డబ్బుల సంచీకి అంతకుముందే వుద్వాసన అయిందాయెను. ఇంకేం చేస్తారు? ఇద్దరూ ముఖాలు వేలవేసి ఎట్లాగో ప్రయాణం చేస్తున్నారు. ఎక్కడైనా ఒక ఆశ్రయం దొరక్క పోతుందా అనే ఆశతో యిద్దరూ ఆకలికి కడ గొట్టుకు పోతున్న ప్రాణాలను ఎగిరిపోకుండా పట్టుకు వుంచుకోగలిగారు.

అట్లా ఎంతో దూరం ప్రయాణంచేశారు. ఎంత దూరం ప్రయాణంచేసినా వీళ్లకు పని కల్పించే వాడు ఒక్కడూ కనిపించలేదు. అసలు ఆ చుట్టు

పట్ల ఎక్కడా మనుష్యసంచారమైనా వున్నట్లు తోచలేదు. ఇక యిప్పటిలో తినటానికి ఏదీ దొరకదు కాబోలని యిద్దరికీ అధైర్యం తోచింది. ఇద్దరికీ శోష వచ్చేస్తున్నట్లే అనిపించింది. ఒక్కడూ నోరు తెరిచి మాట్లాడలేకుండా వున్నాడు. ఆ గుర్రము, గాడిద మాత్రం వాటి మానాన అవి, జోగుతూ పోతూనే వున్నాయి. అలా పోగాపోగా, కొంతసేపటికి చీకటి కూడా పడిపోయింది. ఇంకా కొంతసేపు ప్రయాణం చేశాక దూరంగా చీకటితెరలలో కదులుతున్న దీపాలు కొన్ని వీళ్ల కంటపడ్డాయి.

ఒంట్లో ఎంత ఓపిక లేకపోయినా, సాహస కార్యంపేరు చెప్పేసరికి డాన్ క్విక్ సెట్ గారికి వళ్లూపై తెలియదాయె! ఇంకేం—ఆ దీపాలు కదులుతున్న వైపుకు గుర్రాన్ని పోనిచ్చాడు. గబగబాపోయి, ఆ వూరేగింపు నట్టనడాన గుర్రాన్ని నిలిపేసి, వూరేగింపులో వున్నవాళ్ళందరిని వురిమిచూసి, ఒకొక్కడూ యిలా తనముందుకు వచ్చి నిల్చొని తన పేరేమిటో, ఏపనిమీద పోతున్నాడో అదంతా తనకు నివేదించుకోవాలని హుంకరించాడు.

ఇంతకీ ఆ వూరేగింపు ఏమిటో తెలుసా! ఎవరో ఒకాయన చచ్చిపోతే, ఆయన తాలూకు శవానికి అంత్యక్రియలు జరిపేటందుకు కొందరు మతబోధకులు, మరి కొంతమందీ, దీపాలు పెట్టుకొని పెద్ద వూరేగింపుగా నడిచిపోతున్నారు. ఎవరైనా చచ్చిపోతే,

డబ్బు పుచ్చుకు గంటలతరబడి ఏడ్చేకూలీలు కొందరుంటారు. ఇలాటి కూలీలు కూడా ఒక పదిమందిదాకా యీ వూరేగింపులో వున్నారు.

ఈ వూరేగింపు చావుకు సంబంధించినది కావటంచేతా, అందులోనూ అప్పటికే బాగా చీకటి పడిపోయివున్నందువల్లా, వీళ్లందరి మనసులూ అసలే బిక్కు బిక్కు మంటున్నాయి. వాళ్లాస్థితిలో ప్రాణాలు వుగ్గబెట్టుకువుంటే, డాన్ క్విక్‌సెట్‌గారు యిలా అర్ధాంతరంగా ఎక్కడినుంచో వూడిపడి, దిక్కులు పిక్కటిల్లేలా అరుపులు అరిచేసరికి వాళ్లకు నవనాడులూ క్రుంగిపోయాయి. ఈయనగారి ఆకారం అదీ చూసి, ఏదో దిష్టిబొమ్మకు ప్రాణంవచ్చి యిలా కవచం, టోపీ తగిలించుకుని, యీశెవు పుచ్చుకు తమపై కేమన్నా వచ్చిందేమో నని వాళ్లు అనుమానించారు. ఈ వీరుడి వెనకాల యింకా ఎన్ని యిలాటి ఆకారాలు వస్తున్నాయోననే అనుమానం వాళ్ల మనస్సుల్లో ఒక్కసారిగా మెదిలింది. ఇక అంతే—ఒకళ్ల కాళ్లకి యింకోళ్లు అడ్డం పడుతూ, అందరూ తలాఒక దిక్కు పరుగెత్తారు. ఈ త్రొక్కులాటతో ఆచోటు చోటంతా చితచితలాడిపోయింది. ఎవళ్ళదారి వాళ్లు చూసుకోవటంలో, తిరుబండారాలు మోసుకు వస్తున్న ఒక గాడిదవిషయం ఎవరూ పట్టించుకోనే లేదు. ఆ గాడిద అంత బరువుతోనూ కదలలేక అక్కడే నిలుచుండిపోయింది. ఇది ముందుగా శాంకో

పాంజాగాడి కంటబడింది. క్షణమైనా ఆలస్యం చేయకుండా వాడు గబగబా పరిగెత్తుకొంటూ వచ్చి, ఆ గాడిదమీద వున్న మూటలన్నీ దించేసి, అందులోని సరుకు అంతా తన పైగుడ్డలో మూటలు కట్టేశాడు.

ఎట్లాగైతే నేం—తినటానికి యింత తిండి దొరికింది. శాంకో పాంజాకు ఎక్కడలేని సరదా పుట్టుకొచ్చింది. అంత పెద్ద వూరేగింపు వుంటే, అందులో ఒక్కడైనా నిలిచివుండకుండా అందరూ డాన్ క్విక్ సెట్ గారి అదిలింపుకే ఝడిసిపోయి, పిక్కబలం చూపించేశారు. ఇంత అవలీలగా వాళ్లందరినీ బెదరగొట్టినందుకు తన యజమానిని కాస్త పొగుడుదామని వాడికి అనిపించింది. ఆ సంతోషంలో వాడు అతనను ఒక పేరుపెట్టి పిలిచాడు. డాన్ క్విక్ సెట్ గారు ఆ పేరుకు ఎంతో మురిసిపోయి, ఆక్షణంనుంచీ తాను ఆ పేరుతోనే వ్యవహరించబడుతానని ప్రతిజ్ఞపట్టాడు. ఇంతకీ వాడు పెట్టిన పేరేమిటో తెలుసా? ఆ వూరేగింపులోనివాళ్లు ఒక్కళ్లైనా మిగలకుండా అందరూ తలా ఒక దిక్కుగా పారిపోతుంటే, వాళ్లకు వినిపించేలా "ఓ పిరికిపందలారా! మీరా కీనాడు బుద్ధిచెప్పిన వీరశిఖామణి పేరేమిటని ఎవరైనా అడిగితే ప్రపంచఖ్యాతిగాంచిన 'భీకరానన వీర శూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ గారని చెప్పకు బ్రతకండి" అంటూ శాంకో పాంజాగాడు బిగ్గరగా అరిచాడు.

తనను 'భీకరాననుడని' శాంకోపాంజా అంటూవుంటే, డాన్ క్విక్‌సెట్‌గారికి చప్పట్లుచరుస్తూ, గంతులు వెయ్యాలన్నంత సంతోషం వేసింది. శాంకోపాంజాగాడి వీపుమీద పెద్దగా చరిచి "నా ముద్దుల శాంకో! నాకు 'భీకరానన వీరాశూరాగ్రేసరు'డను యీ బిరుద మీయవలెనని నీకు ఎట్లు తోచినదో, ఆ తెరగంతయు వినిపింపుము," అంటూ అమందానంద కందళిత హృదయారవిందుండై, అడిగాడు.

"ఆలైట్ల వెలుగులో చూస్తుంటే మీ ముఖం భయంకరంగా వున్నట్లు నాకే తోచింది. అలా ఎందుకు తోచిందో ఆ కారణాలు మాత్రం నేనూహించలేను. బహుశః మీనోట్లో ఒక పన్ను అయినా మిగలకుండా వూడిపోయివుండటమే కావచ్చు; లేదా యీ వీర విహారాలతో మీ ప్రాణం అలిసి సొలిసివున్నందు వల్ల కూడా కావచ్చు. మొత్తానికి ఆ దీపాల వెలుతురులో మీముఖం చూస్తుంటే, నాకెందుకో భయంకరంగా కనుపించింది" అని శాంకోపాంజా గుడ్లు తిప్పుకొంటూ చెప్పుకొన్నాడు.

ఇంతలో డాన్ క్విక్‌సెట్‌గారు వాడి ధోరణికి అడ్డంవచ్చి "నిలు, నిలుమా శాంకో! నా నెమ్మోము భయంకరముగా తోచుటకు కారణము నీవూహించిన దేదియును కాదు. వెనుకటి వీరులలో ప్రతి ఒక్కరికిని యివే మాదిరి బిరుదములుండెడివి. వీరాభిషిక్తుడనై

యున్న నాపై, ఎవరో ఋషిపుంగవుడు కనికరించి, తన యంశమును నీలో ప్రవేశపెట్టి, నాకీ బిరుదమును ప్రసాదించినాడు. ఇందులకు సందియము లేదు. ఇకపై 'భీకరానన వీరశూరాగ్రేసర డాన్ క్విక్‌సెట్'గా రనియే పిలిపించుకొందును" అన్నాడు.

తిండి దొరికినందుకు శాంకో పాంజాకు, బిరుదు దొరికినందుకు డాన్ క్విక్‌సెట్ గారికి, వళ్లు పరవశమైపోయింది. ఇద్దరూ ఏవేవో తీయ తీయని కబుర్లు చెప్పుకొంటూ అలాగే ప్రయాణాలు కొనసాగించారు.

అలా పోగాపోగా, విశాలమైన మైదానంలో తేలారు. అప్పటికి ఎంతో సేపటినుంచి ఎడవకుండా ప్రయాణం చేస్తున్నారేమో యిద్దరికీ కాసేపు విశ్రాంతి తీసుకొందామనిపించింది. 'రోజినాన్‌టీ'ని, 'డాపుల్'ను యథేచ్ఛగా వదిలేసి యిద్దరూ పచ్చ గడ్డిమీద కూలబడ్డారు. శాంకోపాంజాగాడు సంగ్రహించిన బాపతు తినుబండారాల మూట, గాడిద వీపుమీదనుంచీ దించి, యిద్దరూ తిండికి ఎగబడ్డారు. ఒకళ్ల కొకళ్లు ఎదురు బొదురుగా కాళ్లు బారచాపుకుకూర్చొని, మూటలో చేతికి అందిన దినుసునల్లా బొక్కటం మొదలుపెట్టారు. ఎంత ఆకలి అవుతున్నదో ఏమో, యిద్దరు తెగమేశారు. కడుపు నిండేసరికి యిద్దరికీ కునుకుపట్టింది. అక్కడే ఆ గడ్డిలోనే నడుములు వాల్చి నిద్రకు పడ్డారు.

తెల్లవారింది. ఇద్దరూ మళ్లీ వాహనాలను వెతుక్కొని వచ్చి, వాటి మూపులపై నెక్కి ప్రయాణం సాగించారు. ఆట్టేదూరం పోకముందే బలే గమ్మత్తైన విషయం ఒకటి జరిగింది.

పది గజాలైనా పోయారో లేదో, యింతలో అల్లంతదూరాన, డాన్ క్విక్ సెట్ గారికంటే వింత అయిన ఆకారం ఒకటి వీళ్ల కంటబడింది. ఆ ఆకారం గాడిద నెక్కి వీళ్లవైపే వస్తున్నది. ఇంకొంచెం దగ్గిరకు వచ్చాక గాడిదమీద వున్న ఆ ఆకారం, ఒక పురుషుడి దైనట్లు తోచింది. వాడి నెత్తిమీద ఏదో వస్తువు ఆ నీరెండలో బంగారంమల్లే మెరిసిపోతోంది.

డాన్ క్విక్ సెట్ గారు వీర గాథలన్నీ కంఠస్థం చేసినవాడు కదూ! ఎదురుగుండా వస్తున్న వాడు, తళతళా బంగారంలా మెరిసిపోతున్న శిరస్త్రాణం ధరించి వుండటాన్ని గమనించేసరికి, యింతకూ మూర్ దేశపు రాజు 'మేంబ్రినో' కథ చప్పున జ్ఞాపకానికి వచ్చింది. ఆ కథలో మేంబ్రినో రాజు యిలాంటిదే ఒక బంగారపు టోపీని యెన్నో సాహసకార్యాలు చేసి సంపాదించాడు. ఆ బంగారపుటోపీ కూడా మాంచి మహత్తువున్న టోపీ. అది యెవడి తలమీద వుంటే, వాడిని ఎవరూ ఏవిధంగానూ ఓడించలేరు ఈ బంగారుటోపీ కథ జ్ఞాపకానికి రాగానే, డాన్ క్విక్ సెట్ గారు, ఆ మహత్తు గల టోపీ యిప్పుడు యీరూపేణా తన వళ్లోకి వచ్చి పడుతున్నదని సంబరాలుపడ్డాడు. అప్పటికప్పుడే

తాను టోపీని ఊడలాక్కొన్నట్లు, చెడామడా యుద్ధాలుచేసి యెందరెందరో రాజుల్నీ, మహారాజుల్నీ జయించి పారేసినట్లూ ఊహించుకొన్నాడు.

"శాంకో! శాంకో! వాహనమెక్కి మన వైపునకే వచ్చుచున్న ఆ వీరుని గాంచితివా? ఆతని శిరస్త్రాణమును గమనించితివా! అది సువర్ణరత్నఖచితమైన 'మేంబ్రినో' రాజుగారి కిరీటము. నేనిదే ఆ వీరుని వుక్కడచి ఆ కిరీటమును పొందెదగాక! ఇకపై భీకరానన వీరశూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు అజేయులు!" అంటూ ఆకాశంవైపు చేతులు చాచి గొంతెత్తి అరిచాడు.

"స్వామీ! మీరు పొరపడుతున్నట్లున్నారు. తొందరపడకండి. నాకంటికి, గాడిద నెక్కివచ్చుచున్న వ్యక్తి ఎవరో సాధారణ వ్యక్తికిమల్లే తోస్తున్నాడు. ఆతడు నెత్తిన ఏదో మెరిసే పాత్రను బోర్లించుకొన్నట్లున్నాడు." అని మాత్రం శాంకోపాంజా అన్నాడు. తాను అనే మాటలు తన యజమాని ఎలాగూ ఖాతరు చెయ్యడని వీడికి తెలుసు. అయినా, ఉండబట్టలేక ఆ మాటలు అన్నాడు.

శాంకో పాంజా అనుమానపడ్డంతపనీ అయింది. వీడి మాటలు వినీవినకుండానే, డాన్ క్విక్ సెట్ గారు మండిపడ్డారు. "అది మేంబ్రినోరాజుగారి కిరీటము. ఇందిసుమంతయు సందియము లేదు. నీవుమాత్రము యిటనే నిలిచియుండుము. ఇప్పటికెన్నియో సంవ

త్సరములుగా వేచియున్న యవకాశ మిప్పుడు నాకు లభించుచున్నది. నేనొంటరిగా పోయి నా చిరవాంఛిత మీాడేర్చుకొందుగాక!" అంటూ గుర్రాన్ని అదిలించి, యీాటె తిప్పుకొంటూ ముందుకు చొచ్చుకుపోయాడు.

అవతల మనిషి బాగా చెయ్యివాటు దూరం లోకి వచ్చాక "తుంటరీ, నిలువు నుండే! అడుగైన ముందుకు వేసితివా, నీ ప్రాణములు నీవి కావు. వీర ధర్మములరీత్యా నాకు సంక్రమించవలసిన ఆ బంగారు కిరీటమును నాకు మర్యాదగా అప్పగించివేయుము." అంటూ డాన్ క్విక్ సెట్ గారు వాడిని సవాలు చేశాడు.

ఉరమని పిడుగులా వచ్చిపడ్డ యీా భీకరాకారాన్ని చూచి, అవతలిమనిషి కంగారెత్తిపోయాడు. అసలు వాడొక మంగలి. తన వృత్తిలో నిత్యం అవసరమయ్యే యిత్తడి బొచ్చెను, తలమీాద బోర్లించుకు వస్తున్నాడు. వాడు యీామధ్యనే కొత్త టోపీ ఒకటి కొనుక్కున్నాడు. అది ఎండకు ఎక్కడ పాడై పోతుందోనన్న దిగులుకొద్దీ, దానికి ఆచ్ఛాదనంగా యీా యిత్తడిబొచ్చెను నెత్తిమీాద బోర్లించు కొన్నాడు. ఆ బొచ్చెను చూచి, డాన్ క్విక్ సెట్ గారు బంగారు కిరీటమని భ్రమపడ్డాడు

డాన్ క్విక్ సెట్ వాడి గుండెలమీాదికి యీాటె గురిపెట్టి, చంపేస్తానంటూవుంటే వాడికి నిజంగా హడలెత్తిపోయింది. ఎటు తప్పించుకోటానికి దిక్కు

తోచక, వాడు గాడిదవీపుమీదనుంచి, చలిమిడి వుండ జారినట్లు జారిపోయి, కాలికొద్దీ పరుగు లంకించు



కొన్నాడు. కొంతదూరం పరుగెత్తాక వెనక్కు తిరిగి చూస్తే, డాన్ క్విక్ సెట్ గారు గుర్రంమీద తరుముకు వస్తున్న దృశ్యం కనిపించింది. ఈ యిత్తడి బొచ్చె మూలంగాకదా, యింత ప్రాణంమీదికి వచ్చిందని, ఆ

బొచ్చెను తలమీదినుంచీ తీసి అక్కడే పారేసి, తన దారిని తాను పరుగుతీశాడు.

డాన్ క్విక్ సెట్ గారు గబగబా వచ్చి, గుర్రాన్ని తక్కున ఆపేసి, ఆ బొచ్చె పడి వున్నచోట మోకరిల్లి, దాన్ని రెండు చేతులతోనూ పైకి యెత్తి, ఎంతో భక్తిగా కళ్లకు అద్దుకొన్నాడు. తీరా కళ్లు తెరిచిచూస్తే, ఆబొచ్చె చుట్టూ వుండే అంచు ఎక్కడ పడిపో యిందో, అసలు కనిపించనే లేదు. ఈ కిరీటం రాక రాక తనచేతికి వస్తే, సరిగ్గా యీ సమయానికే యిందులో సగభాగం యిలా వూడిపోవటం చూస్తే డాన్ క్విక్ సెట్ గారికి ఏడుపువచ్చింది. ఈ కిరీటం యిలా పాడుకావటమనేది కూడా, ఉడుకుమోతు మాంత్రికు డెవ్వడో మాయచేసినందువల్లనే నని తనకు తను సమాధానం చెప్పుకొని, కొంత వూరట పడ్డాడు. ఆ అర్ధకిరీటాన్నే తగిలించుకు తిరుగుతానని పంతం పట్టాడు.

నెత్తిమీద అప్పటికే వున్న బరువుచాలక, యీ బోడి బొచ్చెను కూడా తగిలించుకొన్నాడు. ఈలోగా శాంకోపాంజా కూడా గాడిదనెక్కి నింపాదిగా వచ్చి యీాయనను కలుసుకొన్నాడు. ఇద్దరు మళ్ళీ ప్రయాణం సాగించారు. దారిపొడుగునా యీ నవ రత్నఖచిత సువర్ణకిరీటప్రభావాన్నిగురించి డాన్ క్విక్ సెట్ గారు ఆ మందకొడి మనిషికి వేయికథలు

చెప్పాడు. వీరుల ఫ్రాసు ఎలాగూ వచ్చిందికదా అని, మునుపటి కథలలోని వీరులకు ఎలాం టెలాంటి సత్కారాలు జరిగాయో, అలాటివే యీ భీకరానన వీరశూరాగ్రేసర డాన్ క్విక్సెట్‌గారికీ, వారి అనుంగు భృత్యుడైన శాంకోపాంజాకు అనతికాలం లోనే జరుగబోతున్నాయని విడిని తెగ వ్రూరించాడు.

## 9

వాళ్లిద్దరూ అలా సరదాగా కబుర్లు చెప్పు కొంటూ కొంతదూరం పోయారు. ఇంతలో వాళ్లకు గుంపుగా వస్తున్న మనుష్యులు కొందరు కనుపించారు. ఆ గుంపులో డజనుమందిదాకా కాలినడకను వస్తు న్నారు ఇద్దరు మాత్రం పోలీసులకుమల్లే దుస్తులు వేసుకొని, గుర్రాలు ఎక్కి వస్తున్నారు. కాలినడకను వస్తున్న ఆ డజనుమందికీ, కాడికి కట్టిన ఎద్దులకుమల్లే, మెడలకు యింతలావు యినపగొలుసు తగిలించారు. ఆ ముందువైపు గుర్రాలమీద వస్తున్న వాళ్లిద్దరు కాక, ఆ మందకు వెనుకవైపునకూడా మరొక యిద్దరు పోలీసులు నడిచి వస్తున్నారు.

"పాపం! ఎవరో ఖైదీలు కాబోలు! రాజుగారు వీళ్లందరికీ శిక్షలు విధించి పంపుతున్నట్లున్నారు." అంటూ శాంకో పాంజా తన జాలిగుండె వెళ్లబెట్టాడు.

"అట్లనిన, రాజుగారు వీరందరినీ బలవంతముగా కారాగారవాసమునకు పంపుచున్నారనియే కదా

అర్థము ?" అని డాన్ క్విక్‌సెట్‌గారు అందుకున్నారు.

"వీళ్లంతా ఏవేవో నేరాలు చేసివుంటారు. అందుకనే అధికారులు వీళ్లకు శిక్షలు విధించి వుంటారు."- శాంకో పాంజా తనకుగల లౌకిక జ్ఞానాన్ని వుపయోగించి అన్నాడు.

వాళ్లంతా ఏవేవో నేరాలుచేసి వున్నందువల్లనే వాళ్లకీ శిక్షలు పడివుంటాయని ఆ బంటుగాడికి తోచిన మాత్రమైనా, యీ 'భీకరానన వీర సూరాగ్రేసరుడు' డాన్ క్విక్‌సెట్‌గారికి తోచనేలేదు. తోచకపోగా "వీరి యిష్టాయిష్టములతో ప్రమేయము లేకనే అధికారులు వీరిని కారాగారములకు పంపుచున్నారు కదా? దుష్ట శిక్షణ, శిష్టరక్షణలు మాత్రమేకాక, పీడితప్రజానీకమునకు సేవచేయుటకూడా వీరధర్మములలో నొకటి గావున, నే నిదే పోయి, నిర్బంధవిధిని శిక్ష ననుభవింపబోవుచున్న యీ మానవ సమూహమును అధికారుల హస్తములలోనుండి విడిపించి, వారికి స్వేచ్ఛా స్వాతంత్ర్యముల ప్రసాదించెదగాక !" అంటూ హెచ్చులు పోయాడు.

తన యజమాని మళ్లీ యీ దగుల్బాజీ వ్యవహారంలో తానూ యిరుక్కొని, తననీ యిరికించబోతున్నాడని పసిగట్టిన శాంకోపాంజా, ఆయన కాళ్లకు అడ్డంపడి, "మహాప్రభూ! నామాట వినండి. అధికారులు వీళ్లకు శిక్షలు అనవసరంగా వెయ్యలే

దండీ! వీళ్లు చేసిన నేరాలకు శిక్షలు విధించటం ధర్మమేనండీ మహాశయా!" అంటూ ఎంతగానో బ్రతిమాలి చెప్పాడు.

అయినా సరే-యీవీరుడు, బంటుగాడి మాటలు లెక్క-చేయక, ఆ గుంపుదగ్గరకు వెళ్ళి వాళ్లను ఆగమన్నాడు. వాళ్లూ ఎందుకనో ఆగిపోయారు. డాన్ క్వీక్సెట్ ఆ పోలీసుల్లో ఒకడి దగ్గరగా తన గుర్రాన్ని పోనిచ్చి "అయ్యా! వీరికి యీ దుర్గతి ఏల పట్టినదో అడిగి తెలుసుకొన నాకు అనతి యింకు!" అని కోరాడు. ఆ అధికారి సరే నన్నాడు.

మెడలకు తగిలించిన యినుపగొలుసులబరువుకు ఆ డజనుమందీ నేలకు ఒరిగిపోతున్నారు. అలాటి వాళ్ళలో మొదటివాణ్ణి డాన్ క్వీక్సెట్ గారు అడిగారు "నీకీ దుర్గతి ఏల కలిగె?" అని.

వాడెంత చతురుడో—'ప్రేమించినందువల్ల నే' తన కింతటి దుర్గతి పట్టిందని వెళ్లబోసుకొన్నాడు.

"ఏమేమీ! ప్రేమే నేరమానా? ప్రేమే నేరమైన నేనునూ శిక్షార్హుడనే! నేనుమాత్రము ఆ అనన్యరూపసి, అందాలరాణి,ముత్యాలకోవ'టాబోసో రాజ్ఞి డల్సీనియా' కన్యను ప్రేమించుటలేదా!" అంటూ డాన్ క్వీక్సెట్ గారు, నోరప్పళించి విస్తు పోవటం మొదలుపెట్టారు.

ఇంతలో ఆ కొరతనుబడ్డవాడు కల్పించుకొని, ప్రేమ అంటే, తనది అల్లాటి ప్రేమ కాదనీ, తనవి కాని

విలువైన ఒక బట్టలమూటపై తన మనసు ఎందుకో అవ్యాజంగా తగుల్కొన్నదనీ, అలా తగుల్కొనిపోయిన మనస్సును తను ఎంతకీ తిరిగి వూడలాక్కోలేక, ఆ బట్టల మూటనే ఎత్తుకుపోయాననీ, తాను చేసిన నేరమల్లా అదేననీ వివరించి చెప్పాడు.

మిగిలిన బందీలు కూడా యిలాగే తాము చేసిన పనులేవో చెప్పుకొన్నారు. ఒకడు ఆవులను దొంగలించా నన్నాడు; యింకొకడు డబ్బులసంచులు కొట్టేశానన్నాడు! మరొకడు కన్నాలు వేశానన్నాడు. ఇలా అందరూ చిన్నవీ, పెద్దవీ నేరాలు చేసినట్లు ఒప్పుకొన్నారు.

అందరికంటే చివర ఒకడు వున్నాడు. మిగిలిన వాళ్లందరూ ఒక యెత్తు; వీడొక్కడూ ఒక యెత్తు. వీణ్ణి మిగిలినవాళ్లందరికంటేకూడా ఎక్కువ పకడ్ బంద్‌గా కట్టేశారు. వాడికి ఆపాదమస్తకం యినుపగొలుసులు తగిలించారు. ఆ గొలుసులు ఎంత అడ్డదిడ్డంగా కట్టేశారంటే, వాడికి నోటిదగ్గరకు చెయ్యిపోవటానికి వీల్లేదు; చేతిదగ్గరకు నోరూ రావటానికి వీల్లేదు! మనిషిమాత్రం ఒడ్డూ, పొడుగూ వున్నాడు. వాడి ఆకారం, రంగూ అవీ అంతా మెంచి హుందాగా కనుపిస్తున్నాయి. కంట్లో ఆ మెల్ల కాస్తా లేకపోతే వాణ్ణి పెద్ద అందగాడనే అన

వచ్చు. మనిషి ముఖంలో మాత్రం పొగరుబోతు తనం కొట్టవచ్చినట్లు కనుపిస్తున్నది.



'మిగిలినవాళ్ళందరికంటే వీణ్ణి యింత గట్టిగా గొలుసులతో కట్టిపడేశారేమా' అని డాన్ క్విక్ సెట్ గారికి ఆశ్చర్యం వేసింది. ఆ అధికారిని అడిగాడు వీడి ప్రత్యేకత ఏమిటని. మిగిలిన వాళ్ళందరూ కలిసి ఎన్నెన్ని నేరాలు చేశారో, వీడొక్కడూ అన్ని నేరాలు చేసివుండటమే వీడి ప్రత్యేకత అని ఆ అధికారి చెప్పాడు. వాడిపేరు 'గైన్స్-డి-పస్సామాంటీ' అనీ, వీడంత దగుల్బాజీ, లుచ్చా మరొకడు వుండబోడనీ, వీడికి వున్న టక్కరితనానికి శిక్ష తప్పించుకు పారిపోవడానికి వీలులేకుండా, యింత కట్టుదిట్టంగా కట్టిపడేశామనీకూడా ఆయన చెప్పాడు.

ఏదో యింతసేపూ వాళ్ళతో మర్యాదగా మాట్లాడుతున్నాడుకదా! అంతటితో వాళ్ళను యీ డాన్ క్విక్ సెట్ గారు పోనిచ్చినా బాగుండేది. అలా కాకుండా ఆ పోలీసుఅధికారులతో అర్థంలేని వాదనకు దిగాడు.

"అయ్యా! ఓ అధికారీ! దురదృష్టవంతులైన వీరిలో ఏ ఒక్కరునూ వ్యక్తిగతముగా నీ కట్లు అవమానకరముగా ప్రవర్తించి యుండలేదుకదా! నీ సొమ్ము అపహరించియుండలేదుకదా! నీకట్లు చెడుగా ప్రవర్తించని వీరు, నేరము చేసిరని యెవడో న్యాయాధికారి అనినంతమాత్రమున, నీ వా మాటను విశ్వసింపవలసినదేనా? ఆ న్యాయాధికారి మాత్రము పొరపడి యుండలేదను నమ్మకమేమి? నామట్టుకు నేను, ఆ

న్యాయాధికారిమెవడో వీరి చర్యలను అపసవ్యముగా అర్థము చేసుకొన్నాడని త్రికరణశుద్ధిగా నమ్ముచున్నాను. కాన వీరందరినీ తక్షణమే విడుదలచేయుము. మంచి గనూ, మర్యాదగనూ నే చెప్పెడి యీ విషయమును నీవు పాటించ వేని, యీ భుజబలము, యీ ఖడ్గధార నీకు బుద్ధిని తెప్పించగలవు. జాగ్రత" అంటూ భుజాలు చరుచుకొంటూ, మీసాలు మెలివేసికొంటూ హుంక రించాడు.

వాళ్లు అసలే పోలీసులేమో— ఈయనగారి యీ ధోరణి చూసేసరికి ఆ నలుగురు పోలీసుల్లో ఒక డికి చిర్రెత్తుకొచ్చింది.

"ఏయ్! ఎవరు నువ్వు! బందీలందరినీ వదిలి వెయ్యమంటావేం? వదిలెయ్యటానికి మాకు అధి కారం వున్నదా? వదిలెయ్యమనటానికి నీకు అధికార మున్నదా? వెర్రివాగుడు కట్టిపెట్టి, ఆ యిత్తడిబొచ్చె నెత్తిమీద సరిగా బోర్లించుకొని నీ దారిని నువ్వు, నోరుమూసుకు నడు" అంటూ రోడ్డు చూపించాడు.

డాన్ క్విక్ సెట్ గారు యీ అవమానాన్ని భరించలేకపోయారు. తనను అంత చులకన చేసి మాట్లాడుతున్నవాడిని కసిదీరా తిట్టిపారేద్దామని పళ్లు పటపటకొరికి, "ఓరీ ఖరా! ఖరశేఖరా! మూషి కమా, మార్జాలమా, గార్దభమా!...గాండీవమా!" అని బిగ్గరగా అరిచేశాడు. వీరగ్రాంథికభాషలో యింకా బరువైన తిట్లుఏమైనా తట్టుతాయేమో,

వాటినన్నిటినీ వీపిమీదికి దొర్లించి, ఆ తిట్ల బరువుకే వీడు లొంగిపోయేట్లు చేసిపారేద్దామని యీయన ఎంతో ఆరాటపడ్డాడు. ఎంత ఆరాటపడ్డా, ఆ నాలుగైదు ముక్కలకు మించి, తిట్లరూపంలో ప్రయోగించదగిన పదాలేవీ యీయనగారి (మట్టి) బుర్రకు తట్టనేలేదు. ఇంకా ఏవేవో తిట్లకోసం వెతుకుతున్నట్లే వెతుకుతూ-తన చేతిలోని యీటె పుచ్చుకొని ఆ పోలీసును ఒక్కచరుపు చరిచాడు. వాడు యీ దెబ్బకు కాచుకొనివుండలేదేమో, దెబ్బ తగిలీ తగలటంతోటే నేలమీద బోర్లబొక్కలా పడిపోయాడు.

ఈదృశ్యం చూస్తున్న మిగిలిన పోలీసులందరికీ విపరీతమైన ఆవేశం వచ్చింది. ముగ్గురూ లాఠీలు పుచ్చుకొని డాన్ క్విక్ సెట్ గారిమీద దూకబోయారు. ఇలా ముగ్గురు పోలీసులు తనమీదకు విరుచుకువస్తున్నా, డాన్ క్విక్ సెట్ గారుమాత్రం మహాధైర్యంగా గుర్రం మీద కూర్చొనివున్నాడు. ఈయనకు వున్న ఆ మొండిధైర్యానికి, నిజానికి, డాన్ క్విక్ సెట్ గారు ఆరోజు వాళ్ళచేతుల్లో చిక్కి చావవలసినవాడే! కానీ యింతలో ఓ గమ్మత్తు జరిగింది.

గొలుసుతో కట్టబడివున్న ఆ డజనుపంది బందీలు యీ సందడిలో ఎలా తప్పించుకొన్నారో, కట్లుఅన్నీ వూడదీసేసుకున్నారు!

శాంకోపాంజాగాడికి ఎలా చేతనయిందో ఏమోకానీ, బందీ అయివున్న ఆ కాడి, 'గైన్స-డి-

పస్సామాంటీ' వంటిమీద వున్న గొలుసుకట్లన్నీ విప్పేశాడు. ఆ రౌడీ అదను చూచుకొని, డాన్ క్విక్ సెట్ గారి చేతిలో దెబ్బతిని మట్టి నాకుతున్న పోలీసు మీద పడి, ఆతని తాలూకు కత్తిని, తుపాకినీ, స్వాధీన పరచుకొన్నాడు. ఈలోగా మిగిలిన బందీలందరూ బండెడు కంకర రాళ్లు పోగు చేసుకువచ్చారు. ఈ రౌడీ తుపాకీమడమతో చేతికందిన పోలీసునల్లా పొడిచి పొడిచి వదలిపెడుతుంటే, మిగిలినవాళ్లందరూ రాళ్లు రువ్వి వారిని తరిమి తరిమి కొట్టారు. ఈ డజనుమంది కురిపించే రాళ్లవానకు తట్టుకోలేక పోలీసులు పారిపోయారు.

పోలీసులు అందరూ కనుచూపుమేర దాటి పోయాక, డాన్ క్విక్ సెట్ గారు వీరోచితంగా సకిలించి, ఆ డజనుమందినీ యిలా తన ఎదుటికి వచ్చి కళ్లెంకట్టి నిల్చోమన్నాడు. వాళ్లందరూ దగ్గరసా జరిగి నిల్చొన్నారు. ఏదో పెద్ద యుద్ధంలో హోరాహోరీ పోట్లాడి, శత్రుసమూహాన్ని పారద్రోలిన పిదప సేనానాయకుడు తన సైన్యాన్ని వుద్దేశించి వుపన్యసించే ధోరణిలో, యీాయనకూడా ఒక వుపన్యాసం ప్రారంభించాడు.

వీరులుఅంటే ఎవరో, వీరోచితకార్యాలంటే ఏమిటో ముందుగా వివరించాడు. తదనంతరం యీనాడు తాను వీరికి ప్రసాదించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యము లెంతటిమహత్తరవిషయాలో మరింతవిశదంగా

చెప్పాడు. ఇవన్నీ చెప్పి, వాళ్లందరినీ ఒకపని చేయమని పురమాయించాడు. ఆ పనేమంటే—యీ డజను మందీ కట్టకట్టుకొని 'టొబోసో' పట్టణానికి పోయి, అందుగల అనన్యరూపసి డల్సీనియా రాకుమారి సమక్షంలో, 'భీకరానన వీరశూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ మహాశయుడు యీనాడు సలిపిన పోరాటంలో ప్రదర్శించిన ధైర్యసాహసాలను వేనోళ్ళ కొనియాడమని కోరాడు. తామందరినీ అధికారులబారి నుండీ రక్షించి, స్వేచ్ఛాజీవులుగా నొనరించిన వైనం ఎవరికి ఓపినంతమటుకు వారు వివరించవలసిందిగా హుకుం వేశాడు. తన ఆజ్ఞమేరకు డల్సీనియా రాకుమారికి తన ప్రతాపమును యెరుకపరచిన మీదట, వాళ్ళంతా ఎవరియిష్టంవచ్చిన చోటికి వారు పోవచ్చుననికూడా సెలవిచ్చాడు. ఆ డజనుమందీ అంతసేపూ యీాయనగారి వుపన్యాసం ముసిముసినవ్వులతో వింటూ నేవున్నారు. ఆ వుపన్యాసం పొంతం విన్నాక, ఆ రౌడీ కాస్త ముందుకు జరిగి, వున్నపళంగా అందరూ కట్టకట్టుకు 'టొబోసో' పట్టణానికి పోవటమనేది చస్తే కుదరని విషయమని తేల్చివేశాడు. పట్టపగలు రాజబాటవెంట తామందరూ పోవటమనేది చేజేతులా మళ్ళీ పోలీసులకు చిక్కిపోవటమే అవుతుందని కరాఖండిగా చెప్పివేశాడు.

"ఔరౌరా! మీకై ప్రాణములనైన లెక్కసేయక అధికారులతో పోరాడి మీ కారాగారవాస

ములతప్పించిన నన్నే ధిక్కరింతురా! మీ మాత్స
ర్యముల నిదే అణచివైచెద! ఈ 'భీకరానన వీరశూరా
గ్రేసరుడు' యిట్టి కుటిలజన ధిక్కారములను సైరిం
చునే!" అంటూ డాన్ క్విక్ సెట్ గారు యింకా
ఏవేవో పెద్దగా అరుస్తున్నాడు. ఈలోగా
ఆ శాడీ చేసిన సైగ అందుకొని, మిగిలిన బందీలందరూ,
యింతకుముందే పోలీసులమీద ప్రయోగించటానికి
పోగుచేసిన రాళ్లలో మిగిలినవాటిని, యీయన
మీదకు ప్రయోగించారు. అన్నివైపులనుంచీ వచ్చి
పడుతున్న యీ రాళ్లజోరుకు ఆగలేక, డాన్ క్విక్
సెట్ గారు గుర్రం మూపుమీదినుంచి కిందికి దొర్లి
పోయారు. క్రిందపడ్డ యీవీరునిమీదకు ఆ డజను
మందీ విరుచుకుపడ్డారు. వాళ్లల్లో ఒకడు యీయన
గారి నెత్తిమీద వున్న యిత్తడి బొచ్చెను వూడలాగి,
ఆ బొచ్చెతోనే ఆయనను తెగబాదాడు. అసలే అంచు
ఊడిపోయిన ఆ బొచ్చె, వాళ్ల చేతుల్లో సాంతం
సొట్టలుపడిపోయి, దాని అసలు ఆకారం ఎలావుండేదో
వూహించటానికైనా వీలులేకుండా తయారు అయింది.
ఈయనగారు వుక్కుకవచం మాసిపోకుండా, రక్షణ
కోసం పైన తొడుక్కొన్న చొక్కాను కాస్తా మరో
కడు వూడలాక్కొన్నాడు ఇంకొకడు పోయి, శాంకో
పాంజాను తన్ని, వాడిదగ్గిర వున్న పెద్దదుప్పటి నొక
దానిని లాక్కొన్నాడు. ఇలా బాగా అరగంటసేపు
అందరూ ఆ స్వామినీ, యీ బంటునీ చేతికందితే చేతి

తోనూ, కాలికందితే కాలితోనూ, చెయ్యా, కాలూ నొప్పిపుడితే కర్రలతోనూ రాళ్ళతోనూ కొట్టికొట్టి, వీళ్లతాలూకు ఏ వస్తువు దొరికితే ఆవస్తువునల్లా పట్టుకు చక్కాపోయారు.

వాళ్ళంతా అలా పోయాకకూడా, గంటసేపటి వరకు డాన్ క్విక్ సెట్ గారు కానీ, శాంకోపాంజా కానీ పెదిమలు పెకలించి మాట్లాడలేకయారు. ఇంత సేపూ ఆ గాడిద 'డాపుల్' మాత్రం, బుర్ర తెగ ఆడించే స్తోంది. ఇందాక ఆ దొంగల ముఠావాళ్ళు విసిరిన రాళ్లు, జడివానజల్లులాగా తడవతడవకు వచ్చి మీాద పడుతుంటే, యీా గాడిద కళ్ళు మూసి తల ఆడించటం మొదలుపెట్టింది. రాళ్లవాన ఆగిపోయి గంటైనా కూడా, ఆ గాడిద యింకా రాళ్లు ఏవో వచ్చి మీాద పడుతున్నట్లే భ్రమించుకొని, బుర్ర ఆడించటం ఎంతకీ ఆపనేలేదు.

ఆ 'రోజినాన్టే'కి కూడా, రాళ్లు తగిలా యేమో,—అదీ నేలమీాద నాలుగు కాళ్లూ నాలుగు వైపులకూ బారజాపి పడుకొనివుండిపోయింది.

డాన్ క్విక్ సెట్ గారి విషయం చెప్పనే అక్కర లేదు. పుణ్యానికి పోతే తనకు ఎదురైన పాపాన్ని తలుచుకొంటూవుంటే ఆయనకు గుబులుగుబులుగా ఏడుపువస్తున్నది. గట్టిగా ఏడవటానికైనా ఓపిక లేకుండాపోయింది.

శాంకోపాంజాగాడికి అసలు అంతకుముందు నుంచీ కయ్యాళిగా వున్నదేమో, యిప్పుడు జరిగిన యీ శృంగభంగానికితోడు తన తాలూకు దుప్పటి కూడా పోయినందుకు, వాడు రెండు చేతులూ నెత్తిమీద పెట్టుకు అల్లంతదూరంలో కూలబడి, కుమిలి కుమిలి ఏడుస్తూ, తపవతపవకు ముక్కూ కళ్లూ తుడుచుకొంటున్నాడు.

ఈ సంఘటనతరువాతనే డాన్ క్విక్‌సెట్ గారి ద్వితీయ జైత్రయాత్ర ముగిసింది. ఒళ్ళంతా గాయాలతో డాన్ క్విక్‌సెట్ గారూ, ఆయన బంటూ యిద్దరూ స్వగ్రామానికి తిరిగివచ్చారు.

ఎన్ని దెబ్బలు తిన్నా, డాన్ క్విక్‌సెట్ గారు ఇలా బుద్ధిగా యింటికి తిరిగి వచ్చినందుకు ఆయన మేనకోడలు, దాసీ యిద్దరూ చాలా సంతోషించారు. వాళ్ళిద్దరూ కలిసి యీయనకు మందులు, మాకులూ వేసి, పథ్యంపానం బాగా అమర్చి, గాయాలన్నీ నయం చేశారు. వీళ్ళపరిచర్యలమూలంగా పీనుగ లేవచ్చిన మనిషి కొంచెం పుంజుకొన్నాడు. ఆ ఆడవాళ్ళు యిద్దరూ మళ్ళీ యీయన కొంపవిడిచి ఎక్కడ పోతాడోనని, వేయికళ్లతో కనిపెట్టి చూస్తునేవున్నారు. వాళ్లు భయపడుతున్నంతపనీ కొద్దిరోజుల్లో, జరుగనే జరిగింది. అందుకే అంటారు మనపెద్దలు—'పుర్రెతో పుట్టినబుద్ధి పుడకలతో కాని పోద'ని!

# 10

ఒళ్ళంతా గాయాలు చేసుకొని యింటిపట్టుకు చేరిన డాన్ క్విక్ సెట్ గారు, మంచంలోనుంచి లేవలే నన్నిరోజులూ బుద్ధిగానే వున్నాడు. ఆ గాయాలూ అవీ కొంచెం నయమై, వొంట్లో కాస్త ఓపిక వచ్చిందనేసరికి, యీయనగారి బుర్రలో మళ్లీ పురుగు తొలవటం మొదలైంది.

ఒకరోజు చీకటిపడ్డాక, వూరికే అలా షికారుగా వెళ్లివస్తానని యింట్లోవున్న మేనకోడలితో చెప్పి, ఆమెను ఒప్పించి, రోడ్డువెంట బయలుదేరాడు. రోడ్డు ఎక్కీ ఎక్కటంతోటే, శాంకోపాంజాగాడు కాపురముండే గుడిసెవైపుకు దారితీశాడు.

అన్నిరోజులపాటు అలా విడవకుండా ఆయనను అంటిపెట్టుకు తిరిగిన జీవమేమో—వీడికికూడా యీయనను ఎప్పుడెప్పుడు చూద్దామా అని గుబులుగుబులుగానే వుంటున్నది. ఇంతలో ఆయనగారే కాళ్ళీడ్చుకొంటూ తనకొంపకు వస్తే, వాడికి కొండెక్కినంత సంతోషం వేసింది. ఇద్దరూ ఒకళ్ళనొకళ్లు గట్టిగా కౌగలించుకొన్నంత పనిచేశారు.

ఇద్దరికీ చెరి చేరెడు ఆనందబాష్పాలు రాలిపోయాకగానీ, యిద్దరి మనస్సులూ కొంచెమైనా తేలికపడలేదు. ఇద్దరూ అక్కడే కూలబడి వెనుకటి తమ

వీరవిహారాల తాలూకు అనుభవాలను తెగ నెమర వేసుకోవటం మొదలుపెట్టారు. ఆ మాటలధోరణిలోనే శాంకోపాంజా కొత్త విశేషమొకటి బయటపెట్టాడు.

వీళ్ల యీ 'లామంచా' గ్రామంలోనే, బర్తీ కెళ్ళి కాలేజీచదువు చదివిన కుర్రాడొకడు వున్నాడు. ఆ కుర్రాడు యీ మధ్యనే శెలవులకు యింటికి వచ్చాడు. అతనిపేరు 'శాంసన్ కార్రాస్కో.' ఈ శాంసన్, డాన్ క్విక్సెట్‌గారి వీరవిహారాలను గూర్చిన వుదంతాలన్నీ పత్రికల్లోనూ, పుస్తకాల లోనూ చదివాడట! ఆయనే స్వయంగా యీ విషయం తనతో చెప్పాడని శాంకోపాంజా, డాన్ క్విక్సెట్ గారికి ఎంతో మురిపెంతో తెలియచెప్పాడు.

భలే!—డాన్ క్విక్సెట్‌గారు, యీనాటికి వీరుడుగా తయారవటమే కాక, యీాయన పేరూ అదీ అచ్చు కూడా అవుతూవున్నాయన్న మాట! ఇంకేం—డాన్ క్విక్ సెట్ గారిని పట్టపగ్గాలే లేకుండాపోయాయి. ఆయన గారి మనస్సుకు రెక్కలు వచ్చేశాయి. తన వొంట్లో యిక ఆ కాస్త ఓపికకూడా వస్తే, తాను ఏ ఏ ఘన కార్యాలు చేయబోయేదీ, ఎటువంటి ఘనతర విజయాలు సాధించబోయేదీ, అవన్నీ తియ్యతియ్యగా ఆలోచించుకోవటం మొదలుపెట్టారు. ఆ ఆలోచనల సందడిలోనే, శాంకోపాంజాను వెంటచే పోయి ఆ కుర్రాణ్ణే తనవద్దకు తీసుకురమ్మన్నాడు. (తనవొంట్లో ఓపిక లేకుండాపోయింది కానీ, లేకపోతే తానే పరు

గత్తేవాడుకదూ!) శాంకోపాంజా కూడా సంబరాలు పడుతున్నాడేమో, యీాయన ఈమాట అనటమే తరువాయిగా, కూర్చున్నవాడల్లా గభ్భున లేచి, మట్టి దులిపేసుకు, గడ్డి ఆడించుకొంటూ అటువేపు పరుగెత్తుకుపోయి, కన్నుమూసి కన్ను తెరిచేలోగా ఆ కుర్రాణ్ణి వెంటబెట్టుకు వచ్చాడు.

వాళ్లింకా అంతదూరంలో వున్నారనగానే డాన్ క్విక్సెట్ గారు లేచి ఎదురువెళ్లి, ఆ కుర్రాడి కుడిచేయి తన రెండుచేతులతోనూ గట్టిగా నొక్కి-పట్టుకొని తెగ 'షేక్‌హాండ్' యిచ్చాడు. ముగ్గురూ కలిసివచ్చి, మామూలుచోట కూర్చొని కుశల ప్రశ్నలన్నీ అడిగి తెలుసుకోవటం అయ్యాక, డాన్ క్విక్ సెట్ తానే ఆకుర్రాణ్ణి అడిగాడు — "నవయువకా! నే సలిపిన వీర విహారములనుగూర్చి ఏవో పుస్తకములందు వర్ణించబడి యుండగా, వానిని నీవు చదివి యున్నట్లు నాబంటు, — యీ శాంకోపాంజా — నాకింతకు ముందే నివేదించియున్నాడు. ఇది నిజమేనా?" అని.

శాంసన్ కూడా ఎంతో నమ్రభావాన్ని ప్రకటిస్తూ ఆమాట యథార్థమేనని చెప్పాడు. ఈయన అంటే తనకెంతో గౌరవమూ, భక్తీ వున్నట్లు కనపరిచాడు. తాను చదివిన ఆపుస్తకాలలో యీాయనగారి ప్రతాపాన్ని గూర్చి ఎలా ఎలా వర్ణించబడి వున్నదీ, అదంతా కంఠస్థంచేసినవాడిలా, పేజీలకు పేజీలు అప్ప

చెప్పేశాడు. ఆ శాంసన్ అలా ఒక్కొక్క వాక్యమే అప్పచెప్తూ వుంటే, డాన్ క్విక్ సెట్ గారి ముఖం అంతకంతకు విప్పారుకు పోతున్నది. ఒళ్లు పరవశమై తనవీపు తానే చరుచుకోవటం మొదలుపెట్టాడు. ఈతంతు అంతా పక్కా అరగంటసేపు నిరాఘాటంగా కొనసాగిపోయింది. ఇక అప్పటినుంచి డాన్ క్విక్ సెట్ గారికి ఆ కుర్రాడంటే ఎక్కడలేని అభిమానం పుట్టుకొచ్చింది. అప్పటినుంచీ డాన్ క్విక్ సెట్ గారు రోజుతో పిలైనన్ని గంటలు యీ కుర్రాడితోనే గడిపేసేవాడు.

అంతేకాదు—యీ కుర్రాడు యిచ్చిన ఆసరాతోనే యీ భీకరానన వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు తమ ద్వితీయ జైత్రయాత్రకు సన్నద్ధులు కాగలిగారు. ఆ కుర్రాడు యీయనపట్ల తనకు వున్న ప్రేమకొద్దీ, ఎక్కడిదో పాత వుక్కుటోపీ ఒకటి తెచ్చి యీయనకు బహూకరించాడు. అంతకు ముందునుంచీ డాన్ క్విక్ సెట్ గారి మూర్ధాన్ని అలంకరించివున్న ఆ వుక్కుటోపీకంటే, ఇప్పుడు ఈ శాంసన్ తెచ్చిపెట్టిన తుప్పుటోపీయే కొన్ని విషయాలలో చాలా మెరుగనిపించింది. ఇదివరకటి టోపీ యీయన గారి తలకి పెద్దదైందని చెప్పానుగా! ఆ కారణం చేత నేకద్యూ-ఆయన ఆ టోపీ పడిపోకుండా తలచుట్టూ సీనా రేకుముక్కలు, రిబ్బన్లూ, అట్టముక్కలు అంటించుకొనేవాడు! ఈ టోపీ అయితే ఆ గొడవ

అంతా తప్పుతుంది. అంతే కాకుండా యిదివరకటి టోపీలో సగభాగం ఐపూ పత్తా లేకుండా పోయిందామె. ఈటోపీమాత్రం; మిగిలిన విషయాల్లో ఎల్లావున్నా, ఏ భాగమూ వూడిపోకుండా అంతా వున్నది. ఈయనగారి తలకు చక్కగా కుదిరిపోయింది కూడాను! ఇక యీయనగారి ఆనందానికి అంతులేక పోయింది. 'శాంసన్ ఆ టోపీ తెచ్చి తేవటంతోటే, అతని చేతిలోంచి దాన్ని యీయన తన్నుకుపోయి, తలకు తగిలించుకు, తెగ గంతులేశాడు. ఆ తరువాత తీరుబడిగా కూర్చొని దానిమీద ఐదారు అంగుళాల ఎత్తున పేరుకొనివున్న దుమ్మూ, మాగర దులిపాడు. ఇసుక, యిటికరాతిపొడుము వేసి బాగా అరగంట సేపు దాన్నంతా తోమి, దానికి పట్టివున్న తుప్పనంతా వదిలించాడు. ఎంతకీ దానికి మెరుగు రాలేదు. నిగనిగలాడుతూ అయినా కనుపిస్తే కంటికి యింపుగా వుంటుందని దానినిండా యింత మంచినూనె పట్టించాడు.

ఈయనగారు వూపిరి సలపకుండా యిలా ప్రయాణసన్నాహాలు చేస్తూ, తెగ గింజుకొంటూ వుంటే, ఆ మేనకోడలూ, ఆ దాసీ యిద్దరూ, యీయనగారికి యీ దుర్బుద్ధి మళ్ళీ పుట్టుకొచ్చినందుకు, కన్నీరు మున్నీరుగా ఏడ్చారు. వాళ్లెంత ఏడ్చి, చచ్చి గీపెట్టినా యీయన అవేమీ లెక్కచేయలేదు. వీధి గుమ్మంలో చేరి ఆ ఆడవాళ్లు యిద్దరూ ఆ వరసను

శోకాలు పెట్టుతున్నా అవన్నీ వినిపించుకోకుండా, డాలూ, డవాలూ తగిలించుకొని, తన ముద్దుల గుఱ్ఱం 'రోజినాన్‌టీ' మూపున ఎక్కినవాడై నమ్మిన బంటు శాంకోపాంజా గార్దభారూఢుడై తన్ను వెన్నంటి రాగా, అధర్మాన్ని అన్వేషించుకొంటూ విశాల ప్రపంచమున పయనించాడు. వీరిద్దరి వెంటా ఆ శాంసన్ కూడా పూరి వెలుపలదాకా వెళ్ళి, వాళ్లను పంపించి వచ్చాడు.

మొన్న యింటికి తిరిగి వచ్చేరోజున తానున్న పరిస్థితికీ, యీనాడు మళ్లీ జైత్రయాత్రలకు బయలు దేరే సమయాన తానున్న పరిస్థితికీ ఎంత వ్యత్యాసం వున్నదీ డాన్ క్విక్‌సెట్‌గారు మనస్సులో ఒక్కసారి సరిపోల్చుకొన్నారు. ఆ సంతోషంలో ఆయనకు బంగారంలాంటి ఒక ఆలోచన తట్టింది. ఇక ఒక్క క్షణమైనా ఆలస్యం చేయకుండా, ఏకాయెకిని ఆ 'టోబోసో' పట్టణానికిపోయి 'డల్‌సీనియా' రాకుమారిని, అన్వేషించి, ఆమెగారి దివ్యసముఖమందు, తాను సల్పిన వీర విహారోదంతాలను వివరించి చెప్పాలనుకొన్నాడు. ఈ విషయాన్ని శాంకోపాంజాకు తెలియచేసి, 'టోబోసో'కే దారితీయమని పురమాయించాడు. ఇద్దరూ ఆవైపే వాహనాలను పట్టించి ప్రయాణం కొనసాగించారు.

అలా పోగా, పోగా అర్ధరాత్రివేళకుగాని ఆ పట్టణానికి చేరుకోలేకపోయారు. వీళ్లు అంటే—

ఖిలా నిశాచరుల్లా మేలుకొనివున్నారు కానీ, ఆ పట్టణం పట్టణమంతా ఎప్పుడో మాటు మణిగి పోయింది. అంత పెద్దపట్టణంలోనూ ఆ వేళప్పుడు మనిషి అన్నవాడెవ్వడూ మేలుకొని లేడు. శాంకోపాంజాకు మాత్రం నిద్దరమత్తుగానూ, బద్ధకంగానూ వున్నది. కానీ డాన్ క్విక్ సెట్ గారికి అటువంటి లక్షణాలు ఏమీ లేవు. ఆయన, ఆ అనన్యరూపసి డల్ సీనియా రాకుమారిని చూడనిదే అసలు, ప్రాప్తిరైనా పీల్చేట్లు లేడు.

"ఓ హో హో! ఇప్పటికి కదా నా జన్మ తరించినది! నా మానసహారిణి, ఆ అందాలరాణి, డల్ సీనియా రాకుమారి మేనుసోకిన పిల్లగాలులు నాకు చక్కిలిగింతలు పెట్టుచున్నవోయీ శాంకో..." అంటూ డాన్ క్విక్ సెట్ గారు ముసిముసినవ్వులు నవ్వుతూ, ఆ బంటుగాడివైపు వోరచూపులు కోకొల్లలుగా ఒలకబోశాడు. వాడసలే నిద్దరబద్ధకంగా వున్నాడేమో, యీాయన వాగేవాగుడు వాడు ఎంత మాత్రమూ పట్టించుకోవటంలేదు. వాడు ఏమాటా వినిపించుకోకపోవటం గమనించి డాన్ క్విక్ సెట్ గారు వాడి భుజంపట్టుకు వూగులాడించి "శాంకో! శాంకో! —ఓ శాంకో! జాలమేలచేసెదవోయి! ఇకనైనను నా ప్రాణనాయకి డల్ సీనియా రాకుమారి క్రీడలాడెడు కోటలోనికి దారిచేయుమోయి!" అంటూ వాడిని బతిమాలబోయాడు.

వాడికి అప్పుడున్న చిరాకుకొద్దీ, యీయన తన యజమాని అన్నమాటకూడా మరచిపోయి, "కోటఏమిటి, కోట? లోగడ నేను ఆ డల్సినియా గారిని చూచినప్పుడు ఆమె యీమాదిరి పూరిపాక లోనే గడండివున్నది! ఆవిడకు కోట ఎక్కడున్నదీ?" అంటూ అక్కడేవున్న ఒక పూరిపాకకేసి చేయిచాపి చూపిస్తూ నిక్కచ్చిగా అన్నాడు.

"అదేమిటోయీ; శాంకో! అట్లు మాటలాడెద వేమి! నీవు లోగడ ఆమెను చూచినప్పుడు ఆమె తన కోటలోనే ఒకమూలగా ఏదోచికనిన్న సౌధమందు వుండివుండవచ్చును. ఆ సౌధమును పూరిపాక అనెద వేమి?" అంటూ డాన్క్విక్ సెట్గారు వాణ్ణి నిల దీసి అడిగాడు. కాకపోయినా, యీబంటు అంతగా కావాలనుకొంటే, తనను అవమానపరచినా ఒకప్పుడు ఒప్పుకొంటాడేమోకాని, తాను త్రికరణశుద్ధిగా ప్రేమించి పూజించే డల్సీనియా రాకుమారినిగూర్చి తేలికగా పల్లెత్తుమాటఅంటే యీయన ఎంత మాత్రమూ సహించలేడు. అందుకని, డల్సీనియా అంటే ఎంతగొప్పదో వీడికి బాగా తెలిసివచ్చేదాక చెబుదామన్న పంతంకొద్దీ, "డల్సీనియా రాకుమారివంటి వుత్తమవంశసంజాత ఏ సందర్భమునను తాటిపాకలలో అడుగిడబోద"ని చెప్తూనే అటువైపు వేలుపెట్టి చూపిస్తూ, "నీ కన్నులలో గారడీ లేకున్న,

అల్లదే, ఆ కనుపించుచున్న 'భవనమే, డల్సీనియా రాకుమారి నివసించు రాజసౌధము." అన్నాడు.

"అయితే నడవండి; మరి యింకెందుకు ఆలస్యం! అది కోటే అవుతుందో, గోడగడ్డలే అవుతుందో దగ్గరకుపోయిచూస్తే తెలిపోతుందిగా! మీరు అవుననటం, నేను కాదనటం; ఎందుకొచ్చిన గొడవ యిది!" అన్నాడు శాంకోపాంజా.

ఇద్దరూ వాహనాలను ఆవైపుకే నడిపించారు. కన్నుపొడుచుకొన్నా కనిపించని ఆ కటికచీకటిలో నోరులేని జీవాలు ఆ గాడిదా, యీ గుర్రం బరువుగా కాలుదీసి కాలువేస్తూ విధిలేక ముందుకు కదలిపోతున్నాయి. ఆ'కోట' దగ్గిరపడింది. అది దగ్గిర అవుతున్నకొద్దీ డన్ క్విక్ సెట్ గారు గుర్రంమీదనే ఎగిరెగిరి చూస్తున్నాడు. తీరా దగ్గిరకువచ్చి చూస్తే, అది కోటా కాదు; గీటా కాదు. ఒక పెద్ద 'చర్చి'.

ఇది కోటేనని గంపెడు ఆశతోవున్న డన్ క్విక్ సెట్ గారికి, అది కోట కాదని తేలేసరికి కొండంత దిగులు ముంచుకువచ్చింది. ఆయనకు వున్న మతికాస్తా పోయినట్లే అయింది. ముసలిగుర్రం 'రోజినాన్టీ' కంటె మిక్కుటంగా యీ వీరుడే ముక్కైదించేసుకొన్నాడు.

శాంకోపాంజాగాడికి అసలు యీ గొడవ ఏమీ పట్టలేదు; వాడికి ఎంతసేపూ నిద్రమీదే యావ. అందుకని వాడు యీ సమయం చూచుకొని,

"అయిన శృంగభంగించాలు ; యికనైనా ఆ కనుపించే చెట్లపొదల్లోకిపోయి, కాస్త కునుకుతీద్దాంరండి. ఈ రెండుమూడుగంటలయినా నిద్రపోతే, తెల్లవారుఝామునే నేను లేచి వూళ్లోకి పోయి డల్సీనియా రాకుమారిగారి రాజసౌధం ఎక్కడవుండేదీ పదిమందినీ అడిగి గాలించుకువస్తాన"ని వాగ్దానం చేశాడు.

డాన్ క్విక్ సెట్ గారుకూడా పుట్టెడు దిగులుతో వున్న కారణం చేత, వీడు చేసిన సూచనకు చప్పున ఒప్పుకొన్నాడు. ఇద్దరూ మళ్ళీ తమ వాహనాలను వెనక్కు మళ్లించి, ఆ చెట్లపొదల్లోకి పోయారు. అక్కడ చేరీ చేరటంతోటే శాంకోపాంజా గాడిదను తీసుకొనిపోయి ఒక చెట్టుకు కట్టేసి, తానూ అక్కడే కాళ్లు బారజాపి పడుకొని గుర్రుపెట్టి నిద్రపోయాడు. డాన్ క్విక్ సెట్ గారికిమాత్రం ఎంతకీ నిద్దర రాలేదు. అలాగే, దేరామేకులా కూర్చొని, దీర్ఘంగా ఆలోచించాడు. ఆయన ఆలోచన ఒకదారికి రాకముందే తొలికోడి కూసింది. తూర్పున తెల్లరేఖలు ఆడాయి.

శాంకోపాంజా గురక ఆగిపోయింది. వాడు లేచికూర్చొని బిగ్గరగా ఆవలించి, "అయితే మరి నేను వూళ్లోకి వెళ్లి ఆవిడగారి భవనం ఎక్కడ వున్నదో వెతికి రానా?" అన్నాడు. "సరియే. శీఘ్రమే పోయిరమ్మ" అంటూ వాణ్ణి ఆశీర్వదించి పంపాడు

డాన్ క్విక్ సెట్ గారు. వాడు గాడిదనెక్కి బయలుదేరాడు.

డాన్ క్విక్ సెట్ గారిదగ్గిర సేవకావృత్తికి ఒప్పుకోకముందు వాడు అంత మందకొడి మనిషిగా వుండేవాడా! అటువంటివాడికి కూడా, యీమధ్య అయిన అనుభవాలను బట్టి, ఎక్కడ నుంచి వచ్చిందో, మనిషిలో కొంత చురుకుదనం వచ్చింది. ఇదివరకు ఎవరు ఎంత ఏడిపిస్తున్నా, వీడికేమీ అర్థం అయ్యేది కాదు. అటువంటివాడికి కూడా యిప్పుడు తన యజమానినే కాస్త ఏడిపిద్దామనే బుద్ధి పుట్టుకొచ్చింది. అందుకని ఒక మంచి పథకం వేశాడు. తన యజమాని యింతకాలం హోటల్ని పట్టుకొని కోట అనీ, గొర్రెలమందను చూసి సైన్యసమూహమనీ, మంగలిభోచ్చెను చూసి నవరత్న ఖచిత సువర్ణ కిరీటమనీ తనను బుకాయించ చూస్తున్నాడుగా. తానూ యీసారి అలాటిపనే ఒకటి చేద్దామని వీడికి సరదా వేసింది. తన యీ పథకం గనుక పారిందంటే, యికమీదట డాన్ క్విక్ సెట్ గారు తనను మాటిమాటికీ యిలా చికాకు పెట్టడనికూడా అనిపించింది.

అందుకని తొలికోడి కూయగానే నిద్దుర లేచి బయలుదేరిన శాంకో పాంజా, డల్సీనియా రాకుమారినివాసం వెతకటం మానేసి, ఆ చెట్ల తోపులోనే యింకొక మూలకు పోయి మళ్లీ పడక

వేశాడు. సరిగా నడుమువాల్చీ వాల్చకముందే పెద్దగా గురకలుపెట్టి నిద్రపోయాడు.

వీడీ వరసను హాయిగా గురకలు పెట్టి నిద్ర పోతూంటే, అవతల డాన్ క్విక్ సెట్ గాడు ఆచెట్టుకు చేరగిలబడి కూర్చొని, కళ్లు తెరుచుకొనే కలలు కంటున్నాడు. శాంకోపాంజా సరాసరి టొబోసో కోటలోకి పోయినట్లు, డల్ సీనియా రాకుమారి వాడికి దర్శన మిచ్చినట్లు, 'భీకరానన వీర శూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ గారి యోగక్షేమాలను గూర్చి ఆమె తరిచి తరిచి వాడిని అడుగుతున్నట్లు వూహాచిత్రాలు చిత్రించుకొని తెగమురిసిపోతున్నాడు.

తెల్లవారింది. ప్రొద్దుటి యెండ బాగా చురుకు ఎక్కింది. అప్పటికిగానీ శాంకోపాంజాకు మెళుకువ రాలేదు. కంగారుగా లేచి కూర్చొన్నాడు. కళ్లు తెరిచి చూసేసరికి ఆ చెట్లతోపుల్లోకి ముగ్గురు పల్లె పడుచులు గాడిదలెక్కి యిటువేపే వస్తున్న దృశ్యం ఒకటి కంటపడింది. ఇకనేం — వెంటనే 'డాపుల్' మూపున ఎక్కి చకచకా తన యజమానివద్దకు వెళ్లాడు.

"స్వామీ! ఓ నాస్వామీ! యింకే మాత్రం ఆలస్యం చేయకండి. ఆ రోజినాన్టీ జీనూ అది సరిచేసి, చప్పున గుర్రం ఎక్కి..యిలా యీ మైదానం వైపుకు వచ్చేయండి. సాక్షాత్తూ ఆ డల్ సీనియా రాకుమారిగారే మిమ్మును కలుసుకొనేందుకు తామే

స్వయంగా, యిద్దరు చెలికత్తెలను వెంటబెట్టుకొని యిటే వచ్చేస్తున్నారు" అంటూ శాంకో పాంజాగాడు పెద్దగోలగా అరిచాడు.

డాన్ క్విక్ సెట్ గారు యీ మాటలు వింటూ కూడా మనిషి కదలలేకపోయాడు. ఆ అనన్య రూపసి డల్ సీనియా రాకుమారి తనను చూడటానికి, తానే స్వయంగా వస్తున్నదని శాంకో పాంజా ఎంత నమ్మకంగా చెప్పతున్నా, ఆయన నమ్మలేకపోతు న్నాడు. అకస్మాత్తుగా విన్న ఆ సంతోషవార్తను ఆయన సరిగా ఆకళింపు చేసుకోవటానికి బాగా పది, పదిహేను నిమిషాలు పట్టింది. ఈయన మాటామంతీ లేకుండా, మనిషి బిగుసుకుపోతూవుంటే, శాంకో పాంజా తన ధోరణి ఆపకుండా "నిజంగా ఆమెగారే యిటు వస్తున్నారండీ. అంతటి అందగత్తెను నేను నా యీ పాపిష్టికళ్ళతో యింతకుముందు ఎన్నడూ చూడలేదంటే నమ్మండి. ఆహాహా! ఓహోహో! హిహీహి! ఏముందం! ఏముందం! అరెరె—ఆవిడే కాదు, ఆవిడగారి చెలికత్తెలుకూడా ఎంత అందంగా వున్నా రనుకొన్నారూ! అబ్బ! ఆ అందం నేను వర్ణించి చెప్పలేనండి. కంసాలి మూసలో కరిగించిన బంగారం వీళ్ళవంటి ఛాయముందు బలాదూర్...ఆఁ... అంతే... పైగా వాళ్ళు ఎంత విలువైన బట్టలు కట్టుకొన్నారండీ. అబ్బా! అవన్నీ నికార్సైన పట్టునరుకే. వాళ్లు పెట్టు కొన్న నగలో! బంగారపు తొడుగులే తొడు

కొన్నారండీ. వాటినిండా వజ్రవైఢూర్యాలు మిలమిలా మెరిసిపోతున్నాయి. ఈ నిరెండలో వాటి మెరుపు చూసేసరికి నాకళ్లు చీకట్లు క్రమ్మేశాయి. విరబోసుకొన్న వాళ్ళజుట్టు పిల్లగాలికి వింత వింత నృత్యాలు చేస్తూ ఎంత మనోహరంగా వున్నదనుకొన్నారూ? ఇన్ని మాటలెందుకండీ! నాకంటికి వాళ్ళు కాంతికిరణాలలా కనిపించారంటే మీరు నమ్మి తీరాలి. వాళ్ళు ఎక్కివస్తున్న వాహనాలైనా ఎటువంటివి? ఫక్తు నిత్యకళ్యాణులు!"

ఇప్పటికి డన్ క్విక్సెట్ గారు కొంచెం తేరుకొని, వాడి మాటలకు అడ్డువచ్చి "నిత్యకళ్యాణులేమిటి? పంచకళ్యాణులు కాబోలును." అన్నాడు.

"నిత్యకళ్యాణో, పంచకళ్యాణో ఏదైతే ఏమండీ! ఆ రెంటికీ పెద్ద చెప్పుకోదగిన వ్యత్యాసం ఏమీ లేదు... ఏమైనా, మీరుమాత్రం వెంటనే మీ ముసలిగుర్రాన్ని ఎక్కి కూర్చోండి" అంటూ శాంకో పాంజా ఆయనను తెగ తొందర చేశాడు. "ఒక క్షణమైనా ఆలస్యం చేశారంటే డల్సీనియా రాకుమారిని కలుసుకొనే అదృష్టం పీసమంత వాసిలో తప్పిపోతుందని కూడా హెచ్చరించాడు.

ఇకనేం—యిద్దరూ ఆ చెట్లతోపుకు అడ్డం పడ్డారు. కొద్దినిమిషాలలోనే ఆ ముగ్గురు వనితలూ వీళ్లకంటపడ్డారు. శాంకోపాంజా సంబరాలు పడుతూ,

"అరుగో ! అరుగో ! వాళ్లే!! ఆ వస్తున్న వాళ్ళే!!!"
అంటూ లొట్టలు వేశాడు.

డన్ క్విక్ సెట్ గారు మాత్రం నీరుకారి పోయాడు. వాడు అంతగొప్పగా వర్ణించి చెప్పిన దానికి, యిప్పుడు తనకళ్లతో చూస్తున్న దానికీ ఎక్కడా పోలికే కాకుండా పోయిందామెను ! ఎవరు మాత్రం ఏం చేస్తారు ; నీరుకారిపోకుండా ! ఎట్లాగో గొంతు పెకలించుకొని "శాంకో ! నీవు వర్ణించిన ఆ అందాలభరిణెలు, ఆ పట్టుపీతాంబరములు, ఆ వజ్ర వైఢూర్యములు, ఆ పంచకళ్యాణులు, వీనిలో ఏ ఒక్క వస్తువునూ నాకంటికి అగుపించుటలేదేలనోయీ ! నాకట్టెదుర కనుపించువారు ముగ్గురు సాధారణ స్త్రీమూర్తులు. పైగా వారు ఎక్కివచ్చుచున్నవి అశ్వములైనను కావే ? అవి కేవలము గార్దభముల వలె తోచెడినే !" అంటూ ఆశ్చర్యం వెళ్లబెట్టాడు.

ఈమాటలు వినటంతోటే నమ్మరానివిషయం ఏదో జరుగుతున్నంత యిదిగా ముఖకవళికలన్నీ మార్చేసి, శాంకోపాంజా "ఏమన్నారూ ! అయితే మీకు నిత్యకళ్యాణి... కాదుకాదు పంచకళ్యాణి నెక్కి వస్తున్న డల్ సీనియా రాకుమారిగారే కనుపించటం లేదంటారా !" అని అడిగాడు. అంటూనే ఆ ముగ్గురు పడుచుపిల్లల్లో ఒకామెకు దగ్గరగా పోయి, ఆమె ఎక్కి వున్న గాడిద కళ్లేన్ని పట్టుకొన్నాడు. ఆ గాడిద తక్కున ఆగిపోయింది. శాంకోపాంజాగాడు ఆమె



పాదాలదగ్గిర మోకరిల్లి "ఓ డల్‌సీనియా రాకుమారీ! ఈ 'భీకరానన వీరశూరాగ్రేసరుడు' డాన్‌క్విక్‌సెట్‌గారూ, ఆయన అనుంగుభృత్యుడు శాంకో పాంజానైన నేనూ, మీ దివ్యపాద పద్మములసన్నిధికి వచ్చివున్నాం. మాపై మీ కటాక్షవీక్షణాలు ప్రసరించనీయండి." అంటూ బ్రతిమలాడడం మొదలు పెట్టాడు. ఈలోగా డాన్ క్విక్ సెట్ గారు కూడా ఆ చోటికి వచ్చి, తనూ ఆమెపాదాలవద్ద మోకరిల్లాడు. అలా మోకరిల్లాడన్నమాటే కానీ, ఆయన ముఖం

మాత్రం ఏదో అనుమానంతో బాధపడుతున్నట్లు ముడుచుకుపోయి వున్నది.

వీళ్లిద్దరి తీరు యిలా వుంటే, ఆగాడిదమీద ఎక్కివున్నయువతి పల్లెభాష లంకించుకొని "ఇదేంది! ఎక్కడి మడుసులు మీరు? గాడిదకాళ్లకు అడ్డొస్తా రేం? లెగండి; లెగండెహె" అంటూ కోపంగా తిట్లు గుమ్మరించింది. నోరువిప్పి మాట్లాడేంత వరకూ యీవిడ నిజంగానే డల్‌సీనియా రాకుమా రేమోననే అనుమానం డాన్ క్విక్‌సెట్‌గారి బుర్రలో ఒకమూల మెదులుతునే వున్నది. అది కాస్తా, యీ తిట్లతో తుడిచిపెట్టుకుపోయింది. శాంకోపాంజా వైపుకు తిరిగి "చూచితివా శాంకో! లోగడ మన వీరవిహారములందు ఏ మాంత్రికుడు మనలను పరాభ వించెనో, ఆ మాంత్రికుడు యింకనూ మనలను వీడక యున్నాడు కదా! ఆ మాంత్రికు డెవ్వడో కాని, మన పంచేంద్రియముల నీ తెరగున బంధించి మనల మోసగించుచున్నాడు. ఆ అందాలరాసి ఆ ముత్యాల కోవ, డల్‌సీనియా రాకుమారిని చూడవలసిన యీ కన్నులకు, యీ ముదివాపసాని కనిపించుచున్న దన్న, యిది అంతయూ ఆ మాంత్రికుని ప్రభావమే కదా! ఇందిసుమంతయు సందియము లేదు." అంటూ తెగ నిట్టూర్పులు విడిచాడు.

వీళ్ల ధోరణి చూస్తున్నకొద్దీ ఆ పల్లెపడుచుకు పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వు వచ్చింది. "సే యీది

బాగోతం ఏశాలుమాని గమ్మునుండవయ్యా! మొగాడా" అంటూ పిల్లని విదిలించి పారేసి, గాడిద డొక్కలో ముల్లుకర్రతో పొడిచింది. ఆముల్లుకర్ర పోటుతో దానికి ఎక్కడలేని కోపం వచ్చేసింది కోపం కొద్దీ అది తెగ గెంతేసింది. హద్దుమీరి అది వేసిన గంతులకు, పాపం, ఆ పడుచు క్రింద పడిపోయింది. ఈవిడే డల్సీనియా రాకుమారి ఏమో అని యింతసేపూ అనుకొంటూ వున్న డాన్ క్విక్సెట్ గారికి యీపిడ పాటును చూస్తుంటే, బాధ పుట్టుకొచ్చింది. ఇక మరేమీ ఆలోచన లేకుండా దబదబా ఆవిడ పడివున్న చోటికి పరుగెత్తుకొని పోయాడు. ఈయన అంత హడావుడి పడి పరిగెత్తటమైతే పరిగెత్తాడు కాని, ఆ పడుచు ఎవరి సహాయం అక్కర లేకుండానే, క్రిందపడ్డ మనిషి మళ్లీ లేచినిల్చొని, చేతికందకుండా పరుగెత్తాలని చూస్తున్న గాడిద తాలూకు రెండు చెవులూ రెండు చేతులతోనూ పట్టేసుకొని, కసికొద్దీ దాని ముట్టెపైన వేలకేసి బాది, దానికి బుద్ధివచ్చిందని తోచాక, దాని వీపుమీద ఎక్కికూర్చొని ముందుకు ప్రయాణం సాగించింది. తన సాహసకత్తెల నిద్దరిసీకలుపుకొన్నది. ముగ్గురూ కలిసి పగలబడినవ్వుకొంటూ, మాటిమాటికి వెనక్కి తిరిగిచూసి పిల్లను వెక్కిరిస్తూ, వాళ్లదారిని వాళ్లు వెళ్లిపోయారు.

'భీకరానన వీరశూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ గారు డల్ సీనియా రాకుమారిని కలుసుకోనేఘట్టం యీ తీరుగా ముగిసిపోయింది. నిజంగానే డల్ సీనియా రాకుమారి తన ఎదుటకు వస్తే, ఆమెను తను కన్నులార చూడనీయకుండా చేసిన ఆ మాంత్రికుని తెగ తిట్టుకొంటూ డాన్ క్విక్ సెట్ గారు, ముఖం వేలవేసుకొని 'సారగొస్సా' ప్రాంతంవైపుకు గుర్రాన్ని పోనిచ్చాడు. శాంకోపాంజా పైకి ఎంత దిగులుగా వున్నట్లు కనుపిస్తున్నా, లోపలలోపల మాత్రం తన యజమానికి జరిగిన శృంగభంగానికి తెగమురిసిపోతున్నాడు.

## 11

ఆ స్వామీ, యీ బంటూ అలా ఆ 'సారగొస్సా' ప్రాంతంవైపు ప్రయాణమైపోయారా! ఆట్టే దూరం పోకముందే అతి విచిత్రమైనగుంపు ఒకటి, బండిమీద వస్తూ, వీళ్లకు తారసిల్లింది.

డాన్ క్విక్ సెట్ గారి కంటికి మొట్టమొదటి సారిగా ఆనిన ఆకారం, ఒక మానవ కంకాళం. కదులుతున్న ఆ అస్థిపంజరానికి ముఖంమీద మాత్రం మామూలుగా మాంసం, చర్మం అన్నీ వున్నాయి. మిగిలిన వొళ్లంతా ఎముకలు తప్ప మరేమీ లేదు. ఈ ఆకారానికి వెనకవైపుగా రంగురంగుల రెక్కలు వున్న దేవతామూర్తి కదులుతున్నది. ఆ రెక్కలు

భాగా రెండుమూడు బారలపొడుగున వెన్ను వెనకాల వేళ్లాడుతున్నాయి. వీళ్లిద్దరూ ఎక్కివున్న బండిలోనే అటువైపుగా అంత పెద్ద బంగారు కిరీటం నెత్తిమీద పెట్టు



కొనివున్న చక్రవర్తిగారెవరో మహాఠీవిగా కూర్చొని వున్నాడు. ఆయనగారి పాదపద్మాల సన్నిధిని, కుర్ర గుంటడొకడు పూవులబాణాలు, చెరుకుగడవిల్లంబు

ధరించి బాలమన్మథుడిలా కూర్చున్నాడు. వీళ్లు నలుగురేకాకుండా, పంచవర్ణాలతురాయి ధరించిన వీరుడొకడున్నాడు. ఇంకా కొంతమంది యిలాంటివారే ఏవేవో అడ్డదిడ్డమైన బట్టలు కట్టుకొన్నవాళ్లు కూడా వున్నారు.

దెయ్యాలు, దేవతలు, చక్రవర్తులు, యిలాంటి వాళ్లు ఎదురైతే డాన్ క్విక్ సెట్ గారి వుత్సాహానికి కొదవేమిటి? అందరినీ ఒక్కదెబ్బతో ఓడించేసి, భూలోక, భువర్లోక, సువర్లోకాల్లో తనను మించిన వీరుడు మరొక్కడు లేడని ఋజువుచేసే అవకాశంవచ్చి పడిందికదా అని సంబరాలు పడ్డాడు.

వాళ్లంతా ఎక్కిన ఆ బండి బాగా దగ్గరకు వచ్చాక బండితోలుతున్న వాడిని 'నిలువుము అందే' అని హెచ్చరించాడు. ఆ బండివాడైనా మామూలు మనిషికిమల్లే లేడు. లోకంలోవున్న చీకటిఅంతా యీతని అదుపు ఆజ్ఞల్లోనే నడుస్తున్నదా అనిపించేటట్లు, తానే ఆ చీకటికి రాజైనట్లూ కనిపిస్తున్నాడు. వాడు ఎందుకనో బండిని పక్కన ఆపేశాడు. "మీరెవరు? ఎందుకోవుచున్నారు?" అంటూ డాన్ క్విక్ సెట్ గారు వాణ్ణి గద్దించి అడిగాడు. అందుకు సమాధానంగా వాడు, తామందరూ ఒకటి వేషగాళ్లమని, పొరుగూరిలో నాటకం ఆడటానికి పోతున్నామని చెప్పాడు.

వీళ్లు నిజంగానే దేవతలు, దెయ్యాలూ, చక్రవర్తులని యింతసేపూ నమ్మి, యిప్పుడు వాళ్లు అవేవీ కాక, కేవలం పగటివేషగాళ్లేనని తేలేసరికి డాన్ క్విక్ సెట్ గారి వుత్సాహం కొంతవరకు చప్పబడిపోయింది. "ఏమేమీ! పగటిబాగవతులా మీరు?...ఐన మీదారిని మీరు పోవచ్చును...ఈ భీకరానన వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారికి పగటివేషములన్నను, వీధిభాగవతములన్నను ఉత్సాహము మెండు. మీరేదైన సహాయము పేక్షించుచో, యీ వీరుడు చేయ సంసిద్ధుడుగానున్నాడు" అంటూ నడ్డి ముందుకు వంచి, చేయిబారజాపి చెప్పాడు.

ఈలోగా, కేతిగాడి వేషం వేసుకొన్న పగటి భాగవతుడొకడు, కర్రకు కట్టిన మూడు రబ్బరు బెలూనులు పుచ్చుకొని, డాన్ క్విక్ సెట్ గారు ఎక్కివున్న ముసలిగుర్రం 'రోజినాన్టీ' కళ్లముందు ఆడించాడు. కదులుతున్న యీ రంగుల బెలూన్లను చూచి, ఆ గుర్రం బెదిరిపోయింది. ఆ బెదురుకొద్దీ అది ఒక చేదాటులంకించుకొంది. అంతలావు రౌతు అలా వీపు మీద కూర్చొనివుండగానే, ఆయన వున్న లక్ష్యమైనా లేకుండా, తెగగింజుకొంటూ గింజుకొంటూ పరుగులు తీసింది ఒకవంకను తను పడిపోకుండా చూసుకొంటూనూ, యింకోవంకను ఆ గుర్రాన్ని అదుపులోకి తెచ్చుకోవటంతోనూ డాన్ క్విక్ సెట్ గారు సద మదమౌతున్నాడు.

ఎప్పుడైతే తన స్వామి ఎక్కినగుర్రం అదుపులోకి రాకుండా వెర్రిగంతులు ఎత్తి పరిగెత్తటం ప్రారంభించిందో, అప్పుడే, ఆయనగారి ప్రాణానికి ఏక్షణాన ఏ ముప్పువస్తుందోనన్న ఆత్రంకొద్దీ శాంకోపాంజా తానూ తన గాడిద 'డపుల్' మూపున ఎక్కి ఆవైపుకే దాన్ని పరిగెత్తించాడు. ఎంత పరిగెత్తించినా, అవతల ఆ 'రోజినాన్‌టీ' పరుగులతో అలిసిపోయి, నురుగులు కక్కుకొంటూ, నేలమీదపడ్డాక కాని, వీడు ఆయనను అందుకోలేకపోయాడు. వీడక్కడికి చేరేలోగా 'రోజినాన్‌టీ' తాను పడిపోవటమే కాక, తన వీపుమీద ఎక్కి కూర్చొని మెడమీద జూలుపట్టుకు పీకుతున్న డాన్ క్విక్ సెట్ గారినికూడా విసిరి కిందపారేసింది. ఆయన అంతపాటుపడినందుకు శాంకో పాంజా గుండెలు గతుక్కుమన్నాయి. గబగబా గాడిదవీపు మీదనుంచి దిగేశాడు. వాడు సాంతం ఆయన పడివున్నచోటికి చేరుకొనేలోగానే, యిందాకటి ఆ కేతిగాడు పరిగెత్తుకొంటూవచ్చి, 'డపుల్' మూపున ఎక్కి కూర్చొని, దానికళ్లముందుకూడా ఆ రబ్బరు బెలూనులు ఆడించాడు. అది అసలే పిరికిజంతువేమో, యిక అదే పరుగు! ఆ గాడిద పరిగెత్తే విసురూ, వేగం చూస్తుంటే దానికాళ్లు అసలు నేలకు ఆనటమే లేదేమో అనిపించింది.

శాంకోపాంజాకు పెద్ద సమస్య పట్టుకొంది. తాను నమ్మిన ఆ స్వామిని ముందు లేవదీయాలా?

లేక తనను నమ్మిన ఆగాడిదవిషయం ముందుగా చూడాలా?——ఎంత ఆలోచించినా వాడికి ఎటూ పాలుపోలేదు. చివరకు ఏదైతే అదే అవుతుందని ముందుగా తనస్వామిని లేవదీసికూర్చోబెట్టటానికే నిశ్చయించుకొన్నాడు

ఆయనగారు పడివున్న చోటికి పోయి, ఆయన భుజాలక్రిందికి తన అరచేతులు రెండూ పోనిచ్చి, పంపాదిగా ఆ శరీరాన్ని పైకి లేవనెత్తటానికి ప్రయత్నించాడు. ఆయనగారి వెన్ను మళ్లీ వాలిపోకుండా తన చేతులతో భూమికి జోటుపెట్టాడు. ఆ భంగిమలో వుండగానే "స్వామీ! స్వామీ! ఈ దారుణం చూచారా! ఆ 'అడ్డగాడిద' నా గాడిద నెక్కి వుడాయించాడు; చూశారా?" అంటూ శాంకో పాంజా ఫిర్యాదు చేశాడు.

పట్టుకుపోయిన కీళ్లను సరిచేసుకొంటూ, రోజినాన్టీ మీద ఎక్కబోతున్న డాన్ క్విక్సెట్ గారు "అడ్డగాడిద ఎవరు?" అని అడిగారు.

"వాడేనండీ! వాడే——ఆ రబ్బరుబెలూన్లు ఆడించి మిమ్మల్ని, మీ గుర్రాన్ని ఝడిపించిన ఆ బఫూన్ లేడూ? వాడే! నా గాడిదను కాస్తా కైంకర్యం చేశాడు అదుగో...అటు చూడండి." అంటూ శాంకో పాంజా ఆవైపుకు చూపెట్టాడు

"ఆః! ఏమేమి! త్వదీయగార్దభము నే హరించ సాహసించెనుగా! వానికి చేటుకాలము దాపురించినది. ...ఈ ముయ్యేడు లోకములలో వాడు ఎందు దాగి

ననా, ఒక్క వ్రేటున వాని మూర్ధమును వెయ్యి ముక్కలుగా బ్రద్దలుగొట్టి, నీ 'డపుల్‌ను' నీకిదే తెచ్చియిచ్చువాడ!" —డాన్ క్విక్ సెట్ గారు యింకా ఏవేవో అరుపులు అరుస్తున్నాడు.

ఈయనగారి యీ బీరాలు సాంతం అయ్యేలోగానే, అక్కడ ఆ గాడిద రెచ్చిపోయి, వీపుమీద ఎక్కి స్వారీ చేస్తున్న బఫూన్‌ను విసిరి కింద పారేసింది. క్రింద పడ్డవాడు బంతివలె పైకి లేచి, కాళ్లమీద నిలబడ్డాడు. అప్పటికి వాడికి బుద్ధివచ్చింది. దాని యిష్టం వచ్చినంత సేపు ఆ గాడిదను ఎగురనిచ్చి, తాను మాత్రం పకపకా నవ్వుకొంటూ కాలినడకనే బయలుదేరి వచ్చి, తమ ముఠావాళ్లుపోతున్న బండిని కలుసుకొన్నాడు.

శాంకో పాంజా దబదబా పరుగెత్తుకొంటూ పోయి, గంతులేస్తున్న గాడిద కళ్లెన్ని ఎలాగైతే నేం పట్టుకొని, దాన్ని కాసేపు సరితీశాడు. పోయిందనుకొన్న గాడిద తిరిగి వచ్చినందుమాత్రంతో డాన్ క్విక్ సెట్ గారికి చాగలేకపోయింది తననూ. తన బంటునూ, ఆ 'రోజినాన్‌టే'ని, ఆ 'డపుల్'ను యింతగా వేధించిన యీ పగటివేషగాళ్ళ భరతం పట్టితే కాని, ఆయనగారి కసి తీరేటట్టు లేదు. పళ్లు బిగపట్టి, ఆ భాగవతుల బండి పోతున్నవైపుకే తన గుర్రాన్ని పోనిచ్చాడు. అప్పటికప్పుడే చాలాదూరం పోయిన బండిని ఎల్లాగయితే నేం కలుసుకొని, 'ఖడేరావ్' అన్నాడు. ఈయన మాటలు లెక్కచేయు

చూడా, బండి ముందుకు పోతుంటే "భీకరానన వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు ఆగమనిన ఆగక నే పోవుచున్నారే! ఏమీ, మీ కండకావరము? వీరులనట ఎట్లు ప్రవర్తించవలెనో మీకిదే ఎరుక పరిచెదగాక! అందే నిలువుడు!" అంటూ పెడబొబ్బలు పెట్టాడు.

ఈ గావుకేకతో, పోతూ పోతూవున్న బండి తక్కున ఆగిపోయింది. బండిలోనుంచి ఆ కంకాళం, చక్రవర్తి, మన్మథుడు అందరూ దూకి యివతల పడ్డారు. ప్రతి ఒక్కడూ చేతికందిన రాయినల్లా పట్టుకొని డాన్ క్విక్ సెట్ గారిమీదకు విసరటానికి సంసిద్ధంగా వున్నారు.

నిజంగా అటువంటి స్థితిలోనే గనక, డాన్ క్విక్ సెట్ వాళ్లతో యుద్ధానికి తలపడితే, ఆయన గారి ఒళ్లు ఎన్ని తూట్లుపడేదో చెప్పలేం. వాడి పుణ్యమా అని, ఆ శాంకోపాంజాగాడు, జరుగబోయేది పసిగట్టి, రొప్పుకొంటూ రోజుకొంటూ పరిగెత్తుకువచ్చి, అవతల వాళ్లు అంతమంది వుండగా తా మిద్దరూ వాళ్లతో పోట్లాడి నిభాయించుకు రాలేమని నచ్చజెప్పబోయాడు. వాళ్ల చేతుల్లోవున్న ఒక్కొక్క కంకరరాయికీ ఎన్నెన్ని మొనలున్నాయో, అలాటి మొనలుగల రాళ్లు వచ్చి తగిలితే మనిషి అన్నవాడి వొంటిమీద ఎంతెంత లోతుగా గాయాలు తగులుతాయో వివరించి చెప్పాడు.

ఆవేశాలు యింతవరకూ పెరిగాక అర్ధాంతరంగా యుద్ధాన్ని విరమించటానికి వీడు చూపెట్టే కారణాలు ఏమంత బలవత్తరమైనవిగా డాన్ క్విక్ సెట్ గారికి తోచలేదు. వీడు ఆ ధోరణిలో నేను చెప్పినా, లక్ష చెప్పినా అయన లక్ష్యపెట్టేట్లు లేడు. ఈ ప్రమాదం ఎలా తప్పించాలో అర్థంకాక, శాంకోపాంజా నానా యాతన పడుతున్నాడు. అలా ఎన్నో యాతనలు పడగా పడగా, వాడి బుర్రలో ఒక ఆలోచన మెరుపల్లే మెరిసింది చేటంత ముఖం చేసుకొని "అన్నట్లు, స్వామీ! వీళ్ళందరూ పైకి పెద్ద చక్రవర్తుల్లాగా, వీరుల్లాగా వేషాలు వేసుకొనివున్నారే కానీ, నిజంగా చక్రవర్తులూ కాదు; చక్రబండలూ కాదు. కేవలము అల్పమానవులు. మీలాంటి వీరవర్గానికి చెందిన వ్యక్తితో కత్తికట్టి యుద్ధం చెయ్యగల అర్హత యింతమంది పరటి భాగవతులలోనూ ఏ ఒక్కడికీ, మచ్చుకైనా లేదుకదా! ఇలాంటి నీచమానవులను మీరు కన్నెత్తి చూడవద్దు, పన్నెత్తి పలుకరించవద్దు. రండి మనదారిని మనం పోదాం!" అన్నాడు.

"సెహబాస్ శాంకో! నీవు వచించిన దానిలో పరమార్థమెంతేని కలదు. నేను వీరుడననీ, వీరు అల్పమానవులనీ మంచి సమయమునకే జ్ఞాపకము చేసితివి. నిజమే! నావంటి వీరుడు యిట్టి నీచమానవుల జోలికి పోరాదు. నేనట్లు పోబోనని కూడా

లోగడ బాసచేసి యుంటిని కదా! అంతియెకాక, యిట్టి నీచమానవులతో వ్యవహరించవలసిన అవసర మేర్పడినప్పుడు, వీరకంకణము కట్టుకొనని నీవే, నీ యిచ్చవచ్చినట్లు వారిని హతమార్చవచ్చునని కూడా లోగడ సెలవిచ్చియుంటిని కదా! ఈ ముష్కరులు నీవాహనమును అపహరింప ప్రయత్నించి నందుకు, నీవే వారిపై పగదీర్చుకొనుము" అంటూ ఆ శాంకోపాంజాగాణ్ణి వాళ్ళమీదకు వుసికొలుపుదా మని ఎంతగానో ప్రయత్నించాడు.

వీడికి పౌరుషం తెప్పించాలని ఆయన ఎంత ప్రయత్నంచేస్తేమాత్రం ఏంప్రయోజనం! వా డిది వరకే చెప్పేశాడు; తాను ఎవళ్ళజోలికీ పోయే తరహా మనిషినికానని, ఎవడైనా తనకు అపచారంచేసినా కూడా, వాడి మానాన వాణ్ణి వదిలెయ్యటమే తన మతమనికూడా చెప్పాడు. తనకు సహజంగావున్న ఆ పిరికితనాన్ని బయటపెట్టకుండా, తాను ఏసుక్రీస్తుబోధలను ఆచరణలో పెడుతున్నా నన్నాడు. ఎవడైనా దురుసు స్వభావంగల వ్యక్తి కుడి చెంపమీద చాచి కొట్టితే, ఎడమచెంపనుకూడా వాడికి అందించటమే తనపని అని పేర్కొన్నాడు. తనకు ఎవడు ఎంత ఎగ్గుచేసినా వాణ్ణి మన్నించి మిన్నకుం డటమే తన బుద్ధివిశేషమన్నాడు.

వాడు యిన్నిరకాలుగా చెప్పినమీదట, డాన్ క్విక్ సెట్ గారు "అట్లయిన సరియే! వారిని కని

కరించి వదలివేయుదము. ఇంతకంటెను చెప్పకో దగినవారెవ్వరైన తారసిల్లవచ్చును; రమ్ము; ఆ దిశ బోవుదము." అంటూ తన గుర్రాన్ని గిరున తిప్పాడు.

అంతమందితో తానొక్కడూ తలపడవలసిన అగత్యం తప్పినందుకు సంతోషిస్తూ శాంకోపాంజా కూడా తన గాడిదను ఎక్కి, స్వామిపోయిన మార్గాన్నే అనుసరించాడు. వీళ్లిద్దరూ యిలా వెన్ను చూపించి మళ్లి పోయినందుకు సంతోషించి, ఆ పగటివేషగాళ్లు కూడా బండియెక్కి, వాళ్ల దారిని వాళ్లు పోయారు.

## 12

ఆ రాత్రికి శాంకోపాంజా, డాన్‌క్విక్‌సెట్ యిద్దరూ ఒక చిట్టడవిలో విశ్రమించారు. వీళ్లు యిద్దరూ కబుర్లాడుకొని పడుకొన్నాక ఆట్టేసేపు కాకముందే, డాన్ క్విక్ సెట్ గారికి మెళుకువ వచ్చేసింది. ఆయన పడుకొన్న చెట్టుకు కొద్దిదూరంలో ఏవేవో చప్పుళ్లు అయినాయి. వాటితో యీాయన అదిరిపడిలేచి కూర్చొన్నాడు. ఆ శబ్దాలు వినవచ్చిన వైపుకే చెవి ఒగ్గి పరీక్షగా విన్నాడు; కళ్లు పగల తీసుకు చూశాడు.

ఆచీకట్లో చెట్లమధ్యను గుర్రాలెక్కిన మనుష్యులు యిద్దరు కదులుతున్న చప్పుడు అయింది. డాన్ క్విక్ సెట్‌గారు వాళ్లంతా కళ్లు చేసుకు

చూశాడు. ఆ ఆగంతుకులలో ఒకడు గుర్రంమీద నుంచి దిగి "గుర్రం దిగు చేస్తాం. ఇక్కడ కాసేపు విశ్రమిద్దాం, మన గుర్రాలను మేతకు వదిలేద్దాం." అంటూ రెండోవాడికి సూచనచేశాడు. ఆ వాక్యం పూర్తి అయ్యీ కాకముందే, గడ్డిమీద వెల్లకితలా పడుకొన్నాడు. మరి ఆ వ్యక్తి ఎవరో ఏమో కానీ, ఆయన అలా నేలమీద పడుకు వాల్చినప్పుడు వుక్కుకవచం ఖంగున మ్రోగింది.

అప్పుడే అనుమానం తగిలింది డాన్ క్విక్సోట్ గారికి— యీ ఆగంతుకుడుకూడా తన మాదిరిగానే ఒక వీరుడైవుండాలని. అందుకని గురకలు పెట్టి నిద్ర పోతున్న శాంకోపాంజాను తట్టి కొట్టి నిద్దుర లేపి కూర్చోబెట్టి యిలా ఎవరో వచ్చారని, వారెవరో వీరుల్లాగున్నారని చెప్పాడు. వీళ్లిద్దరూ యీమాటలు మాట్లాడుకొంటూ వుండగా, అవతల వ్యక్తి ఏదో వాయిద్యాన్ని పైకి తీసి తీగెలుమీటి శృతులు సవరించాడు. శృతులన్నీ సరిగా కుదిరాక, గొంతెత్తి బిగ్గరగా ప్రేమగీతాలు పాడాడు. పాటతోపాటు వాయిద్యం వాయించాడు. ఒకటితరువాత మరొకటిగా పది ప్రేమగీతాలు ఆలాపించి ఆలాపించి, విలాపధోరణిలో "హా! దేవతాస్వరూపిణీ; ఓ 'కసిల్డియా—డి—వాన్ డాలియా' కన్యా! ఎంత కాలమని నీకై యీరీతిని నేను కృశించి నశించి పోగలను? 'లామంచా' యందలి వీరులందరి చేతను

నిన్నుమించిన సౌందర్యరాశి లేదని ఒప్పించివున్నాను కదా! అయిననూ నీకు నాపై కరుణరాదుగదా! ఇంకా ఎంతకాలం నన్ను యిలా దూరంచేసి హింసిస్తావు!" అంటూ బిగ్గరగా స్వగతం పలుక నారంభించాడు

అవతల ఆ వీరుడు "'లామంచా' వీరులందరి చేతనూ ఒప్పించానే" అని అంటూవుంటే డాన్ క్విక్ సెట్ గారి వొళ్లు కోపంతో వుడుకెక్కిపోయింది. శాంకో పాంజా చెవికి యింకా దగ్గరగా జరిగి "ఎవరీ వదరుబోతు! 'లామంచా' వీరులందరినీ ఓడించితినని ప్రగల్భములు పలుకుచున్నాడేమి? ఈ భీకరానన వీరశూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు 'లామంచా' గ్రామమునకు చెందినవారు కాదనియూ యీతని తాత్పర్యము? నా బొందిలో ప్రాణమున్నంతవరకును డల్ సీనియా రాకుమారిని మించిన అందగత్తె వేరెందునూ వుండరాదని చాటిచెప్పుటయేకదా నా పరమ ధర్మము. అట్టిచో యీ ముష్కరాధము డెవ్వడో యిందు చేరి 'కసిల్ డియా—డి—వాన్ డాలియా' అను నెవ్వతెయో కలదని, దానినిమించిన అందగత్తె మరెవ్వరూ లేదని ప్రగల్భము పలుకుచున్నాడేమి? ఆ పేరుకలది మానవియో, ప్రమాకోకూడ నే నెరుగ నైతినే!" అంటూ అంగలార్చాడు.

వీళ్లనుకొనేమాటలు అవతల ఆ వీరుడికి విని పించినట్లున్నాయి. "ఎవరక్కడ? పీడితమానవులా? సుఖసంతుష్టులా?" అంటూ అదలించాడు.

"మేము పీడితమానవులమే" అంటూ డాన్ క్విక్ సెట్ గారు సమాధానమిచ్చాడు.

"అట్లయితే యిటు రండి." అంటూ అవతలి వీరుడు వీళ్లను ఆహ్వానించాడు.

కన్ను పొడుచుకొన్నా కానరాని ఆ చీకట్లోనే డాన్ క్విక్ సెట్, శాంకోపాంజా తడుముకొంటూ తడుముకొంటూ ఆ వీరుడున్న చోటికి పోయారు. మనుష్యులైతే కనుపించడంలేదు కానీ, అలికిడినిబట్టి ఎవరు ఎక్కడ వున్నదీ గుర్తుతెలుసుకొన్నారు. తన లాటి వీరుడే ఒకడు అర్ధరాత్రివేళ అకస్మాత్తుగా తారసిల్లినందుకు డాన్ క్విక్ సెట్ గారు వుప్పొంగిపోయారు. చేతులుజాపి ఆయనను కౌగలించుకొని, కరస్పర్శాదికాలన్నీ చేశాడు. ఇద్దరూ ఆ చెట్లగుబురుల్లో చతికలబడి లోకాభిరామాయణం మొదలుపెట్టారు.

(ప్రస్తుతానికి ఆ వీరుడికి అడవి వీరుడన్న పేరు పెట్టుదాం-) ఆ అడవివీరుడు వుండివుండి ఒక్కమాట అన్నాడు. ఆ మాటతో డాన్ క్విక్ సెట్ గారు నిప్పు తొక్కిన కోతికిమల్లే గంతులేశాడు. అడవివీరుడు తన ప్రతాపాన్ని గురించి చెప్పుకొనే సందర్భంలో 'ఆ వీరుణ్ణి ఓడించాను, యీ వీరుణ్ణి ఓడించాను' అంటూ, పేరు మోసిన ఆ లామంచావీరుడు డాన్ క్విక్ సెట్ గారిని సైతం హతమార్చేశానని అనేశాడు. డాన్ క్విక్ సెట్ అంతటి వీరుడిచేత 'కసిల్ డియా - డి-వాన్ డలియా'

కన్య డల్ సీనియా రాకుమారిని మించిన అందగత్తె అని ఒప్పించానని కూడా చెప్పాడు. ఎంతటి సాహసం!

ఇక అంతటితో ఆ అడవివీరుణ్ణి ధోరణి కట్టిపెట్టమని "అయ్యా! ఓ వీరుడా, 'లామంచా' గ్రామానికి చెందిన ప్రఖ్యాతవీరుడును, భీకరానన బిరుదాంకితుడును అయిన ఆ డాన్ క్విక్సెట్ నేనే. ఇంతకుముందెన్నడు కానీ నేను నీతో యుద్ధము చేసియుండలేదు. లోగడ నీవు జయించితినని చెప్పుచున్న ఆ డాన్ క్విక్సెట్ ఎవడో నా పేరుపెట్టుకొని నిను మోసగించి యుండవచ్చును. ఆ డల్ సీనియా రాకుమార్తెను మించిన అందగత్తె మరొకతె కలదని నేను యింతకుముందు ఎన్నడును ఒప్పుకొని యుండలేదు; యిప్పుడు ఒప్పుకొనుటలేదు; యికముందు ఎన్నటికినీ ఒప్పుకోబోవుటలేదు. ఈ యంశముపై నీకు అంత పట్టుదలగా వున్నచో రేపు ప్రాతఃకాలమే మనమిరువురము కలహించెదముగాక! అందు నీవు జయించితివేని, నీవనిన ప్రకారమే ఆ డల్ సీనియా రాకుమారికంటెను నీ 'కసిల్ డియా - డి - వాన్ డలియా' కన్యయే అందగత్తెయని నేను ఒప్పుకొందును. నేనే నిన్ను జయించినచో నీ 'కసిల్ డియా' కన్యనుగూర్చిన అతిశయోక్తులను వుపసంహరించుకొని, నా శరణు వేడవలయును." అంటూ డాన్ క్విక్సెట్ గారు సవాలు చేశాడు. ఆ అడివివీరుడుకూడా 'సై' అంటే 'సై' అన్నాడు. రేపు ప్రొద్దున సూర్యోదయం కాగానే కత్తి

పట్టుకొందామని యిద్దరూ నిర్ణయించుకొని అప్పటికి మాత్రం మామూలుగా కబుర్లు కానిస్తున్నారు.

ఇక్కడ యీ వీరులు యిద్దరు యీ వరసను మాటలలో క్రిందామీదా పడుతూవుంటే, అక్కడ శాంకోపాంజాగాడికీ, ఆ అడివి వీరుడివెంట వచ్చిన బంటుకూ కొద్దిక్షణాలలోనే విపరీతమైన చనువు ఏర్పడిపోయింది. వాళ్ళకు తోచినమాటలు వాళ్ళు ఏవేవో చెప్పుకొంటూ యిద్దరూ తమ యజమానులకు కొద్ది దూరంలో పడుకొన్నారు. ఎప్పుడు పట్టిందో, యిద్దరికీ ఒక్కసారిగా నిద్దురపట్టేసింది.

తూర్పున తెల్లరేఖలు ఆడుతుండగా అందరి కంటేముందు శాంకోపాంజాగాడికే మెళుకువ వచ్చింది. ఆ గుడ్డివెలుతురులో వాడెందుకో యిటువైపు తిరిగి చూస్తే, తనప్రక్కన పడుకొనివున్న ఆ రెండో బంటు గాడి ఆకారం చాలా వికృతంగానూ, భయానకంగానూ కనిపించింది. అదేమి ఆకారమో ఏమోకానీ, ఆ ముక్కువున్నదే—అది బాగా జానెడుపొడుగువుండి ముఖమంతా ముక్కుతప్పించి మరేమీలేదా అనిపించింది. అదీకాకుండా అసలా ముక్కు మనుష్యుల ముక్కులా లేదు. ఏదో పెద్దరకం రాబందుల ముక్కులా కొసతేలి, వంకరతిరిగి చాలా అసహ్యంగా వున్నది. వీటన్నిటికీ తోడు ఆ ముక్కు ముక్కు అంతా గంగసింధూరంలాంటి ఎర్రని ఎరుపురంగు!

మిగిలిన శరీరమైనా ఒకతీరున వున్నదేమో అనుకొంటే, అదేమిటో అష్టవంకరలు తిరిగివుంది.



నిద్రకళ్లను యిదంతా చూసేసరికి శాంకో పాంజాగాడికి, తనతో రాత్రి అంత పొద్దుపోయేదాకా కబుర్లు ఆడింది మామూలు మనిషి కానేకాదనీ

అదేదో దెయ్యమో, భూతమో అనీ అనుమానం ఒక్క సారిగా తోచింది. అలాటి అనుమానం మనస్సులో మెదిలేసరికి మనిషి ఆపాదమస్తకం గాలిలో పెట్టిన దీపంలా తెగ వణికాడు.

డాన్ క్విక్ సెట్ గారు కూడా యీలోగా నిద్దుర లేచారు. మరి ఆయనకూడా తన ప్రత్యర్థి ముఖారవిందం చూడవలసినవాడే! కానీ ఆ అడవి వీరుడు శిరస్త్రాణం తాలూకు యినుపవల ముఖానికి అడ్డంగా వేసుకొన్నాడు. అతగాడు కూడా నిద్దుర లేచి, తెల్లవారిందని తెలుసుకొని, యుద్ధం చేసే సమయం సమీపించిందికనుక తన గుర్రాన్ని వెతికి పట్టుకొచ్చుకొనేందుకు పోయాడు.

ఈలోగా అక్కడ ఆ రెంటో బంటు ముక్కును చూసి బెదిరిపోయిన శాంకోపాంజా తన స్వామి వద్దకు పరుగెత్తుకు వచ్చాడు. డాన్ క్విక్ సెట్ గారు అప్పటికప్పుడే 'రోజినాన్‌టీ'ని ఎక్కి యుద్ధానికి తయారు అవుతున్నాడు. ఇది చూచి శాంకోపాంజాగాడికి పట్టుకొన్న భయం మరింత ఎక్కువైంది. అందుకని, ఆయనగారి కాళ్లా, వేళ్లాపడి, తనను ఆ చెట్టు ఎక్కించి కూర్చొబెట్టమని ప్రాధేయపడ్డాడు. డాన్ క్విక్ సెట్ గారు యుద్ధంహడావుడిలో మునిగిపోయి వుండగా, తాను చస్తే ఆ 'పీడముక్కు' ప్రక్కన ఒంటరిగా వుండలేనని చెప్పి, కన్నీళ్లగా ఏడ్చాడు. వీడు యీ వరసను తన యజమానిని బ్రతిమలాడు

తుండగా అవతల ఆ ఎర్రముక్కుకు మెలుకువ వచ్చి లేచి నిల్చున్నాడు. డాన్ క్విక్ సెట్ గారు శాంకో పాంజా చెప్తున్న మాటలకు వినుపోతూనే, యీ 'ముక్కు' మెరుస్తున వైపుకు పరీక్షగా చూశాడు. నిజమే — ఆ ముక్కు, ఆరంగు, ఆ మనిషిని చూస్తూ, ఎవరో తనవంటి వీరుడికి తప్ప, మామూలు మనిషికి ఎవరికైనా అంత భయమూ వేసితీరుతుందని యీయనకూ అనిపించింది. శాంకో పాంజా గుండె ఆగి పోయేట్లు వణుకుతున్నా, అప్పటికి కాని వాడిమీద ఆయనగారికి జాలి కలుగలేదు. 'సరే'నని శాంకో పాంజాకు చేయి అందించి, గుర్రంవీపుమీదకి ఎక్కించి, అక్కడనుంచీ ఒక చెట్టు కొమ్మమీదకి పాకించి, యింకా పైకి పాకిపోయి అక్కడ కూర్చోమని సలహాయిచ్చాడు. వాడు చెట్టుకొమ్మ ఎక్క-ఎక్కటంతోటే చిటారుకొమ్మకు పోయి అక్కడ కోతిలా కూర్చున్నాడు.

ఆ అశ్వికరుడికి ఆట్టే దూరం పోకుండానే గుర్రం దొరికినట్లుంది; దానిమీద ఎక్కిన డాన్ క్విక్ సెట్ గారిమీదకు యుద్ధానికి వచ్చాడు. ఆయన ఎక్కిన గుర్రమైనా, మన డాన్ క్విక్ సెట్ గారి ముద్దుగుర్రం 'రోజినాంటీ'కి తోడు పోయిందే! రోజినాంటీ ముట్టె మూరెడు దించుకు పోయివుంటే, యీగుర్రం ముట్టె బారెడు దించుకు పోయింది. తీరా అతడు ఆ చెట్టుదగ్గరకువచ్చి

చూస్తే తన ప్రత్యర్థిఅయిన డాన్ క్విక్ సెట్ గారు శాంకోపాంజాగాడిని చెట్టుకొమ్మలమీద కు సరఫరా చేసే పనిలో నిమగ్నులై వున్నారు. అటువంటి వాడిమీద దొంగదెబ్బ తియటం వీరధర్మం కాదు కనుక, ఎలాగో ఒకలాగు గెంతుతున్న తన గుర్రాన్ని కదలకుండా నిల్పోబెట్టి తానూ ఆ చెట్ల కొమ్మల వైపుకే చూస్తూ వుండిపోయాడు.

వెనుకవైపునుంచీ వినిపించిన గుర్రపు డెక్కల చప్పుళ్లను బట్టి తనమీదకు ఆ అడవి వీరుడు గాలప్ స్పీడులో వచ్చేస్తున్నాడని వూహించుకొని, డాన్ క్విక్ సెట్ గారు 'రోజినాన్టీ' డొక్కల్లో ఒక్క తాపు తన్నాడు. 'రోజినాన్టీ' అడుగు వేయటంలోనే గాలప్ స్పీడ్ అందుకొన్నది. (ఈసారి డాన్ క్విక్ సెట్ గారి అదృష్టం పండింది లేకపోతే రోజినాన్టీ యిలా ఎప్పుడైనా ఒక్క తాపుకే 'గాలప్' చేసిందా?) ఆ రెండో గుర్రం మాత్రం, రౌతు ఎంత తన్నినా ఎంత గింజుకొన్నా కాలు కదపకుండా కొయ్యబొమ్మలా నిలుచుండిపోయి, ఒక్క అంగుళమైనా ముందుకు కదలలేదు. డాన్ క్విక్ సెట్ గారికి దీనివల్ల మంచి అవకాశం చిక్కింది ప్రత్యర్థిమీదకి యీటె విసిరాడు. ఆ దెబ్బకు అడవివీరుడు నేలను కూలాడు.

ఎప్పుడైతే తన యజమాని అవతలి వీరుణ్ణి పడగొట్టేశాడో, అప్పుడే శాంకోపాంజా వుడతలా చెట్టు కొమ్మల మీదినుంచి దిగపాకి, పరుగెత్తుకొంటూ ఆ

వీరుడుపడివున్నచోటికి వచ్చేశాడు. డాన్ క్విక్‌సెట్
గారు కూడా గుర్రంమీదనుంచీ దిగి పరుగెత్తు
కొంటూవచ్చి క్రిందపడివున్న వీరుడి రొమ్ముమీద
ఎక్కి కూర్చున్నాడు. ఇంకా బ్రదికేవున్నాడో
చచ్చాడో తెల్సుకొందామని ఆ వీరుడు ముఖానికి
అడ్డంగావున్న యినపతెరను తొలగించి చూసి,——...
ఆఁ; గాసి యేమైనాడు? ఏం చూశాడో ఏమోకాని-
ఆ డాన్ క్విక్‌సెట్‌గారి ముఖంలో రంగులు గబగబా
మారిపోతున్నాయి ముచ్చెమటలు దిగజారు
తున్నాయి. ఇంతకీ ఏం జరిగిందీ?—

డాన్ క్విక్‌సెట్‌గారు తనకళ్లను తానే నమ్మ
లేకపోయాడు. తన చేతిలో దెబ్బలుతిని నేల కొరిగిన
యీవీరుడి ముఖంలో ఆ 'శాంసన్ కరాస్కో' పోలి
కలు కొట్టవచ్చినట్లు కనిపించాయి. తాను ద్వితీయ సైత్ర
యాత్రకు 'లామంచా' గ్రామాన్ని విడిచివచ్చేముందు,
తనతో బాగా పరిచయమై, తన ప్రతాపాన్ని మెచ్చు
కొంటూ చుట్టుకు చుట్టుకు తిరిగిన ఆ కాలేజి కుర్రాడు
'శాంసన్ కరాస్కో' ముఖకవళికలన్నీ యీతనిలోనూ
కనిపిస్తున్నాయి. ముఖకవళికలు ఒక్కటే కాదు;
మూర్తి మూర్తి అంతా అదే పోలికను వున్నది.

ఇంతసేపూ డాన్ క్విక్‌సెట్‌గారు బారాంకి కత్తి
తన యజమాని గుండెమీదకు గురిపెట్టి నిల్చొని
వుండటం చూసిన ఆ అడివీరుడి బంటు (అంటే ఆ
ఎర్రముక్కు) తన యజమానిని చంపేస్తున్నారన్న బెంగ

కొగ్ది, పరుగెత్తుకొంటూ వచ్చి, డాన్ క్విక్ సెట్ గారి కాళ్లు రెండూ గట్టిగా పట్టుకొని "చంపకండి బాబూ! చంపకండి. ఈ వీరుడు 'లామంచా' గ్రామంలో మీ పొరుగింటివాడు. మీకు ఎంతో కావలసిన మిత్రుడు; 'శాంసన్ కరాస్కో'. ఆయన్ను చంపకండి బాబూ!" అంటూ ప్రాధేయపడ్డాడు.

ఇంతలో శాంకోపాంజాగాడు అది గమనించినట్లున్నాడు—"అరే, ఏదీ నీ ముక్కు? నీ ముక్కు ఏమైంది?" అంటూ అడ్డువచ్చి అడిగాడు. వాడిని అంత హడలెత్తించిన ఆ ముక్కు ఏమైందో ఏమో, మరి ఆ బంటుగాడి ముఖంమీద మాత్రం లేదు!

"ఉండండీ బాబూ! ఇక్కడే వున్నది; నా జేబులో వుంది," అంటూ ఆ అడవి వీరుడి బంటు చొక్కా జేబులోకి చేతిని పోనిచ్చి, అట్టతో చేసిన ముక్కునొకదానిని బయటపెట్టాడు. ఈమాదిరి అట్ట ముక్కులు పిల్లలు తగిలించుకొని ఆడుతూ వేస్తుంటారు; శాంకోపాంజకు ఆ విషయం తెలుసు అయినా, ఏమిటో— తెల్లవారు ఝామున ఆ మసకచీకటిలో ఆ అట్టముక్కును చూసే అంత భయపడిపోయాడు! అవతలి బంటుగాడి ముఖాన్ని శాంకోపాంజా అప్పుడు పరీక్షగా చూశాడు "అరె-ఇదేమిటి? నువ్వు మాగుడిసెప్రక్కను ఎడమచేతివైపున వున్న ఒంటి నిట్టాడి పాకలో వుండే టామ్ సిసైల్‌వి కదూ?" అంటూ శాంకోపాంజా సంభ్రమాశ్చర్యాలు వెళ్ళబుచ్చాడు.

"అవునండి శాంకోపాంజాగారు ! నేను టామ్ సిసైల్ నే;" అని ఆబంటు తనపేరు బయటపెట్టాడు.

అప్పటికికానీ, గుర్రంమీదినుంచి కూలి పోయిన ఆవీరుడికి స్మారకం రాలేదు. మనిషి కొంచెం కదలటం మొదలుపెట్టాడు. ప్రత్యర్థి కదలుతున్న విషయం గమనించి డన్ క్విక్ సెట్ గారు వాడిపీకమీద కత్తిఅంచు ఆనించి, "'గాబోసా' రాజ్ఞి అందాల రాణి, ముత్యాల కోవ 'డల్ సీనియా'ను మించిన అందగత్తె 'నభూతో నభవిష్యతి' అని యిప్పుడైనా ఒప్పుకొనుము. అట్లు ఒప్పుకొనక సి 'కసిల్ డియా-డి- వాండాలియా' కన్యనే అందగత్తెయని చెప్ప సాహసించితి నేని, నీ ప్రాణములు నీవికావు జాగ్రత" అంటూ బిగ్గరగా అరిచాడు.

సాంతం స్మారకమైనా రాని స్థితిలో ఆ అడివి వీరుడు (శాంసన్) గత్యంతరం లేక "ఒప్పుకొంటు న్నాను, ఒప్పుకొంటున్నాను... మీ డల్ సీనియా రాకుమారి తొడిగి పారేసిన పాత చెప్పుకో నైన ... మా...'కసిల్ డియా' కన్య...సరిపోలదండి" అంటూ తనపరాజయాన్ని ఒప్పుకొన్నాడు

డన్ క్విక్ సెట్ గారికి అంతటితో తృప్తిలేదు. "ఇంతకు మునుపు నీవు 'భీకరానన వీరకూగ్ర కేసరి' డన్ క్విక్ సెట్ గారినే ఓడించితినని ప్రగల్భములు పలికితివే ! ని వోడించిన ఆ వీరుడెవడో 'ఫూటా' డన్ క్విక్ సెట్టే కాని, నిసమైన డాన్ క్విక్ సెట్ గారు కాదని

ఒప్పుకోందువా ?" అంటూ గద్దించి అడిగాడు. ఆ వీరుడు అందుకూ ఒప్పేసుకొన్నాడు. అతడు అప్పుడున్న పరిస్థితిలో, యిదే కాదు ఏమాట అయినాసరే ఒప్పేసుకొనేందుకు సిద్ధంగా వున్నాడు. ఏమంటారా?—ఏదో డాన్ క్విక్‌సెట్ గారిమీద వున్న చనువుకొద్దీ యిలా ఆయనను తమాషా చేద్దామనే ఆ 'శాంసన్' యీ వేషాలు వేసుకు వచ్చాడు కాని, అదే యిలా పీకలమీదకు వచ్చే వ్యవహారం కాబోతున్నదని అతని కేమి తెలుసు, పాపం? ఏమాత్రం పెనగులాడినా, ఆ డాన్ క్విక్‌సెట్ గారు పిచ్చి ఆవేశంలో ఏం చేసినా చెయ్యగలడు. అదీకాక — ఆ గుర్రంమీదనుంచీ పడ్డపాటుకు, తగిలిన గాయాలకు, చప్పున ఎవడైనా వైద్యుడిదగ్గరకు పోయి యింత మందు వేయించుకోకపోతే లాభం లేదు.

డాన్ క్విక్‌సెట్ గారు మాత్రం మరేమీ షరతులు పెట్టకుండా ఆ వీరుడి గొంతుమీద కత్తిని తీసేశాడు. ఆ వీరుడి ముఖాన్ని పరీక్షగా చూసినప్పటినుంచీ డాన్ క్విక్‌సెట్ గారికి ఒక అనుమానం పట్టుకు పీడిస్తున్నది. ఆ 'శాంసన్' పోలికలు యీ వీరుడికి ఎలా వచ్చాయో, యీయనగారికి ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. వీడెవడో నిజమైన వీరుడేననీ, మొదటినుంచీ తన వుసురుపోసుకొంటున్న ఆ మాంత్రికుడే తనమీద అక్కసుకొద్దీ, చేతిలో

చిక్కిన వీళ్ణి తన మిత్రుణ్ణిగా మార్చిపారేశాడనీ యీాయన చాలా దిగులుపడ్డాడు.

చావు తప్పినందుకు సంతోషిస్తూ ఆ శాంసన్ తన బంటును వెంటబెట్టుకు లామంచావైపుకు వెళ్ళి పోయాడు.

# 13

ఆ అడవివీరుడి పొగరణిచాను కదా అన్న దిలాసాతో డాన్ క్విక్ సెట్ గారు మహా సంతోషంగా ముందుకు పోతున్నాడు. శాంకోపాంజా మాత్రం ఎద్విధమైన వుద్రేకమూ లేకుండా ఆయన వెనకాలే గాడిదనెక్కి వస్తున్నాడు.

వీళ్ళిద్దరూ అలాగే ఆ దోవని వస్తుండగా, ఉత్తమ జాతి గుర్రమెక్కిన మరొక వ్యక్తి వచ్చి వీళ్ళతో కలిశాడు. ఆయన ఆకుపచ్చని మెఖమల్ కోటు తొడుక్కొన్నాడు నడుముకి చాల ఖరీదైన పొడుగాటి కత్తి ఒకటి వేలాడగట్టుకొన్నాడు. ఆ కత్తిపిడి అంతా బంగారపు ముద్దతో చేసి, దానినిండా పచ్చలు పొదిగి వున్నాయి.

వేషం, వైఖరీ చూస్తే యీాయన ఎవరో రాజవంశానికి చెందిన వ్యక్తిలాగే వున్నాడు. ఎవరై వుంటారా అని డాన్ క్విక్ సెట్ గారు ఆలోచిస్తుండగానే, ఆ వ్యక్తి గుర్రాన్ని ఆపేసి యీాయనకు దణ్ణం

పెట్టాడు. డన్ క్విక్‌సెట్ గారి ఆనందానికి అంతులేక పోయింది. అంత గొప్పవాడుగా కనిపిస్తున్న ఆవ్యక్తి, తనకు రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెడితే, యింక అంతకంటే ఎవరికి మాత్రం కావలసిందేమి టుంటుంది! అందులోనూ ఆ వ్యక్తికూడా వీళ్లు పోతున్నవైపుకే ప్రయాణమై వస్తున్నాడేమో, యిద్దరు గుర్రాలను ప్రక్క ప్రక్కనే నడిపిస్తూ, ఆ కబుర్లు యీ కబుర్లు చెప్పుకోవటం మొదలుపెట్టారు. క్రొత్తగా వచ్చి కలిసిన ఆ వ్యక్తిపేరు డాన్‌డైగో అట; ఆమాట అతనే చెప్పాడు. ఈ భీకరానన వీరశూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు ఏకరువు పెట్టిన తన వీరవిహారానుభవాలు అన్నీవిని, ఆయన ఎంతో యిది అయి, వాళ్ళ జమీకి వచ్చి కొద్దిరోజులు వుండిపోవలసిందిగా ఆహ్వానించాడు. డాన్ క్విక్ సెట్ గారు ఆయన ఆహ్వానాన్ని స్వీకరించాడు. అట్లాగే ఆ జమీకి పోదామనుకొన్నాడు. కాని - యింతలో మరొక విచిత్రమైన సంఘటన జరిగింది. ఆ సంఘటనను ఎదుర్కొవటంలో ఆయన ప్రదర్శించిన ధైర్య సాహసాలు యింతింతనటానికి వీల్లేదు. ఇంత ఎందుకు—అటువంటి పరిస్థితులలో డాన్ క్విక్‌సెట్‌గా రొక్కరు తప్ప, మరెవ్వరైనా వెన్ను చూపించేవాళ్లే!

అసలు జరిగినవిషయం యిది—ఆ డాన్ డైగో, యీ డాన్ క్విక్‌సెట్ అలా కబుర్లు ఆడుకొంటూ వస్తుండగా, కొద్ది దూరంలో ఎత్తైనవస్తువు ఏదో ఒకటి

కదులుతూ ఎదురువస్తున్నది. రంగుల జెండా లేవో గాలిలో కదులుతూ, డాన్ క్విక్ సెట్ గారికి తనను యుద్ధానికి సిద్ధం కమ్మని హెచ్చరిస్తున్నట్లుగా కనిపించాయి. ఆయన ఒకటి రెండుసార్లు సకిలించి మాటలు కట్టిపెట్టి కళ్లు పెద్దవి చేసుకు ఆవైపే చూస్తూవున్నాడు.

ఆ వస్తువు దగ్గరకు వచ్చింది. తీరా చూస్తే అదొక పెద్దబండి! అయితే యీ బండి అన్ని బళ్లకు మల్లే లేదు. బండిమీద ఏదో పెద్ద కొయ్యపెట్టె పెట్టినట్లుంది. బండి కూసాలు అంత పొడుగున వున్నాయి. వాటి చివరలకు తగిలించివున్న ఆ జెండాలే యిందాక ఈయనగారిమీద సవాలు చేసింది. ఇంకొక విశేషం, ఆ బండిమీద స్పెయిన్ దేశపు రాజుగారి ముద్రలు కూడా వున్నట్లు కనిపించింది.

యుద్ధానికి సంబంధించిన ఆలోచనలు ఒకసారి మనస్సులో మెదిలాయీ అంటే, డాన్ క్విక్ సెట్ గారు యిక మనిషి మనిషిగా వుండలేడుగా! గబగబా ఆ బండికి ఎదురువెళ్ళి ఆ బండివాడి గుండెలమీదికి యీటెమొన గురిపెట్టి నిల్చొని "ఎవరు నీవు? ఎటకేగుచున్నావు? నీవెవరి పనుపున ప్రయాణించుచున్నావు? ఆ శకటమునందున్న దేమి?" అంటూ వాడిపై ప్రశ్నల వర్షం కురిపించాడు.

ఆ బండివాడు బండిని ఆపేసి, యీబండి తనదే ననీ, ఆ పెట్టెలో, ఒరాన్ సేనాధిపతి స్పెయిన్ దేశపు

రాజుగారికి బహుమానాలుగా పంపుతున్న రెండు పెద్ద సింహాలున్నాయనీ చెప్పుకొన్నాడు.

"ఏమేమీ ! ఇందు సింహము లున్నవా ! ఆ సింహాము లెంత పెద్దవో వివరించి చెప్పుము." డాన్ క్విక్ సెట్ గారు సంభ్రమాశ్చర్యాలతో అడిగాడు. ఇంత పెద్ద సింహాలు ఆఫ్రికా అడవుల్లో కూడా దొరక వనీ, అటువంటి సింహాలు కనుకనే రాజుగారికి బహుమానాలుగా పంపటం జరుగుతున్నదనీ ఆ బండివాడు చెప్పాడు. నిన్నటినుంచి వాటికి తిండిఅన్నది ఏదీ పెట్టని కారణంచేత అవి ఆకలితో ఘోడు ఘోడు మంటున్నాయనీ, యిటువంటి స్థితిలో వాటిని చూస్తేనే భయం వేస్తుందనీ కూడా చెప్పాడు. ఆలస్యమైనకొద్దీ ఆ మృగాలు ఆకలికి ఆగలేక ఏం అఘాయిత్యం చేస్తాయో, ఏమో, చప్పున పైవూరికి పోనిమ్మని బ్రతిమాలాడు కూడాను.

ఈమాటలన్నీ విన్నతరువాత మరొకళ్లు ఎవరైనా అయితే ఆ బండివాణ్ణి పోనిచ్చేవాళ్లే. డాన్ క్విక్ సెట్ గారు అందరిలాంటివాడా మరి? ఆ సింహాలు అంత పెద్దవి, అంత భయంకరమైనవీ అని ఆ బండివాడు అంతగా చెప్పినా కూడా యీయన మాత్రం అవేవీ లెక్క చేయలేదు. లెక్క చేయకపోగా "భీకరానన వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు సింహాబలుడని లోకమునకు చాటు అవకాశము లభించెను కదా!" అంటూ వెర్రి ఆవేశం తెచ్చుకొని ఆ బండివాణ్ణి

పోయి, బండి తలుపులు తెరిచి సింహాలతో తను పిలుస్తున్నానని చెప్పమన్నాడు. డాన్ క్విక్ సెట్ గారు యిటువంటి మాటలన్ని వొళ్లు తెలిసే అంటున్నాడో, లేక ఏదైనా మైకంలో పడి అంటున్నాడో శాంకో పాంజాకు, డాన్ డైగోకూ అర్థం కాలేదు. ఇద్దరూ చెరొక చెయ్యి పట్టుకొని యిటువంటి తొందర పనికి దిగవద్దని ఎన్ని విధాలుగానో బ్రతిమాలి చెప్పారు. ఎంతమంది ఎన్ని చెప్పితే నేం! ఆయన పుర్రెలో పుట్టిన బుద్ధి ఓ పట్టాన పోదుగా! వీళ్లు తన మంచి కోరి అన్నివిధాల 'ఆ సింహాల జోలికి పోవద్దు,' 'వద్దు' అని చెప్పుతున్న కొద్దీ, ఆ సింహాలతో కలబడితీరా లన్న పట్టుదల ఆయనలో అంతకంతకూ పెరిగి పోయింది. వీళ్ళిద్దరూ చెప్పేమాటలు విని అయినా, యీ వీరుడు తనదారిని తనను పోనిస్తాడేమోనని ఆశతో చూస్తున్న ఆ బండివాణ్ణి "ఏమిరా, బోను తలుపులు తెరిచెదవా; లేక నీ బొమికల నన్నిటినీ విరిచి ప్రోగులు పెట్టమందువా ?" అంటూ డాన్ క్విక్ సెట్ గారు బిగ్గరగా అరిచేడు. ఆ అదలింపుకు వాడు వులిక్కిపడి, వీపు చరుచుకొన్నాడు. ఈలోగా డాన్ క్విక్ సెట్ గారు ఒరలోనుంచి కత్తిని బయటకు లాగి వాడిమీదికి రాబోతున్నాడు. వాడిక గత్యంతరం లేక బోనుతలుపులు తెరవటానికి ఒప్పుకొన్నాడు.

ఆ తలుపులు తెరిచేముందు, బండికి కట్టివున్న కంచరగాడిదలను మాత్రం విప్పేసి, దూరంగా తీసుకు

పోయి వదిలిపెట్టి వస్తానని బ్రతిమలాడాడు. డాన్ క్విక్ సెట్ గారు అందుకు అనుమతించాడు. వాడు ఆ గాడిదలను విప్పి దూరంగా తోలుకుపోయేలోగా మరొకసారి చెప్పి చూతామని డాన్ డైగో, డాన్ క్విక్ సెట్ గారి దగ్గరకు వచ్చి, సింహాలతో పోరాడటం ప్రమాదకరమని హెచ్చరించాడు. ఊహూ! ఆయన ఆ మాట వినిపించుకోలేదు. ఇక లాభం లేదని శాంకో పాంజా, డాన్ డైగో తమ వాహనాలను ఎక్కి తాము దూరంగా తప్పుకొన్నారు. ఆ బండివాడు కంచర గాడిదలను దూరంగా వదిలివేసి తాను ఒంటరిగా తిరిగివచ్చి బోనుతలుపులు తెరిచేటందుకు బండిమీదకు ఎక్కాడు. డాన్ క్విక్ సెట్ గారు మరొకసారి సకిలించి గుర్రం వీపుమీదనుంచి దిగి, కత్తి తీసి పట్టుకొని బోనుకు ఎదురుగుండా నిలబడ్డాడు.

బోనుపైకెక్కిన బండివాడు గజగజ వణికిపోతూనే ఒకతలుపు పైకియెత్తాడు. తలుపు కొద్దికొద్దిగా పైకి లేస్తున్నకొద్దీ బోనులోనుంచి సింహం కొంచెం కొంచెంగా బయటకు కనుపించుతోంది. తలుపు సాంతం పైకి పోయాక, సింహం మహా బద్ధకంగా లేచి నిల్చొని, బిగ్గరగా ఆవులించి, తాపీగా నాలికతో ముట్టిమీద పడ్డ దుమ్మునంతా తుడిచేసుకొంది. ఖణ ఖణమండే నిప్పుముద్దల్లా వున్న కళ్లు రెండూ పెట్టుకొని చూస్తూ నిల్చుండిపోయింది.

12

ఎంత గుండెనిబ్బరం వున్నా కూడా, మరొక మనిషి అయితే అలాంటి పరిస్థితుల్లో తారెత్తి పరిగెత్త వలసిందే. డాన్ క్విక్ సెట్ గారు అందరిలాంటి మనిషి కాదుగా! ఈ సింహం తనమీదికి రావటమే తడవుగా దాని జూలు పట్టుకు ఆడించెయ్యగల నన్న వెర్రి నమ్మకం ఒకటి ఆయనకు బాగా వున్నదాయెను.



అందుచేత మనిషి ఎంతమాత్రం చలించకుండా, కత్తి చేత్తో పట్టుకొని రాతిబొమ్మలా అలాగే నిలబడి వున్నాడు. ఆ సింహం మాత్రం అంత భయంకరమైన కళ్లతోనూ, యీ పీలమనిషిని చూడకుండానే ఆయన తలపైన ఆరు అడుగుల ఎత్తునుంచీ కనుపిస్తున్న చెట్ల ఆకులూ, అవీ చూస్తూ ఊరికే నిలబడివున్నది. ఆ వరసను చెమటలు కక్కుతూ ఆ వీరుడు, ఈ వరసను మూతి నాక్కుంటూ యీ సింహమూ యిలా ఒకళ్లకొకళ్లు ఎదురు బొదురుగా బాగా ఐదారు నిమిషాలు నిలబడి పోయారు. ఎవరూ కదలలేదు. చాలాసేపు అలా గడిచాక, యీ వీరుడు అక్కడ వున్నాడన్న విషయమైనా గమనించనట్లే, – అసలక్కడ ఏమీ లేనట్లే–ఆ సింహం యింతసేపూ యిటు చూస్తూ నిలబడి వున్నదల్లా, అటు తిరిగి చడీ చప్పుడు లేకుండా పడుకొని వుండిపోయింది!

డాన్ క్విక్సెట్ గారికి ఆవేశం ఆగలేదు. ఆ బండివాణ్ణి పేరుపెట్టి పిలిచి, కర్ర ఏదైనా తెచ్చి పడుకొన్న సింహాన్ని లేవగొట్టమన్నాడు. ఆ బండివాడు ఆపని మాత్రం చెయ్యకుండా సింహంతో పోరాడి విజయం సాధించాలని డాన్ క్విక్సెట్ గారు పట్టిన పట్టు, సింహమే వెన్ను చూపటంతో నెగ్గినట్లైనని సర్ది చెప్పాడు. కయ్యానికి రమ్మని సవాలు చేస్తే, ఆ సవాలు అందుకోలేని సింహంతో పోట్లాడినా పోట్లా

డకపోయినా కూడా విజయం యీ వీరుడిదేలే పొమ్మన్నాడు.

బండివాడు వెలిబుచ్చిన యీ అభిప్రాయం డాన్ క్విక్సెట్ గారికి చాలా నచ్చింది. విజయగర్వంతో మరింత గట్టిగా సకిలించి, కత్తిని ఒరలోకి పెద్ద శబ్దమయ్యేట్లుగా దూర్చేసి, "అట్లయిన ఆ బోను తలుపు నిక మూసివేయుము" అంటూ ఆజ్ఞాపించాడు. అంత పిరికి సింహాంసముక్షంలో వుండటం కూడా తనకు అవమానమేనన్నట్లుగా, గబగబా యివతలకు వచ్చేసి తన యీటె మొనకు రంగు రంగుల చేతిగుడ్డను కట్టి, దాన్ని ఎత్తి పట్టుకొని గాలిలో కదిలించాడు. ఇది తనకు సిద్ధించిన విజయానికి చిహ్నమన్నమాట!

ఈగుర్తు నందుకొన్న శాంకోపాంజా, డాన్ డైగో, యిద్దరూ తమ వాహనాలను ఎక్కి యీ వీరుడున్న చోటికి వచ్చేశారు. వాళ్ళిద్దరూ అక్కడకు వచ్చి రావటమే తడవుగా "ఏం జరిగిందేమిటి? ఏం జరిగింది?" అంటూ ఆత్రంగా అడిగారు. ఆ బండివాడు అందుకొని, జరిగిన సంగతంతా పూస గుచ్చినట్లు చెప్పాడు. ఆ చెప్పటంలో సింహం వెనక్కు తిరిగే ఘట్టాన్ని వర్ణించేటప్పుడు వాడు కొంచెం జాగ్రత్తపడి, "ఈయనగారిని చూసేసరికే ఆ సింహం భయపడి పోయిందంటే నమ్మండి" అంటూ యీ వీరుణ్ణి మరింత వుబ్బేశాడు.

డాన్ క్విక్ సెట్ గారికి యింత సునాయాసంగా సమకూరిన విజయంతో, ఆయనకు వచ్చిన గర్వానికి అంతు లేకపోయింది. మనిషి తెగ పొంగి పొంగి పోయాడు. ఆ సంబరంలోనే ఆ బండివాడి కాలాన్ని కొంత తన క్రింద వినియోగించుకొనదలచుకుని గానూ, వాడి కొక కానీ యిమ్మని శాంకో పాంజాకు ఉత్తరువు వేశాడు. ఆ మాట అంటూనే ఆ బండివాడి వైపు తిరిగి "ఓ సారథీ; ఈ సింహముల నోడించిన దెవ్వని రాజుగారు నిన్నడిగిన నో 'వీరకేసరి' డాన్ క్విక్ సెట్ గారని చెప్పుము." అంటూ వాడికొక ఉత్తరువు పారేశాడు. ఎలా తట్టిందో ఏమో, యీ 'వీరకేసరి' అనే బిరుదు, తన కెంతో తగివున్నది అనిపించింది. అందుచేత యిక మీదట తనను ఎవరైనా సరే 'వీరకేసరి' అనే పిలవాలని హుకుం కూడా వేసేశాడు.

అంతటితో డాన్ క్విక్ సెట్ గారు సింహాన్ని ఎదుర్కొనే ఘట్టం ముగిసింది. మనిషి తెగ సంబరాలు పడిపోతూ, మీసాలను మెలేసి, మెలేసి గుర్రమెక్కి కూర్చొన్నాడు. శాంకో పాంజా, డాన్ డైగోలు దారి చూపగా ముందుకు ప్రయాణం సాగించాడు.

## 14

'వీరకేసరి' డాన్ క్విక్ సెట్ గారు డాన్ డైగో ఆహ్వానాన్ని మన్నించి ఆయన తాలూకు

జమీకి, శాంకోపాంజాతో బాటు వేంచేశారు. డాన్ డైగోకు యీయన రాక అదేదో మహత్తర విషయమైనట్లుగా తోచింది; తన పెళ్లాన్ని పిల్లవాడిని తీసుకొచ్చి యీ వీరుడితో పరిచయం చేశాడు. అక్కడవున్న ఆ నాలుగు రోజులపాటూ ఆయనకు, ఆయన బంటుకు సకలోపచారాలు చేయించాడు; వారికి మృష్టాన్నాలు పెట్టి ఆదరించాడు.

యజమానితోపాటు దేశంమీద పడి యిన్నిసార్లు చెడతిరుగుతున్నా, ఎక్కడా శాంకోపాంజాకు, యిక్కడ వున్నంత సుఖం అనుభవానికి రాలేదు. వాడు జన్మలో తిని కనివిని ఎరుగని వంటకాలు ఏవేవో ఆ డైగోగారు వీడిచేత తినిపించాడు ఇంత మంచి తిండి, యింత పెద్ద మన్నన చూసేసరికి శాంకోపాంజాకు యిక అక్కడే వుండిపోదామనిపించింది. వీడు ఎన్ని అనుకొంటే ఏం లాభం! అవతల ఆ వీరుడికి పట్టుమని నాలుగు పగళ్లు అయినా గడవకముందే వీర విహారాలకు పోవాలనే తీట ఎక్కువై పోయింది. ఒకరోజు ప్రొద్దున్నే నిద్దర లేచీ లేవటంతోటే వున్న పళంగా ప్రయాణం కట్టమని శాంకోపాంజాగాడికి పురమాయించి, తాను డన్ డైగోగారివద్దకు, ఆయనగారి భార్యవద్దకు వెళ్లి, వారు తనకూ తన బంటుకూ చేసిన మర్యాదలకు ధన్యవాదాలు చెప్పి చక్కావచ్చాడు.

'ఎప్పటి భాగోతం మళ్ళీ మొదలైంది కాబోలురా భగవంతుడా' అనుకొంటూ శాంకో పాంజా తన గాడిదనూ, యజమాని గుర్రాన్నీ సరిదీసి, వాటికి జీనులూ అవీ తగిలించి, ప్రయాణానికి సిద్ధంగా పెట్టాడు. డాన్‌క్విక్‌సెట్ గారు పెద్దసంరంభంతో వచ్చి గుర్రంయెక్కి దాని డొక్కలో ఒక్క తాపు తన్నాడు. గుర్రం కాలు కదిపి ప్రయాణం ప్రారంభించింది. శాంకోపాంజాకూడా తన గాడిద 'డాపుల్' మూపున ఎక్కి, తన స్వామి పోతున్న దారినే గాడిదనూ నడిపించుకుపోయాడు.

అలా ఒకటి రెండు రోజులపాటు ప్రయాణం చేశాక, ఒకనాటి ఉదయం వీళ్లిద్దరూ 'ఎబ్రో' నదిగట్టు మీద తేలారు. నదీజలం ఎంతో నిర్మలంగా వున్నది. ఆ ప్రాతఃకాల సూర్యకాంతికి గట్టున వున్న చెట్ల ఆకులు చూడ ముచ్చటగా వున్నాయి. మొత్తానికి ఆ వాతావరణమంతా కూడ చాలా మనోహరంగా వుంది. ఆ దృశ్యం అంతా చూసేసరికి డాన్ క్విక్‌సెట్ గారి హృదయం ఎందుకనో వుప్పొంగిపోయింది. ఇంతలో నది నీటిమీద ఖాళీపడవ ఒకటి తేలుతూ యీయనకంటపడింది. ఆ పడవకు తెడ్లు కానీ చుక్కాని కానీ ఏమీ లేవు. పెద్ద మోకుతో ఒక చెట్టుకు కట్టివేసివున్నది. ఆ పడవను చూసీ చూడటంతోనే డాన్ క్విక్‌సెట్ గారికి ఏం బుద్ధి పుట్టుకు వచ్చిందో ఏమో—గుర్రంమీదినుంచీ దూకేసి

ఒక్క గంతులో పోయి ఆ పడవలో ఎక్కి కూర్చొన్నాడు. అంతేకాదు;—'రోజినాన్‌టే'ని, 'డాపుల్'ను కూడ ఏదైనా ఒక చెట్టుకు కట్టేసి శాంకోపాంజాను కూడా చప్పునవచ్చి బోటు ఎక్కమన్నాడు.

"ఎందుకండీ యిప్పుడు బోటు ఎక్కటం; పనిలేక!" అన్నాడు శాంకోపాంజా ఎలాగో ధైర్యం తెచ్చుకొని.

"అట్లు మాటాడెదవేమోయ్ శాంకో! సరిగా మనము వచ్చుసరికే యీనావ యిందే సిద్ధముగా నుండవలెను? అదృశ్య శక్తి ఏదో నన్ను మహత్తర కార్యోన్ముఖునిగా చేయుటకే యీ నావను యిందు నిలిపి వుంచినది. అందులకు సందియము లేదు. మనమూరక అనుమానించుచూ కూర్చొనుటకిది సమయము గాదు. ఏదూరతీరమునందో, ఎవరో అమాయకురాలు రాక్షసుల పాల్పడి ఎన్నెన్నియో నరకబాధలు అనుభవించుచుండవలెను. ఆమెను ఆ కిరాతుల బారినుండి తప్పించవలసిన బాధ్యత 'వీరకేసరి' నైన నాపై గలదు. అందులకే అదృశ్య శక్తి యీ నావను యిట నాకై సంసిద్ధముగా నిలిపి వుంచినది. లోకప్రఖ్యాతి నార్జించిన పూర్వ వీరవ శ్రేష్ఠులెల్లరకును మున్ను యిట్లె కదా అదృశ్య శక్తులు ఎన్నెన్నియో భంగుల సాయము నొనరించినవి? నీవు మాత్రము యిక కాలహరణము సేయక వేవేగ రమ్ము!" డాన్ క్విక్ సెట్ గారు వాడిమీద కోపగించారు.

శాంకోపాంజాకు యిక గత్యంతరం లేదు. తన స్వామికి యీ మాదిరిధోరణి పుట్టుకువచ్చిందంటే, దానికి మరి తిరుగువుండదు. అలాంటి సమయంలో అడ్డుచెప్పితే ప్రయోజనం వుండదనేది వీడికి యిదివరకు ఎన్నోసార్లు అనుభవమైవున్నది. లోలోపలనే సణుక్కుంటూ గొణుక్కుంటూ ఆ గుర్రాన్ని గాడిదను దగ్గిరలోనే ఓ చెట్టుకు కట్టేసివచ్చి పడవలో ఎక్కి కూర్చున్నాడు. శాంకో పాంజా పడవలో కాలు పెట్టిందే తడవుగా డాన్ క్విక్ సెట్ గారు మొలలోనుంచి కత్తితీసి, దాంతో పడవకుకట్టివున్న మోకును కోసేశాడు.

పడవ ఏటివాలును పట్టి కదిలిపోతున్నది. పడవ ఊగిసలాడటం ఎక్కువౌతున్నకొద్దీ, శాంకో పాంజాకు దిగులు కూడా అధికమైంది. వాడి మనస్సులో మెదిలిన ఆ దిగులు-పొగ రాజి రాజి, చివరకు గన్నిన మంటలు పైకి లేచినట్లు—ఒక్కసారిగా పెద్దపెట్టున వచ్చే ఏడుపులోకి దిగింది. ఒక వంకను విడవకుండా ఒకే శృతిలో ఏడుస్తూ "చూడండి ; నా గాడిద 'డాపుల్' ఎంత గోలపెట్టి పోతున్నదో దానిని విడిచి మనం యిలా వెళ్ళిపోతున్నందుకు ఆ మూగ ప్రాణి మనస్సు ఎంత తల్లడిల్లిపోతున్నదో! ఆగకుండా ఓండ్ర పెడుతున్నదే...అయ్యో నా నేస్తమా! ఈ వేళతోనే నీకూ నాకూ ఋణం తీరిపోతున్నదా" అంటూ చేతులు రెండూ ముఖానికి అడ్డంగా పెట్టు

కొని బావురుమన్నాడు. మళ్ళీ ఎల్లాగో కొంచెం తేరుకొని "చూడండి పాపం... ఆ 'రోజినాన్టీ'ని చూడండి! మిమ్మల్ని వదిలిపెట్టి వుండలేక అది కట్లు తాడు తెంచుకుని మనవైపుకు పరుగెత్తుకు రావటానికి ఎంత తంటాలుపడుతున్నదో ఒక్కసారి కన్నెత్తి చూడండి. నామీద మీకు జాలిలేకపోతే మానె! మిమ్మల్నిను యింతకాలం తనవీపున మోసుకు తిరిగిన ఆమూగజీవాన్నైనా కనికరించి, పడవను ఒడ్డుకు పట్టించండి." అంటూ ఆయనగారి కాళ్లావేళ్లా పడి బ్రతిమలాడాడు.

వీడి యీ గోడు చూస్తుంటే డాన్ క్విక్సెట్ గారికి చిర్రు ఎత్తుకొచ్చింది. తనను ఏదో అదృశ్యశక్తి యిలా కీర్తిపథానికి నడిపించుకుపోతుంటే, శనిలాగా వీడు అడ్డు తగులుతున్నాడనిపించింది.

"ఓరీ పిరికిపందా! పిల్లిపిల్లా! ఏమి చూచినావనిరా నీ కింతటి భయము? నిన్నే భూతము తరుముకొని వచ్చుచున్నది? నిన్నెవరు హింసించుచున్నారు? ఎందుల కింతటి బేల వయ్యెదవు? నీకే చేటుకాలము దాపురించినదిరా శుంఠా! నీవేమైన చొరరాని సీమలలో ప్రయాణించుచుంటివా? కనరాని కారడవుల నడుచుచుంటివా? ఎందుల కిట్లు తల్లడిల్లిపోయెదవు? ఈ సుందరమయ ప్రకృతిలో, యీ తరంగడోలికలలో, యీ నావ వయ్యారినడలలో హాయిగా సర్వంసహా చక్రవర్తివలె ప్రయాణించలేక ఎందుల

కిట్లు గుండియ లవియున ట్లేడ్చెదవు ?" అంటూ వాడికి యింత గడ్డి పెట్టాడు.

వీళ్లిద్దరూ యిలా ఏడుపులు పెడబొబ్బలు, తిట్లూ, శాపనార్థాలతో కాలం గడుపుతూవుంటే ఏటివాలులో కొట్టుకుపోతున్న ఆ పడవకు క్రమేపీ వేగం హెచ్చింది. పడవ వడివడిగా వచ్చి ఒక మలుపు తిరిగింది. ఎదురుగుండా ఒడ్డుమీదవున్న పెద్ద పిండి మర కట్టడం, అంత ఎత్తున డాన్ క్విక్ సెట్ గారి కంట పడింది. అంతే!—శాంకోపాంజాగాణ్ణి తా నింత సేపూ తిట్టుతున్న మాటే మరచిపోయి—"ఆదెస గాంచుము శాంకో—ఆ మహోన్నత కుడ్యములచే విరాజిల్లు ఆకోటను పరీక్షించి చూడుము. అందు ఎవరో అపరూప లావణ్యవతి బందీఅయివుంటవలె. ఆమెను ఎవరో క్షుద్రులు నానా బాధలు పెట్టుచున్నారు కాబోలును. ఆమెను విముక్తి చేయించుటకే కాబోలును—అదృశ్యశక్తి నన్నిటకు రప్పించినది" అంటూ డన్ క్విక్ సెట్ గారు అర్రులు చాస్తున్నాడు.

ఆ మిల్లులో వుండే యింజను యీ నదినీటిని తెగతోడిపోస్తూ, ఆ శక్తితోనే పనిచేస్తుంది. మిల్లు దగ్గర ప్రాంతంలో వుండే నీటిని ఆ యంత్రం చప్పుచప్పున పీల్చేస్తున్నది. ఆ కారణంచేత నీళ్లు ఎక్కిన పడవ మిల్లుదగ్గరకు వస్తున్న కొద్దీ పడవవేగం మితిమీరి పోతున్నది. ఆ పడవవేగాన్ని అరికట్టకపోతే, యిక కొద్దిక్షణాలలోనే ఆ యిద్దరు మనుష్యులతోనూ పడవ

పడవంతా పెద్ద రాక్షసుడి నోట్లోకి పోయే వడియం ముక్కలాగా మిల్లులోకి యీడ్చుకుపోతుంది. ఆ తరువాత పడవ కానీ, పడవలో వున్న మనుష్యులు కానీ ఒక్క పిసరైనా మిగలకుండా అంతా పప్పుపప్పు కావలసిందే! ఇంత పెద్ద ప్రమాదం ముంచుకువస్తున్నా డాన్ క్విక్ సెట్ గారు తన ధోరణి మార్చుకోనే లేదు.

అదృష్టవశాత్తు ఆ పిండిమర యజమాని దూరంనుంచీ పడవ ఏదో మిల్లులోకి చొచ్చుకువస్తుండటం గమనించాడు. మరలో పనిచేసే నలుగుర్నీ కేకేసి, తలా ఒక గడ చేతికి యిచ్చి, పడవ ఏదో ప్రవాహంలో కొట్టుకువస్తున్నదని, అది మిల్లు ఆవరణలోకి వచ్చేలోగానే ఎలాగో ఓలాగు దాన్ని ఆపేసి, అందులో వుండే మనుష్యులనైనా కాపాడటానికి ప్రయత్నించమని ఆ నలుగురిని పురికించాడు. తానూ ఒక గడ పుచ్చుకు వాళ్ళవెనకాలే పరుగెత్తుకొంటూ వచ్చాడు.

వాళ్ళందరూ పిండిమరలో అప్పటిదాకా పని చేసిన మనుష్యులైనందువల్ల, వాళ్ళందరి వొంటినిండా, బట్టలనిండా పిండి బాగా ఐదారు అంగుళాల మెత్తున పేరుకుపోయివున్నది. పిండికొట్టుకొన్న యీ ఆకారాలను చూసి, డాన్ క్విక్ సెట్ గారు తానింతసేపూ వూహించుకొంటున్న రాక్షసులే యిలా తనను ఎదుర్కొవటానికి పెద్ద పెద్ద కర్రలు పుచ్చుకు వచ్చారని అనుకొన్నాడు.



'ఆ పడవలోనివాళ్లు ఎవరో, — పాపం అన్యాయంగా చచ్చిపోతారే' అన్న బెంగకొద్దీ పిండి

మరయజమాని బిగ్గరగా ఏమిటేమిటో అరుస్తు న్నాడు. ఈ అరుపులకన్నిటికీ సమాధానంగా, డాన్ క్విక్ సెట్ గారు తన కత్తిఎత్తి గాలిలో త్రిప్పుతూ "ఓరీ మదాంధులారా? ముష్కరులారా? మీ పాలిటి యముడను యిదే వచ్చుచున్నాను. నేటితో మీ దుస్తంత్రములకు స్వస్తి. దురహంకారులై మీ రే అమాయకురాలిని చెరసాలయందుంచితిరో ఆమెను తక్షణమే విముక్తం చేసి, నాకు మర్యాదగా అప్పగించవలె. లేకున్నచో —మీ ప్రాణములు మీవి కావు!"అంటూ గొప్పగా హెచ్చరికలు పలుకు తున్నాడు.

మిల్లుయజమాని కానీ, ఆయన తాలూకు మనుష్యులు కాని యీయనగారి యీ వెర్రివాగుడు వినిపించుకోకుండా, రాబోయే ప్రమాదాన్ని తప్పించ టానికే నానాయాతనలు పడుతున్నారు. మిల్లు పునాది దిమ్మలమీద తలా ఒకచోట ఎక్కికూర్చొని ప్రవాహవేగంలో చొచ్చుకువస్తున్న పడవను గడలతో పట్టి ఆపటానికి గల సులువు లేవో ఆలోచిస్తున్నారు. పడవను బాగా దగ్గరదాకా రానిచ్చి, పడవలోకి అందరూ గడలనుగుచ్చి పట్టుకొన్నారు. కానీ వాళ్లు అలా వస్తూవస్తూవున్న పడవను పట్టేసేసరికి, అది కాస్తా తలక్రిందులైంది. అందులోవున్న డాన్ క్విక్ సెట్, శాంకోపాంజా యిద్దరూ నీళ్ళలో బుడుంగున మునిగారు.

ఇంకా నయం!—వాళ్ళిద్దరికీ యీత చేతనవును కాబట్టి తీరిపోయింది. ఈత వచ్చికూడా, డాన్ క్విక్ సెట్ గారు, వీరుడులా కనిపించాలని తొడుక్కొన్న ఆ వుక్కు కవచం వగైరాలు ఆయనకొంపతీసేవే! అప్పటి కప్పుడే వాటిబరువుమూలంగా మనిషి రెండుమాట్లు నది అట్టడుగుభాగాన్ని తాకి పైకి తేలాడు. వాళ్ళ పుణ్యమా అని ఆ మిల్లులో పనిచేసే మనుష్యులు నలుగురూ ఒక్కసారిగా నీళ్ళలోకి దూకేసి యీయనను ఎలాగైతేనేం పట్టుకొచ్చి ఒడ్డుమీద పారేశారు. శాంకోపాంజా మాత్రం ఎవరి సహాయమూ అక్కర లేకుండానే ఒడ్డుకు యీదుకు రాగలిగాడు.

వీళ్ళందరూ ఒడ్డున జేరి కడగట్టుకుపోయిన ప్రాణాలను కొంతలో కొంతగా సేద తీర్చుకొంటూ వుండగానే, వీళ్ళిద్దరూ ఎక్కివచ్చిన ఆ పడవ నీళ్ళలో కొట్టుకొని పోయి పోయి, ఆ మిల్లుచక్రాలకు తగులుకొని పిప్పి పిప్పి అయింది. వీళ్లందరూ సంభ్రమాశ్చర్యాలతో ఆ మిల్లు చక్రాలకేసీ, పగిలిపోయిన పడవతాలూకు ముక్కలు చెక్కలకేసీ చూస్తూ వుండగా, కొందరు పల్లెవాళ్లు పరుగెత్తుకుంటూ అక్కడకు వచ్చారు. తెగ రొప్పుతూనే, యిలా నష్టమైపోయిన తమ పడవను చూచి లబోదిబోమని గోలపెట్టారు. చెట్టుకు కట్టేసిన పడవను వూడదీసి తీసుకువచ్చి మిల్లుచక్రాల్లో పడేసి పాడు చేసినందుకు నష్టపరిహారంగా తమకేదైనా యిస్తే

గాని వీల్లేదని వాళ్ళంతా పట్టుపట్టారు. గత్యంతరం లేక డాన్ క్విక్ సెట్ గారు శాంకోపాంజాను పిలిచి, తాము తెచ్చుకొన్న కొద్దిపాటి రొక్కంలోనుంచీ ఏభైనాణేలు తీసి వాళ్లకు యిచ్చి పంపించివెయ్యమని చెప్పాడు.

అంతటితో యిక తన ప్రతాపాన్ని ప్రకటించే అవకాశం చేయి దాటిపోయిందని గుర్తించిన డాన్ క్విక్ సెట్ గారు, అక్కడినుంచీ కదిలిపోబోయేముందు ఆమిల్లుకేసి తిరిగి అరడజనుసార్లు దీర్ఘనిశ్వాసాలువదలి "ఈ రాతికోటలో బందీవై యిడుమలపాలైన ఓ అపరిచితయువతి ! నాకు ప్రాప్తించిన యీ దురవస్థ కారణముగా నేను నీ చెరను విడిపించలేకపోతిని గదా ! నిన్ను విడుదలచేయు భాగ్యము మరి ఎవీరునికి సంక్రమించనున్నదో కదా ! నేనుమాత్రము అశక్తుడ నైతిని !" అంటూ కన్నీళ్లు జొటజొటా కార్చాడు.

అంత మనిషీ నిలువునా నీరై ఏడుస్తూ వుంటే శాంకోపాంజాకు కూడా కడుపులో చెయ్యిపెట్టి కెలికినట్లు అయింది. దబ్బున తన స్వామిదగ్గిరకు వచ్చి, ఆయనను పడిపోకుండా పట్టుకొన్నాడు. డాన్ క్విక్ సెట్ గారు వాడి భుజంమీద తల ఆనించి అరగంట సేపు వెక్కి వెక్కి ఏడ్చాడు.

"ఊరుకోండి ! ఊరుకోండి ! మీరు ఆపకుండా ఏడుస్తూ వుంటే నాకూ ఏడుపు ఆగటంలేదు...భో ...

భో...భో..." అంటూ వాడూ ఏడ్చేశాడు. అల్లా కొంతసేపు గడిచాక శాంకోపాంజాగాడు తన కోటు జేబులోకి చెయ్యి పోనిచ్చి, మురికిపట్టిన జేబుగుడ్డ తీసి తనకళ్లు తుడుచుకొని, ఆ చేతితోనే ఆయనగారి చెక్కిళ్లు కూడా తుడిచాడు.

ఎట్టకేలకు 'వీరకేసరి' గారి శోకం ఆగిపోయింది. శోకమైతే ఆగిందికానీ, యిద్దరికీ ఎక్కిళ్లు పట్టుకొన్నాయి. ఇద్దరూ ఆ ఎక్కిళ్లతోనే తలలు దించేసుకొని ఏటిగట్టునే నడిచి, యింతదాక తమ వాహనాలను కట్టేసిన చెట్టుదగ్గిరకు వచ్చారు. ఆ మూగ జీవాలకు ఏమి అర్థమైందో ఏమో, వీళ్లిద్దరూ కంట పడిందే తడవుగా ఎగిరి గంతులు వెయ్యడం మొదలు పెట్టాయి. ఇద్దరూ తమ తమ వాహనాలదగ్గరకు పోయి, వాటి మెడలకు తగిలించిన తాళ్లు విప్పేసి, వీపులమీద ఎక్కి కూర్చొన్నారు.

## 15

నౌకావిహారం ఆతీరుగా ముగిశాక డాన్ క్విక్సోట్‌గారు విషణ్ణహృదయులై ఎక్కడికో అంతులేని ప్రయాణం చేశారు. ఆ ప్రయాణంలో ఆయన, ఆయనగారి బంటూ అడవిఅంతా దాటి, మైళ్లతరబడి వ్యాపించివున్న ఒక మైదానంలో తేలారు.

అక్కడ ఒకచోట కొందరు మనుష్యులు గుంపుగా కూడి, పెంపుడు డేగలను ఎగరేసి పందేలు కాస్తున్నారు. ఆరోజుల్లో భాగ్యవంతులైనవారు యీ మాదిరి వినోదవ్యాసంగాలతో కాలంగడిపేవారు. ఈ క్రీడలలో ఆడవాళ్లు కూడా మొగవాళ్లతో సరి సమానంగా పాల్గొనేవాళ్లు. ఇప్పుడు డన్ క్విక్ సెట్ గారి కంటపడిన ఆ మనుష్యుల గుంపులో కూడా ఎవరో ఒకామె వున్నది. బాగా స్థితి మంతురాలల్లే వున్నది. చాలా అందమైన దుస్తులు ధరించింది; రవ్వలు పొదిగిన నగలు పెట్టుకొన్నది; పాలమీది నురుపులా పరిశుద్ధమైన తెల్లని మేనిచాయతో విరాజిల్లుతున్న వుత్తమ జాతి అశ్వాన్ని ఎక్కి, తన ఎడమచేతి మణికట్టుమీద పెంపుడుడేగను నిలబెట్టుకొని, దానివంక అతి వయ్యారంగా చూస్తున్నది. ఈ అన్ని లక్షణాలు చూశాక, డాన్ క్విక్ సెట్ గారు యీమె ఎవరో చాలా గొప్ప యింటి ఆడపడుచు అయివుండాలని నిరూపించు కొన్నాడు. శాంకోపాంజా వైపుకు తిరిగి—

"శాంకో ! అశ్వము నెక్కిన ఆ అంగనను చూచితివా ! సత్వరమే ఆమెకడ కేగి, వీరకేసరి డాన్ క్విక్ సెట్ గారిందు యేతెంచి యున్నారనియు, ఆమె సముఖమునకు వచ్చి ఆమెపట్ల నాకు అవ్యాజముగా ఏర్పడిన గౌరవభావమును వ్యక్తపరుప వేగిరపడు

చున్నారనియు, సవినయముగా విన్నవించి రమ్మ్మ" అంటూ ఒక ఫుత్తరవు వేశాడు.

శాంకోపాంజా, స్వామి చెప్పిందే తడవుగా గాడిద మూపునుంచి దిగి, జంకూ గొంకూ లేకుండా ఆమెదగ్గరకు వెళ్ళి ఆమెగారి పాదాలదగ్గిర మోకరిల్లి—

"అమ్మగారూ! అల్లదే అక్కడ గుర్రమెక్కి వున్నఆ వ్యక్తి ప్రపంచఖ్యాతి పొందిన వీరకేసరి డాన్ క్విక్ సెట్ గారు. నేనాయనగారి బంటును; నన్ను మావూళ్లో వాళ్ళందరూ శాంకోపాంజా అంటారు— నాపేరు ఏదైతే ఏమిటెండి! — ఆ వీరకేసరిగారు తమకు మీపట్ల అవ్యాజంగా కలిగిన గౌరవభావాన్ని వ్యక్తపరుచుకొనేందుకు అనుమతించి అవకాశ మివ్వవలసిందిగా నాద్వారా మిమ్ములను వేడుకొంటున్నారు. ఇంతే నా మనవి." అంటూ తన దూత్యం ముగించాడు.

ఈమాటలు విని, ఆవిడ చాలా ఆప్యాయంగా చిరునవ్వులు నవ్వుతూ "మీ యజమాని అంటున్నావే— ఆ డాన్ క్విక్ సెట్ గారి గురించేగా యిటీవల పత్రికలలో పడుతున్నాయి? ఆయనగా ఏవో అతి సాహసకార్యాలు చేశారనీ, ఆవిడ ఎవరూ— ఆ— 'టొబోసో' 'రాజ్ఞి' 'డల్ సీనియా' కన్యను యీయన ప్రేమించాడనీ పత్రికలలో చదివినట్లు గుర్తు. ఆ డాన్

క్విక్సెట్‌గారేనా యీయన?" అంటూ ఎంతో ఉత్సుకంతో అడిగింది.

ఆవిడ ఒకటితరువాత ఒకటిగా అలాంటి ప్రశ్నలు అరడజనూ కురిపిస్తుంటే శాంకోపాంజా అన్నిటికీ ఔనన్నట్లు బుర్ర తెగ ఆడించాడు.

ఇప్పుడు తనను చూడవచ్చిన ఆ వ్యక్తి డాన్ క్విక్సెట్‌గారే నని ఆవిడగారికి రూఢి అయ్యాక "అయితే చప్పన పోయి, నేనూ 'డ్యూక్' గారూ కూడా (ఆవిడగారి భర్త) డాన్ క్విక్సెట్‌గారిని హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తున్నామని చెప్పు. మా నేవిడీ ఇక్కడకు దగ్గరలోనే వున్నది కనుక, ఆ డాన్ క్విక్సెట్‌గారంతటివాడు మా ఆస్థానానికి రావటంకంటే మాకు ఆనందదాయకమైన విషయం మరొకటి వుండబోదని నామాటగా మీ యజమానితో చెప్పు" అన్నది.

శాంకోపాంజా చంకలు ఎగరేసుకొంటూ మళ్ళీ తన యజమానివద్దకు వచ్చి, డాన్ క్విక్సెట్‌గారికి ఆ విషయాన్నంతా ఎరుకపరిచాడు. అక్కడ వాడా పని చేస్తుండగా, యిక్కడ, యీవిడె తన భర్త అయిన ఆ 'డ్యూక్' దొరగారివద్దకు వెళ్ళి యిలాగు ఫలాని వీరుడు తమ యింటికి రాబోతున్నాడని చెప్పింది. అసలు ఆవిడ తత్వతః చాలా సరదా అయిన మనిషి. ఆవిడకు వేళాకోళాలు అన్నా, వినోదాలన్నా బలే యిష్టం. ఎవరినైనా ఏడిపిస్తూ

వుండటం అన్నిటికంటే ఎక్కువ యిష్టం. ఈ వీరుణ్ణి, యీ ఆయనగారి బంటును కాస్త వుబ్బేస్తే, వాళ్లు ఏవేవో కబుర్లు కథలూ చెప్పతారు కదా, అవి వింటూ కొంత కాలక్షేపం చేయవచ్చునని యీవిడ ఆశపడ్డది. అందుకే డాన్ క్విక్ సెట్ గారిని అంత మన్నిస్తున్నట్లు, ఆయనగారి పాదధూళి సోకినంతమాత్రంచేత తను గృహం పావనమైపోతుందనేటంతటి గౌరవభావం తమకు ఆయనపట్ల వున్నట్లు, యీవిడ శాంకో పాంజానూ నమ్మించి చెప్పింది.

డాన్ క్విక్ సెట్ గారికి యీ విడగారి వుద్దేశాలు ఏమీ తెలియవు. ఆయన ఎప్పుడూ కూడా మనుష్యులు అన్న మాటలే లెక్క చేస్తాడు కానీ, ఆ మనుష్యులు ఆయా మాటలు మాట్లాడేటప్పుడు వాళ్ళ వాళ్ళ మనస్సుల్లో ఏ ఏ వుద్దేశాలు పెట్టుకొని మాట్లాడివుంటారో, అదంతా కనుక్కోవాలని కానీ, అలా కనుక్కోవలసిన అవసరం వుందని కానీ అనుకొనే తరహా మనిషి కానేకాడు. ఆహ్వానం అందినదే తడవుగా బయలుదేరి, ఆమె సమక్షంలోకి వచ్చి సైనిక వందనాదికాలు చేశాడు. ఆవిడకూడా ఆ వందనాలను, వగైరాలను అందుకొని, ఎంతో ఆప్యాయంగా ఆయనను వెంటబెట్టుకు వెళ్ళి తన భర్తతో పరిచయం చేసింది. ఆయనగారు కూడా యీ వీరుణ్ణి చాలా గౌరవిస్తున్నట్లే కనబడ్డారు. వెంపుడు డేగల పందేలన్నీ చప్పున ముగించేసి ఆ డ్యూక్ దంపతులు యీ



వీరకేసరిని వెంటబెట్టుకొని తమ దేవిడీకి తీసుకు వెళ్లారు.

దేవిడీకి పోయే దశలో నే శాంకోపాంజాగాడికి ఆ జమీందారిణిగారితో గొప్ప చనువు ఏర్పడి పోయింది. ఆవిడగారు చాలా సరదా కలమనిషి అని చెప్పానుగా. చదువూ సంస్కారమూ లేని యీ శాంకోపాంజాగాడు మాట్లాడే మాటల్లోనూ

చూచే చూపుల్లోనూ, నడిచే నడకల్లోనే ఏదోచమత్కారం వున్నట్లు ఆమెకు తోచింది. అందుకనే వాణ్ణి ఒక పెంపుడు కుక్కను చూచినంత మురిపెంగా చూసింది. దారిపొడుగునా ఆవిడగారు వీణ్ణి తనతో పాటే వుండమని కోరింది. అప్పుడు వాడు మాట్లాడిన మాటల్లో ఏదో ఒక వింతరకమైన వేదాంతం వాడికి వున్నట్లు, జీవితాన్ని గురించి నాలుగైదు పసందైన సిద్ధాంతాలు వాడిలో జీర్ణించి వున్నట్లు, ఆవిడ అర్థం చేసుకొన్నది. అంతటి గొప్పయింటి వ్యక్తి—అందులోనూ ఆడామె— యిలా తనవంటి చదువురాని వాణ్ణి సమాదరించి సంభాషిస్తున్నదంటే శాంకోపాంజాకు చాలా సంతోషమైంది. ఆ సంతోషంతో వాడు ఎక్కడా ఆగకుండా వూపిరైనా తీసుకోకుండా, కామాలు, ఫుల్‌స్టాపులు సరిచూచుకోకుండా ఏమి టేమిటో ఒకటే ధోరణిలో కబుర్లు చెప్పుకుపోయాడు. ఆ ధోరణిలో కోకొల్లలుగా సామెతలు వాడేశాడు. చదువురాకపోయినా వీడికి వచ్చిన సామెతకు అంతు అన్నది లేదనిపించింది. సామెతమీద సామెతగా, సామెతల వర్షమే కురిపించాడు.

దేవిడీ యిక కొద్దిదూరంలో వుండగానే 'డ్యూక్' గారు తమ గుర్రాన్ని వేగంగా పోనిచ్చి, దేవిడీకి ముందుగా చేరుకొని, వీరకేసరి డాన్ క్విక్ సెట్‌గారి ఆగమనసందర్భంలో ఆయనకు అనుచిత

మైన సత్కారాదులు చేయటానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయించారు.

వీరకేసరి డాన్ క్విక్సెట్ గారు, శాంకో పాంజా తదితరులు దేవిడీ మొదటి ప్రహరీ దాటి లోపలికి వచ్చేసరికి, ఎక్కడినుంచో మించుబోడులు యిద్దరు దబదబా వచ్చి, పట్టుతాపితా ఒకటి అతి వయ్యారంగా తెచ్చి, యీ వీరకేసరి భుజాలమీద కప్పారు. ఈ క్రతువు ముగిసేలోగానే ఆ నెరాబా నెరబా అంతటా దాసదాసీ జనాలు బిలబిలావచ్చి, బారులుతీర్చి నిల్చొని "భీకరానన వీరశూరగ్రేసరా! వీరకేసరీ! వీరకంఠీరవ! స్వాగతం! సుస్వాగతం!!" అంటూ కైవారాలు పలికారు.

వారందరి వదనాలను వీరకేసరి ఆనంద పూరిత నేత్రాలతో విలోకిస్తూ వారిపై తన కేర్పడిన వాత్సల్యభావాన్ని తన చూపులద్వారా వ్యక్తం చేశాడు.

మరొక విడత దాస దాసీ జనం ముందుకు వచ్చి యీ వీరుడు, డ్యూక్ దంపతులు నడుస్తున్నంత మేరా, పన్నీటిజల్లులు కురిపించారు; వారిపై సుగంధ పరిమళజలాలు చిలుకరించారు.

ఇదంతా చూస్తుంటే డాన్ క్విక్సెట్ గారికి తన జన్మ సార్థకమైనట్లు తోచింది. వీరుల వర్గానికి చెందిన వ్యక్తులకు ఏ ఏమాదిరి గౌరవాలు జరగాలని తా నింతకాలమూ కోరుకొంటూ, కలలు కంటూ

వున్నాడో, అవన్నీ అంతకు రెండింతలు మిక్కుటంగా తనకే జరుగుతూవుంటే ఆయన మనస్సు ఆనంద సాగరంలో తేలియాడింది. ఆవిధంగా ఆయన యీ విధమైన అతిథిసత్కారాలతో వుబ్బి తబ్బిబ్బు అవుతుంటే, ఆయనను డ్యూక్ దంపతులు జరీతెరలు వేలాడగట్టివున్న మెట్లమీదుగా మేడమీదికి నడిపించుకుపోయి, విశాలంగా వున్న ఒక పెద్ద హాలులో నిల్చోబెట్టారు. హాలులో ఎక్కడ చూచినా నిలువుటద్దాలు. గోడలమీంద గొప్ప గొప్ప వర్ణచిత్రాలు. ఇవన్నీ చూస్తుంటే ఆయన కళ్లు తిరిగాయి. ఇంతలో అరడజనుమంది అంగనలు వచ్చి, యీాయనచుట్టూ మూగి, అతివయ్యారంగా వొంగి, యీాయనవొంటిపై గల వుక్కుకవచాన్ని కాలి దట్టింపులను అతి సుతారంగా వొలిచివేయటం మొదలుపెట్టారు. ఒంటిపైవున్న బరువునంతా వాళ్లు తీసేశాక, డాన్ క్విక్ సెట్ గారు ఆ పట్టుతాపితాను భుజాలపైనుంచీ వేసుకొని రొమ్ముసు కప్పుకొన్నాడు. కత్తిని మాత్రం వదిలెయ్యకుండా నడుముకే అంటకట్టుకొన్నాడు. నెత్తిమీాద ఆకుపచ్చని మొఖమల్ టోపీ పెట్టుకొన్నాడు. ఈయనగారి యీా ముస్తాబు అంతా పూర్తి అయ్యాక, ఆ అంగనలు నాట్యవిన్యాసాలు చేస్తూ యీాయనను మరొక హాలులోకి నడిపించుకుపోయారు. అది డ్యూక్ గారి భవనంలో భోజనాల సావిడి. అప్పటికప్పుడే అక్కడ నలుగురు మనుష్యులకు

బల్లమీద తెల్లటి దుప్పట్లు పరిచి పళ్ళేలలో పంచ భక్ష్యపరమాన్నాలు వడ్డించి వున్నాయి.

మూడు కుర్చీలలో వరసగా డ్యూక్ దంపతులూ, వీరకేసరిగారూ కూర్చొన్నారు. నాలుగో కుర్చీలో 'డ్యూక్'గారి ఆస్థాన పురోహితుడు కాబోలు — ఆయన వచ్చి కూర్చొన్నాడు. డ్యూక్ దంపతుల మాట అలావుంచినా, దేవిడీలోవున్న దాస దాసీలలో ప్రతి ఒక్కరూ యీ వీరుణ్ణి అంత గౌర వంగా చూస్తూవుంటే యీపురోహితుడు ఒక్కడు— అదేమిటో కాని—యీసనవంక కొరకొర చూడటం మొదలుపెట్టాడు. వాడి ఆ చూపులు చూస్తేనే, డాన్ క్విక్ సెట్ గారికి వొళ్లుమండుకొచ్చింది.

డ్యూక్ భార్యకి శాంకోపాంజా పైన అవ్యాజంగా కుదురుకుపోయిన ఆ వాత్సల్యంకొద్దీ, ఆవిడ వీణ్ణి ఏదో బంటులాగా చూడక, తనతోపాటు అక్కడే వుండమని కోరింది. తామందరూ మాట్లాడు కొనే మాటల్లో వాడుకూడా ఏదో ఒకటి మాట్లాడే టట్టు చేయటానికి ఆవిడ చాలా ప్రయత్నించింది కూడాను. ఆవిడ యిచ్చిన ఆ ఆసరానందుకొని వాడు వసపోసినపిట్టలా ఒకటేవాగుడు వాగాడు. వాడు ఆతీరున ఎంతకీ ఆగకుండా ఏమేమిటో చెప్పబో పోతుంటే డాన్ క్విక్ సెట్ గారికి చిరాకు ఎత్తుకు వచ్చింది. గుడ్లు పెద్దవిచేసి వాణ్ణి గదమాయించ బోయాడు.

ఇంతలో యీ విషయాన్ని కనిపెట్టిన డ్యూక్ భార్య, యీయనగారి ధోరణి మార్చాలని "అయితే డాన్ క్విక్ సెట్ గారూ—మీ రీ మధ్యను డల్సీనియా కన్యనుగూర్చిన కబుర్లు ఏమీ వినలేదా?" అంటూ అడ్డువచ్చింది. డాన్ క్విక్ సెట్ గారు యీవిడ అడుగుతున్న యీ ప్రశ్న వినికూడా, శాంకోపాంజా గాడిమీద ఆయనకు వచ్చివున్న కోపాన్ని వెంటనే దిగమింగుకోలేక, ఆవిడకు వెంటనే ఏ సమాధానమూ యీయలేక గుటకలు మింగుతున్నాడు. ఆవిడ అది కూడా గమనించి, ఎలాగైనా సరే ఆయనకు శాంకో పాంజామీద వచ్చినకోపం తగ్గించి తీరాలన్న పంతం కొద్దీ "ఏమండీ! ఎందరెందరు రాక్షసుల తలకాయలను తెగకోసి ఆవిడ పాదాలముందు పడవేశారో ఆ విషయాలన్నీ మాకు వినిపించరూ ?" అంటూ బ్రతిమాలింది.

డాన్ క్విక్ సెట్ గారికి వచ్చిన కోపం అప్పటికి కొంచెం సర్దుకొన్నది. కోపమైతే సర్దుకొన్నది కానీ ఆయన మనస్సు మాత్రం తేలికపడింది కాదు. కాక పోగా—గుండె బరువెక్కిపోయింది. వేడి నిట్టూర్పులు విడుస్తూ—

"అమ్మా ! తమరు అప్రయత్నముగా నా మనస్సును కలవరపరచు విషయమును ప్రసక్తి తెచ్చు చున్నారు. నా దౌర్భాగ్యమును ఏమని చెప్పుదును? నే నెందరినో రాక్షసులను, భూతప్రేత పిశాచాదులను

మందాంధులైన మానవాధములను పరిమార్చితిని ఆమాట యథార్థమే! కానీ— నా వీర విహారములను విజయోత్సాహములను ఏ అనన్యరూపసి డల్ సీనియా రాకుమారికి విన్నవించవలెనని నే నింత కాలముగా వుత్సహించుచుంటినో, ఆ డల్ సీనియా రాకుమారి నే, మాత్సర్యము పూనిన మాంత్రికుడెవడో మార్చి వేసినాడు...హా!...ఆఅందాలరాణి నే డాముష్క రాధమునిమంత్రప్రభావమున ముదినాపసానియై వికారరూపమున పల్లెసీమల పట్టి తిరుగుచున్నది... నా దురదృష్ట మీరీతిగానుండ ఎవరి నెంత నిందించి మాత్రము ఏమి ప్రయోజనము?" అంటూ దిగులుగా నిట్టూర్చాడు.

సంభాషణ యీ దశకు వచ్చేసరికి 'డ్యూక్' గారు తాను కల్పించుకొని శాంకోపాంజాను పేరు పెట్టి పిలిచి "మాంత్రికుడు మార్చి వేసిన ఆ ముగ్ధను నువ్వుకూడా చూశావా?" అని అడిగారు.

"ఆఁ! చూచావా అని అడుగుతున్నారా? చూశాననే చెప్పాలిసుమండి. అదేమిటో ఆవిడ నా కంటికి ఎంత వికారంగా కనిపించిందంటే,—అంత కంటే వికృతమైన ఆడది యిక పుట్టబోదనిపించింది. అది కాదండీ — డ్యూక్ గారూ; ఆవిడ ఆ గాడిద మీదికి ఎగిరి కూర్చోవటం అదీ చూస్తూంటే నాకు పరమ అసహ్యం వేసిందంటే నమ్మండి."

ఇంతవరకు నిరాఘాటంగా సాగిపోతున్న యీ సంభాషణ ధోరణిని ఆ పురోహితుడు ఎంత మాత్రమూ సహించలేకపోతున్నాడు. ఇక ఆగ లేక— "డ్యూక్ గారూ! యీ మాదిరి వెర్రి ధోరణిని మీరు రెచ్చగొట్టుతున్నారు. ఈ లోకంలో మీరు తెలిసో, తెలియకో యీ వెర్రిధోరణిని ప్రోత్సహిస్తున్నందుకు, రేపు ఆ పరమేశ్వరుని యెదుట మీరు సంజాయిషీ చెప్పుకోవలసివస్తుందనే విష యాన్ని మీ స్మరణకు తేవటానికి సాహసిస్తున్నాను. తరతరాలుగా మీ వంశీయుల ఆత్మ పారిశుద్ధ్యాన్ని పరిరక్షించే బాధ్యత మాపై పడివున్నదికనుకనే యీ మాట అయినా నేను తమకు చెప్పగలుగు తున్నాను." అంటూ ఆ డ్యూక్ గారికి తాను చెప్ప దలుచుకొన్న నాలుగు మాటలూ చెప్పేసి, యిటు డాన్ క్విక్ సెట్ గారి వైపు తిరిగి, ఆ యింట్లో ఆయన అతిథిగా వచ్చాడన్న విషయమైనా గుర్తించుకో కుండా, యిష్టం వచ్చినట్లు తిట్టేశాడు. స్పెయిన్ దేశంలో యీరోజున అసలు యీ వీరులనేవారు ఎవరూ లేనే లేరన్నీ, అటువంటివాళ్ళతో దేశానికి ఎవ్విధమైన అవసరమూ లేదు పొమ్మనీ అన్నాడు. రాక్షసులు, భూత ప్రేత పిశాచాదులు లేనేలేవన్నాడు. మంత్రాలే లేనప్పుడు మంత్రప్రభావానికి లోబడి పోయి అసలు రూపుమారిపోయి తిరుగుతున్న అంగ నలు ఎందునా వుండబోరని అనేశాడు. ఇలాంటి

వాటిపై నమ్మకాలు కలిగివుండే వ్యక్తి అధఃగా ఎవరైనా వుంటే, వాడో వెర్రికుట్టు అయివుండాలని ఆరోపించాడు.

తనంతటి వీరుణ్ణి యింతమంది పెద్ద మనుష్యుల మధ్య పట్టుకొని వెర్రికుట్టు అంటే ఎవరికైనా కోపం వస్తుంది. డాన్ క్విక్సెట్ గారు కూర్చొనివున్నవాడల్లా అమాంతం లేచి నిల్చొని, పళ్లు పటపట కొరికాడు. మనిషి ఆపాదమస్తకం కంపించి పోయాడు. అంత కోపంలోనూ వీరులుఅంటే ఎవరో, వీరులవర్గం అంటే ఏమిటో వీరోచితకార్యాలు అంటే ఏవో అదంతా ఏకరువుపెట్టాడు. ఇన్ని చెప్పి ఆ పురోహితుడు తనకు తెలియని విషయాల జోలికి వచ్చినందుకు చివాట్లు పెట్టాడు. ఈధోరణిలో బాగా అరగంటసేపు వుపన్యసించి "ఏను వీరుడను. వీరునిగానే జీవించి, వీరోచితముగానే యీ తనువును చాలించి తీరెదను. మానవులై పుట్టినవారిలో కొందరు తమ జీవితకాలమునంతటిని పరులను ఆశ్రయించి. వారికి స్తోత్ర పాఠములుజెప్పి వారివలన తృణమో, పణమో పొంది, తన్మూలముగా జీవయాత్రను కొనసాగించుకొనుటతోనే సంతుష్టు లగుదురు. కొందరు, అహంకారపూరితులై కన్నుమిన్ను గానక సంచరించెదరు. మరి కొందరు గోముఖవ్యాఘ్రములవలె వ్యవహరించెదరు. ఇన్ని తరహాలవారు పోగా, మిగిలిన ఆ కొద్దిమందిమాత్రమే ధర్మపథము ననుసరించెదరు.

అట్టివారిలో నే నొకడను. ధర్మసంస్థాపనార్థము నేనునూ, మున్ను ప్రఖ్యాతవీరులు పోయిన మార్గమున నే సంచరించుచున్నాను. ధర్మరక్షణమునకై కంకణము కట్టుకొన్న నావంటివానికి కావలసినది అజరామరమైన కీర్తియే కాని, ధనకనకవస్తు వాహనాదికములు కావు. నేచేయు ప్రతికార్యమూ, నే పలుకు ప్రతివాక్యమూ తోటి మానవులకు సేవచేయుటకే కాని, వారిని కొల్లగొట్టుటకు కాదని గుర్తెరుగుము. ప్రపంచశ్రేయస్సే నా పరమలక్ష్యము." అంటూ తన వుపన్యాసాన్ని ముగించి కుర్చీలో కూలబడ్డాడు.

మిగిలిన వుపన్యాసంమాట ఎట్లావున్నా వుపన్యాసంచివరను డాన్ క్విక్ సెట్ గారు చెప్పిన ఆ నాలుగు ముక్కలు మాత్రం చాలా వుదాత్తంగా వున్నాయి. అవి అంత వుదాత్తంగా వున్నాయన్న విషయం శాంకోపాంజాకు సైతం బోధపడింది. "మా బాగా చెప్పారండి! మా బాగా చెప్పారు." అంటూ వాడు చప్పట్లు చరిచేశాడు.

డాన్ క్విక్ సెట్ గారంటే మొదటినుంచీ మండిపడుతున్న ఆ పురోహితుడికి ఆయనగారి ఆ వుపన్యాసమూ, అందులో తనమీద ఆయన విసిరిన ఆ విసుర్లూ అన్నీ వింటూవుంటే వొళ్లు మరీ మండుకువచ్చింది. ఆయనగారి మాటలకే యీయన అంత మండిపడుతుండగా యీ బంటుగాడు ఆవరసను చప్పట్లు కొడుతుంటే, ఆయనకు వచ్చినకోపం మరి

ఆగిందికాదు. వీడి బ్రతుకంతా బయట పెట్టాలన్న పంతం కొద్దీ ఆయన బుసలుకొడుతూ "నీ బ్రతుకు బండలుకాను! నువ్వు యీ వీరుడి బంటు శాంకో పాంజా వేకదూ! నిన్నెగా యీ వీరుడు ఏదో దీవికి గవర్నరుగా చేస్తానన్నాడు," అంటూ ఏదో వేళా కోళం చెయ్యబోయాడు.

"అవునండీ; అవును. నన్నే ఆయన గవర్నరుగా చేస్తామన్నారు. గవర్నరు కావటానికి కావలసిన అర్హతలు కావలసినన్ని నాలో వున్నాయి కనుకనే ఆయన ఆమాట అన్నారు. ఇదిగో—! ఒక్కమాట చెప్తాను వినండి. 'మంచివాళ్ళతో మెసిలితే మంచితనం అబ్బుతుందన్న' ఆర్యోక్తిలో నాకు వల్లమాలిన నమ్మకం వున్నది. కనుకనే నే నీ మహా పురుషుణ్ణి వెన్నంటివుంటున్నాను. ఆసరా కావాలంటే డాన్ క్విక్ సెట్ గారి లాంటి మహావృక్షాన్ని పట్టుకోవాలిగానీ, బచ్చలితీగెలలాంటి మీబోటివారిని పట్టుకొంటే ఏం ప్రయోజనం?" అంటూ వాడు కుండ బద్దలుకొట్టినట్లు అడిగేశాడు. అంతే కాదు— ఆ పురోహితుడిమీద ఒక సవాలు పారేశాడు. —"నా స్వామిపట్ల నాకుగల విశ్వాసం వృథాపోదు; ఇన్ని మాసాలుగా ఆయనను అనుసరించినందుకు నాకష్టం ఫలించితీరుతుంది; నా యజమానికి పాలించేందుకు రాజ్యాలూ కొదవకావు; నేను గవర్నరు అయ్యేందుకు దీవులూ దొరక్కపోవు! మీరిలా చూస్తుండగానే

కొద్ది రోజులలో నన్ను ఆయన ఒక దీవికి గవర్నరుగా చేసి తీరుతారు” అనేశాడు.

ఈమాట అందుకొని ఆ ‘డ్యూక్’ గారు— “నీవు గవర్నరు అయ్యేందుకు యీ క్షణాన కూడా దీవులలోటు లేదు. డాన్ క్విక్‌సెట్‌గారు నీకు యిచ్చిన వాగ్దానం మేరకు, నిన్ను నేనే, యీరోజే, నాకు చెందిన దీవులలో ఒకదానికి గవర్నరుగా నియమిస్తున్నాను.” అనేశారు. డ్యూక్‌గారు అన్న యీ మాటలు వినేసరికి శాంకోపాంజా మనిషి గడ్డ కట్టుకు పోయాడు. వాడు తనచెవులనే తాను నమ్మలేనిస్థితిలో పడిపోయి, ఎలా నిలబడివున్న మనిషి అలాగే వుండిపోయాడు.

డాన్ క్విక్‌సెట్‌గారు గబగబా వాడిదగ్గరకు వెళ్ళి “శాంకో! ఓనా శాంకో! ‘డ్యూక్’ గారు ఆడినమాట నీకు వినిపించనే లేదా! వారు నీపట్ల కనపరచిన ఔదార్యమునకు వేగమె వారి పాదముల చెంత మోకరిల్లి, ధన్యవాదము లర్పింపుము.” అంటూ వాడికి తక్షణ కర్తవ్యాన్ని బోధించాడు.

శాంకోపాంజాకు అప్పటికి అర్థమైంది — తాను యింతవరకూ కలలు కనటం లేదన్నీ, నిజంగానే డ్యూక్‌గారు తనను గవర్నరుగా నియమిస్తున్నారనీ. ఉన్న చోటినుంచీ ఒక గంతువేసి ‘డ్యూక్’ గారి పాదాలదగ్గిర పడి, ఆయన రెండుకాళ్లూ పట్టుకొని కళ్ళకు అద్దుకొన్నాడు. వాడా వరసను ఆయనగారి

పాదాలు పట్టుకు వేళ్లాడుతూ వుండగా, ఆ పురో హితుడు యిక సహించలేక భోజనంముందు కూర్చొన్నవాడల్లా లేచి రుసరుసలాడుకొంటూ బయటకు వెళ్లిపోయాడు.

పంక్తిలో వున్న మనిషి ఒకడు అలా అర్ధాంతరంగా లేచిపోయినా, మిగిలిన ముగ్గురూ మాత్రం కొంతసేపటికి తేరుకొని భోజనాలు పూర్తి చేశారు.

భోజనాల సమయంలో రేగిన ఆవేశాల మూలంగా డాన్ క్విక్‌సెట్‌గారి మనస్సు బాగా అలిసిపోయింది. అందులోనూ కమ్మని భోజనం దొరకనే దొరికింది గదా అని, మరికొంచెం జాస్తిగానే పట్టించాడేమో, ఆయనగారికి భోజనాలు కానటంతోటే భుక్తాయాసం బద్ధకం అన్నీ వచ్చేశాయి. తన కోసం ప్రత్యేకించిన గదిలోకి పోయి పడుకొన్నాడు. శాంకోపాంజాకు కూడా పడుకోవాలనిపిస్తున్నది కానీ, 'డ్యూక్‌గారి' భార్య అతగాణ్ణి పడుకోనిచ్చింది కాదు. తనతోపాటే వాణ్ణి తానుండే గదికి తీసుకుపోయి, అక్కడ పదిమంది ఆడంగులనూ పోగుచేసి కూర్చోబెట్టి, వీడిచేత తెగవాగించింది. వాడు తెలిసో, తెలియకో ఏదో ఒకమాట అంటూ వుండటమూ, వాడా మాటలు అన్నప్పుడల్లా అంతమంది స్త్రీ కంఠాలు గొల్లున పగలబడి నవ్వటంతో గంటల కొద్ది కాలం గడిచిపోయింది. అప్పుడు వాడు పడిన మాటలు వింటున్నకొద్దీ ఆవిడకు వీణ్ణి బుజ్జగించాలనే బుద్ధి

అంతకంతకూ ఎక్కువైంది. ఎన్నిరోజులు వీలైతే అన్నిరోజులు వీణ్ణి తనదగ్గిరే అట్టే పెట్టుకొని, వీడిని వాగించి తీరాలని ఆవిడ తనలో తాను ఒక నిశ్చయానికి వచ్చేసింది.

# 16

శాంకో పాంజాగాడు (కాదు కాదు - ఆయన గవర్నరు కాబోతున్నారు కనుక, మనంకూడా ఆయనను యిక 'గాడు', 'గీడు' అనరాదు)—ఘనత వహించబోయే గవర్నరు శాంకోపాంజాగారి మాట తీరుచూసి ముచ్చటపడిన డ్యూక్ భార్య ఆయనను తనకూడా అంతఃపురంలోకి తీసుకువెళ్ళింది. -తానొక వున్నతాసనంమీద కూర్చొని, ప్రక్కనే ముక్కాలి పీట ఒకటి వుంటే, దానిమీద యీ కాబోయే గవర్నరుగారిని కూర్చోమన్నది. తానింకా గవర్నరు కాలేదుకదా, అటువంటప్పుడు యిలాంటిగొప్పవారితో సమానంగా కుర్చీలమీద, సోఫాలమీద కూర్చోవటం ఎందుకు లెమ్మని శాంకోపాంజాగాడు అనుకొని, అలా నిలబడే వుండిపోయాడు. ఆవిడమాత్రం అందుకు ఒప్పుకోలేదు. "డ్యూక్ నిన్ను గవర్నరుగా చేస్తామన్నారుగా. ఇకనేం? దర్జాగా మహారాజులాగా ఆ పీటమీద కూర్చో. కూర్చోవటం గవర్నరులా కూర్చొన్నా, నాతోమాటాడేప్పుడు మాత్రం మామూలు శాంకోపాంజాలాగే - అంటే వీరకేసరి

డాన్ క్విక్‌సెట్‌గారి నమ్మిన బంటులాగే మాట్లాడాలిసుమా” అని వేళాకోళంచేసింది. మొత్తానికి ఎల్లాగైతేనేం పట్టి బలవంతాన ఆయనను ముక్కాలిపీటమీద కూర్చోపెట్టింది.



ఆ మాటా యీ మాటా మాట్లాడుతూ డాన్ క్విక్‌సెట్‌ గారిని గురించి తనను పట్టుకు వేధిస్తున్న

ఒకటి రెండు అనుమానాలు నివృత్తిచేయమని యీాయనను అడిగింది. డాన్ క్విక్ సెట్ గారి వీరవిహారాలనుగురించి పత్రికలలో ఎప్పటికప్పుడు పడుతున్నవి కదా! అవి చదువుతూంటే తనకు ఆ అనుమానాలు తగిలాయని చెప్పింది.

ఆవిడ ఆ రెండు అనుమానాలనుగురించీ బైట పెట్టేసరికి, శాంకోపాంజాగారు, తన నోటిమీదికి చూపుడు వేలు అడ్డంగా పెట్టి 'యిస్' 'యిస్' అన్నారు. పిల్లికిమల్లే చప్పుడు చెయ్యకుండా అడుగులు వేసుకొంటూ పోయి అక్కడవున్న కిటికీలన్నిట్లోనుంచీ తల బయటకుపెట్టి పరాయి వారెవరైనా వున్నారేమోనని వెతికారు. కిటికీలకీ, తలుపులకీ వేలాడగట్టివున్న తెరలు అవీ అన్నీ తొలగించి వాటి చాటున ఎవరైనా దాక్కుని వున్నారేమోనని పరీక్షగా చూశారు. ఒకటికి రెండుసార్లు మూలమూలలు కూడా గాలించి చూసి, ఎక్కడా ఎవరూ లేరని తన మనస్సుకు బాగా నమ్మకం తోచాక తిరిగివచ్చి యథాస్థానంలో కూర్చొని, ముందుకు వొంగి "చూడండి అమ్మా! ఈ చుట్టుపట్ల పరాయివారు ఎవరూ లేరు కాబట్టి, మీరు అడిగిన వాటికి సమాధానం చెప్పటానికి సాహసిస్తున్నాను. అన్నిటికంటే ముందు నేను తమకొక గొప్ప రహస్యాన్ని చెప్పవలసివున్నది. జాగ్రత్తగా

వినండి...మళ్ళీ యీమాట మరెవరితోనూ అనబో కండేం!...మా యజమాని వున్నారే— ఆ డాన్‌క్విక్ సెట్‌గారు, ఆయనగారికి పూర్తిగా పిచ్చి ఎత్తిందని నాకో గట్టినమ్మకం. అంత పిచ్చి ధోరణిలో వుండి కూడా ఒక్కొక్కప్పుడు ఆయన ఎంత బాగా మాట్లాడుతారనుకొన్నారూ ? తర్కం చదివిన పండి తులకంటెకూడా యీయన చాలా చమత్కారంగా మాట్లాడుతారు. ఆయనకు అంత పిచ్చి పట్టిందా?— అయినా ఆయనమాటలు వింటూవుంటే 'యీయనకు పిచ్చేమిటి' అనిపించేటంత తెలివి తేటలుగా కూడా మాట్లాడుతారండీ! కాకపోతే — ఒకవిషయం — ఆయనకు అంతలావు పిచ్చి పట్టింది కనుకనే, ఆయన చేత ఏ విషయాన్నైనా యిట్టే నమ్మించవచ్చు. లేక పోతే—డల్‌సీనియా రాకుమారి మాంత్రికుడి ప్రభా వంచేత పల్లెపడుచుగా మారిపోయిందని నేనుఅన్నంత మాత్రంచేత ఆయన నమ్మేవారా? మనిషిలో దోస కాయంత పిచ్చి వుండబట్టే నే ఆడిన ఆ మాటలను నమ్మి మిన్నకున్నారు" అన్నారు.

"ఏమి టేమిటీ ? డాన్ క్విక్‌సెట్‌గారు నిజం గానే పిచ్చివాడన్నమాట...అది సరేకానీ ఆ మంత్ర ప్రభావం అంటున్నావే — దాన్నిగురించి సరిగా వివరించి చెప్పు" - డ్యూక్‌గారి భార్య కోరింది.

శాంకోపాంజాగారు తాము ఆనాడు బయలు దేరినది మొదలుకొని డల్‌సీనియా రాకుమారితో

డాన్ క్విక్సెట్ గారు సమావేశమయ్యే పర్యంతం కథ అంతా వివరించి చెప్పి, ఆవిధంగా ఎవరైన కన్య డల్ సీనియా కానే కాదనీ- ఎవరో పల్లెపడుచు ఆదారిని వస్తుంటే, తనే ఆవీరుణ్ణి ఏడిపించటానికి ఆవిడే డల్ సీనియా అని చెప్పి నమ్మించాననీ చెప్పుకొచ్చారు. ఈయన చెప్పిన కథను సాంతం విని "అయితే నాకు తెలియక అడుగుతాను!—నీ యజమాని ఆ డాన్ క్విక్సెట్ గారు పిచ్చివాడనే నమ్మకం నీకు బాగా వున్నదని చెప్పుతున్నావు కదా! అయినా ఆయనను వదిలిపెట్టకుండా అంటిపెట్టుకు తిరుగుతునే వున్నావు కనుక, నీవు ఆయనకంటే కూడా వెర్రివాడివై వుండాలి. తనను తానే ఒక హద్దులో పెట్టుకోలేని యింత వెర్రివాడవు, అంతపెద్ద దీవికి గవర్నరువై, ఎల్లాగ అంతమంది అమాయిక ప్రజల ప్రాణాలు కాపాడగలవో నాకు అర్థం కావటంలేదు" అంటూ తనకుతోచిన అనుమానాన్ని తానూ వెళ్ళబెట్టింది.

"అమ్మగారూ! తమకు నిజం తెలిపిచ్చారు. మీరు చెప్పినదాంట్లో ప్రతి అక్షరం కోట్లకొలది విలువైనది. అవును - నేనే కనక, నిజంగా తెలివిమాలిన మనిషిగా పుట్టివుంటే, యిలాంటి పిచ్చి యజమాని దొరికినందుకు నన్ను నేను తిట్టుకొని, ఎప్పుడో ఆయనతో తెగతెంపులు చేసుకొని, నా బ్రతుకు ఏదో నేను చూసుకోవలసింది. కాని నేను అలా చేయలేదు. అలా చేయలేనుకూడాను! ఏమంటారా? - ఆయనదీ

నాదీ ఒకే వూరు. ఆయన పెట్టిన వుప్పుతిన్నాను. ఆయన పోసిన పులుసు తాగాను. అందుకని ఆయన అంటే నాకు అపారమైన విశ్వాసంవున్నది. కనుక నే-నొక్క మృత్యువు తప్ప వేరెవ్వరూ మమ్మల్నిద్దర్ని యీ జన్మలో వేరుచేయలేరంటే నమ్మండి. ఆయన పిచ్చి వాడైతే అయ్యారు. ఆయన వుప్పుతింటున్నాను కాబట్టి ఆయనను అంటిపెట్టుకు వుంటున్నాను. ఇదే కారణంగా మీరు నాకు గవర్నరుపదవి ఈయతగదనుకొంటే - మంచిదే! నేనా- పుట్టుదరిద్రుణ్ణి. అటువంటి నేను గవర్నరుపదవికి తగనేమో అన్న దిగులు ఎందుకుపడాలి? ఆ కారణంగా నా ఆత్మను ఎందుకు క్షోభపెట్టుకోవాలి? మరొక్కవిషయం. అర్హతలు అనర్హతలన్నవి మనిషి బ్రతికివున్నంత వరకే. ఆతరువాత ఏవీ లేవుకదా! చచ్చాక మహారాజుకైనా కావలసింది ఆరుఅడుగుల స్థలమే. బిచ్చగాడికీ ఆ ఆరుఅడుగుల స్థలమే సరిపోతుంది. ఇంకొక విషయం - 'తెల్లటివన్నీ పాలు నల్లటివన్నీ నీళ్లు కావ'ని పెద్దలు అన్నారు. అలాగే 'మెరిసేవన్నీ మేలిమికావ'న్నారు. ఇంకా - "పైమెరుగులుచూసి మోసపోవద్ద"న్నారు. ఇంకా యిలాగే పెద్దలు చాలా చాలా సామెతలు చెప్పారు. మచ్చుకి మరికొన్ని జ్ఞాపకం తెచ్చుకు చెప్తాను; వినండి." అంటూ బుర్ర గోక్కుంటూ సామెతలు జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు.

ఈ దశలోగనుక డ్యూక్ భార్య ఆయన ధోరణికి అడ్డురాకపోతే, యిక ఆయన ఏకరువు పెట్టే సామెతలకు అంతుఅన్నది వుండేదికాదు. సామెతలు ఏకరువుపెట్టటమంటే, కాబోయే గవర్నరు శాంకో పాంజాగారికి వల్లమాలిన యిష్టం. ఆ విషయం గమనించేకాబోలు ఆవిడ, ఆయనగారి మాటలధోరణికి అడ్డువచ్చి, "ఇదిగో! ఇటు చూడు. వీరులకు ఆడిన మాటకు తిరుగు వుండదుకదా? మా ఆయన వీరుడు కాకపోయినా, వీరకంకణం కట్టించుకోకపోయినా, వీరుడంతటి ఆసామి. కాబట్టి ఆయన మాటకు తిరుగు వుండదు. ఆయన అన్నమాట జరిపితీరుతారు. ఏది ఏమైనాసరే. ఒకసారి 'నిన్ను ఫలానిదీవికి గవర్నరుగాచేస్తాను' అని ఆయన అన్నతరువాత, ఆదీవికి నిన్ను గవర్నరుగా చేశారన్నమాటే! ఇక ఆ విషయంలో నువ్వు నీమనసులో ఎంతమాత్రపు అనుమానమూ పెట్టుకోకు. అంతెందుకు! ఎప్పుడో ఒక రోజు వున్నట్లుండి నువ్వు గవర్నరుగారు కూర్చుచే సింహాసనంలో వుంటావు - చూసుకో! ఇప్పుడు నేను చెప్తున్నానుకదా! ఆ క్షణంవరకూ నీకు తెలియకుండానే వుంటావు. ఎప్పుడో అంతా గమ్మత్తుగా, గారడీలాగా జరిగిపోతుంది, పట్టాభిషేకం! కాకపోతే- ఒక్కవిషయంమాత్రం మనస్సులో వుంచుకో. నీవు గవర్నరు కాబోయే దీవిలో మర్యాదస్థులైన పెద్దపెద్ద వాళ్లు ఎందరోవున్నారు. వాళ్లతో మాట్లాడేటప్పుడు

ఎలా మాట్లాడాలో, వాళ్లతో వ్యవహారాలు ఎలా నడపాలో ఆ విషయంమాత్రం జాగ్రత్తగా చూసుకో." అంటూ ఆవిడ ఆయన ఆశలను రెచ్చగొట్టి, అభయహస్తం యిచ్చింది.

ఇలాగే మరికొంతసేపు ఆ గవర్నరుగిరీని గురించిన సంభాషణలు జరిగాక, ఆవిడ శాంకో పాంజాగారిని పోయి, కాసేపు విశ్రాంతితీసుకోమని సెలవిచ్చింది. మొత్తానికి తనకు గవర్నరుగిరీ రాబోతున్నదనే విషయం యీవిడగారి నోటిచలువ వల్ల మరింత బాగా రూఢి అయినందువల్ల, శాంకో పాంజాగారి మనస్సు మరీ బాగా తేలికపడింది. ఆ సంతోషంకొద్దీ, ఆవిడకు వొంగి వొంగి దణ్ణాలు పెట్టారు. తానిక కాసేపు పడుకొంటాననీ, తాను మళ్ళా నిద్దర లేచేవరకు ఆ అమాయికపు ప్రాణి 'డాపుల్'ను కాస్త పదిలంగా చూడమని ఆవిడను బ్రతిమాలారు.

ఆ పేరు వినగానే ఆవిడ ఉలిక్కిపడి, 'డాపుల్' ఎవరని అడిగింది. 'డాపుల్' అనేది తన గాడిదకు తాను ముద్దుగా పెట్టుకొన్న పేరు అనీ, ఆ గాడిదను తను తన ప్రాణంతో సమానంగా చూచుకొంటున్నాననీ శాంకోపాంజాగారు తేటతెల్లంగా చెప్పారు. అందుమీదట ఆవిడ ఆ డాపుల్ యోగక్షేమాలను

చూచే బాధ్యత తమపై వదిలిపెట్టి, శాంకోపాంజా గారు నిర్భయంగా నిద్రపోవచ్చని, సెలవిచ్చారు. నిద్ర పోయేటప్పుడే కాదు, — రేపు గవర్నరు వుద్యోగానికి పోయినప్పుడుకూడా ఆ గాడిదను నిక్షేపంలా యిక్కడ వుంచి వెళ్ళవచ్చునని అంటూ, ఆ విధంగా చేసినట్లయితే 'యింతకాలం యీాయనను మోయటంతో అలసిపోయిన ఆ గాడిద ప్రాణం, కొంత తేరుకొని బాగుపడుతుందని' కూడా ఆవిడ సలహా యిచ్చింది. శాంకోపాంజాగారికి చాలా సంతోషమైంది. ఏదో తనను నమ్ముకొని యింతకాలం తనతోపాటే వుంటున్న ఆ గాడిదకు, యిప్పుడు యీ విధంగానైనా కాస్త మంచిరకం గడ్డీ, పూర్తిఅయిన విశ్రాంతి దొరుకబోతున్నందుకు ఆయన చాలా సంతోషించి, అక్కడనుంచి లేచి తనకోసం ప్రత్యేకం ఏర్పాటైవున్న గదికి పోయి నడుం వాల్చారు.

శాంకోపాంజా తప్పుకొన్నాక, డ్యూక్ భార్య కూడా కూర్చొన్న చోటినుంచి లేచి, భర్తను వెతుక్కొంటూ వెళ్లింది. తనకూ శాంకోపాంజాకు యింతసేపూ జరిగిన ఆ సంభాషణ అంతా చెప్పి, పిల్లతో యీ వేళాకోళం యింకా ఏఏ విధంగా కొనసాగించాలో అదంతా ముందుగా ఆయనతో ఆలోచించాలని ఆవిడ తొందరపడింది.

# 17

డ్యూక్, డ్యూక్‌భార్య యిద్దరూ కలిసి ముందుగా వేసుకొన్న ప్లానుప్రకారం మరునాటి మధ్యాహ్నం శాంకోపాంజాగారిని గవర్నరు హోదాలో ఆ దీవికి పంపే ఏర్పాట్లన్నీ జరిపారు. శాంకోపాంజాను గవర్నరుగా నియమించటానికిగాను డ్యూక్‌గారు తమ జమీలోనే ఒక చిన్న పట్టణాన్ని ఎన్నుకొన్నారు. ఆ పట్టణానికి కావలసిన అన్ని లక్షణాలు వున్నాయి కానీ, అది దీవిమాత్రం కాదు. కాకపోతే వచ్చిన నష్టమేమిటి లెమ్మని, ఘనత వహించిన గవర్నరు శాంకోపాంజాగారు సరిపెట్టుకొన్నారు.

శాంకోపాంజాగారు తమ ముఖ్యపట్టణానికి పరివారసమేతంగా, పటాటోపసంభరితంగా, తరలిపోయే ఆ శుభలగ్నం సమీపించింది. అంతటి మహోన్నత బిరుదాన్ని స్వీకరించబోతున్న వ్యక్తి కనుక, యీ శాంకోపాంజాగారు తొడుక్కొన్న బట్టలూ అవీ బాగా నదరగా వుండాలి కనుక, డ్యూక్ భవనంలోని దాసీలు కొందరు ముచ్చటగు మొఖమల్ కోటు ఒకటీ, [illegible] ఆ గెనూదికి [illegible]కరంగు కుచ్చుటోపీ ఒకటి పట్టుకొచ్చి, ఆయన తొడుక్కొని వున్న ఆబట్టలపైనే తొడిగేశారు. ఈ మొఖమల్ కోటు బాగా మోకాళ్లకిందివరకు వచ్చి మనిషి కదలటానికి

వుతుకుష్టంగా వుంది. అయితే ఏం? అది మొఖమల్ కోటు! రాజులు, గవర్నర్లు తొడుక్కొనే కోటు! అలాంటి కోటును చూసి 'దీని రంగు బాగలేద'ని కానీ, 'యిది మోకాళ్ళకిందికివచ్చింద'ని కానీ ఆయన



అనుకోరు. మన మెవరమూకూడా అలాటి మాట అన రాదు; వినరాదు.

ఈవిధంగా వస్త్రాలంకరణాదులు ముగిశాక, ఆయనను నలుగురు దాసీవాళ్లు పట్టుకొచ్చి ఒక కంచర గాడిదమీద అడ్డంగా కూర్చోబెట్టారు. ఈయనగారి చిరకాల వాహనమైన, ఆ డాపుల్‌కు మెడలోనూ, తోకచివరనూ పట్టురిబ్బన్లూ అవీ దట్టంగా కట్టి, కూడా పట్టుకువచ్చి శాంకోపాంజాగారు ఎక్కిన కంచర గాడిదకు వెనుకవైపున నిలబెట్టారు.

అన్నట్లు— ఈయనగారు కంచరగాడిద నెక్కబోయేముందు డ్యూక్ వద్దకు, ఆయన భార్య వద్దకు వెళ్ళి ఒక్కొక్కళ్లదగ్గిర అరగంటకుపైగా వంద నాదికాలు ఆచరించారు. తనవంటి నిరక్షర కుక్షిపై దయతలచి, దీవికి గవర్నరుగా చేస్తున్నందుకు వారికి తానిక పది జన్మలవరకు ఋణపడివుంటానని చెప్పుకొన్నారు. ఆయన అంత అమాయకంగా వంగి వంగి దణ్ణాలుపెట్టి అవరసను ఆనందబాష్పాలు కారుస్తూ వుక్కిరి బిక్కిరి అయిపోతూవుంటే, అది చూసిన ఆ డ్యూక్ దంపతులు యింత కపటమెరుగనివాణ్ణి పట్టుకు వేళాకోళం చేస్తున్నందుకు ఒక్కక్షణంసేపు తమ మనస్సులో తామే బాధపడ్డారు. మళ్ళీ ఎందుకనో—ఆ భావాన్ని మనస్సులోనే అణచేసుకొని అనుకొన్న ప్రకారం ఆతంతు అంతా నడిపించటానికే నిశ్చయించుకొన్నారు.

డ్యూక్ దంపతులతో వీడ్కోలు యీతీరుగా ముగిసింది కానీ డాన్ క్విక్ సెట్‌గారివద్ద శాంకోపాంజా గారు శెలవు తీసుకొన్నవైనం చాలా హృదయ విదారకంగా నడిచింది. వీరకేసరి డాన్‌క్విక్‌సెట్ గారు, యింతకాలం తనను నమ్మి, కంటికి రెప్పవలె కాపాడుతున్న శాంకోపాంజా యిప్పుడు తనకు దూరమైపోతున్నందుకు, ఆ వియోగబాధను భరించ లేక రెండుకళ్ళనుంచీ జొటజొట అశ్రువులు రాల్చారు. ఆయన కార్చిన ఆ కన్నీటిలో ప్రతి బిందువూ ఆయన గారికి శాంకోపాంజాపట్లగల ఎనలేని ప్రేమకు ప్రబల తార్కాణంగా మనం ఎంచవచ్చు. శాంకోపాంజా గారు పడుతున్న ఆ బాధ, ఆ ఆవేదన, మాటలలో వర్ణించి చెప్పలేం. కొత్తగా కాపరానికి వెళ్లుతున్న పల్లెటిదిక్కుపిల్ల ఏడ్చినంత కయ్యాళీగా ఏడ్చాడు. ఎట్టకేలకు డాన్ క్విక్‌సెట్‌గారే ఎలాగో ఓలాగు మనిషి కొంచెం తెప్పరిల్లి "పోయిరమ్ము! శాంకో! తనువులు వేరైనా మనమనసు లొకటేగా!"...(ఒకటి రెండు గుటకలు మింగి) క్షేమముగా వేగి. లాభముగా రమ్ము! నే నెందున్ననూ సతతమూ నీ ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై ఆ కరుణామయుని ప్రార్థించెదను. పోయి రమ్ము!" అంటూ శాంకోపాంజాగారి నెత్తిమీద రెండు చేతులు పెట్టి దీవించాడు.

ఆ మాటలతో శాంకోపాంజాగారి విచారం కట్టలు తెంచుకు ప్రవహించింది. ఆ హాలు హాలంతా

వీ రుభయులు కార్చిన కన్నీరు కాలువలు కట్టింది. శాంకో పాంజాగారిని లేవనెత్తి బిగ్గ కౌగిలించుకొని, మరొక పది నిమిషాలపాటు వెక్కి వెక్కి ఏడ్చి, కాలాతీతం అవుతున్నదన్న విషయం జ్ఞప్తికిరాగా శాంకో పాంజాగారిని జబ్బపట్టుకు నడిపించుకుని ఆ హాలు గుమ్మందాకా వచ్చాడు. ఆపినకొద్దీ ఆయన ఏడుపు ఎక్కువౌతున్నది. ఇక అక్కడ వుండలేక, శాంకో పాంజాగారు సొంతం కంచరగాడిద నెక్కే వరకూ చూస్తూ నిలబడలేక, ఆయన హాలుతలుపులను గభీమని వేసేసి, చకచకా పోయి మంచంమీద బోర్లబొక్కలా పడుకొని, కుళ్ళికుళ్ళి ఏడ్చాడు. అలా ఏడుస్తూనే- తన చేతిలోనే గనక ఆ అధికారంవుంటే శాంకో పాంజా గవర్నరుగిరీని వెంటనే రద్దుచేసి పారేసి తనవద్దనే వుంచుకొందునుకదా-అని కూడా అనుకొన్నాడు. ఏమనుకొంటే ఏం లాభం! ఆ అధికారం తనకు లేదుగదా అని సరిపెట్టుకు వూరుకొని, కొంతసేపటికి తనకు తెలియకుండానే నిద్రపోయాడు.

వీరకేసరిగారు యీ వరసను పరిగంగురు తెత్తి, తల్లికి దూరమైపోయిన బిడ్డలా ముఖంపెట్టేసి, కాలుగాలిన పిల్లిలా యిల్లంతా అదేపనిగా తిరుగుతూ వుంటే డ్యూక్ భార్య మనస్సు చివుక్కుమన్నది. వీళ్లిద్దరికీ ఎడబాటు చేసినందుకు ఆవిడ చాలా పరితపించి తమ ఆస్థానంలో వుండే నౌకర్లలో కాని, దాసీలలో కాని ఎవరు నచ్చితే వారిని యీ వీరకేసరిగారు

యథేచ్ఛగా, తన యిష్టంవచ్చినంతకాలం బంటుగా అట్టే పెట్టుకొని యీ మనఃక్లేశాన్ని పోగొట్టు కొమ్మని, నిద్రలేచాక, ఆయనను బ్రతిమాలింది.

ఆవిడ అంత యిదై చెప్పినా, తన శాంకో పాంజావంటి బంటు యిదివరకు పుట్టలేదనీ, యికముందు పుట్టబోడనీ చెప్పి, అలాంటి బంటు 'లేకు లేకని ముందు యుగముల పురుషులు తల లూపవలదె' అంటూ నిట్టూర్చాడు. అంతే కాదు,—తన శాంకో పాంజా తనవద్ద లేకుండాపోయినప్పుడు తనకు మరొక సేవకుడు ఎవరూ అక్కరేలేదనీ, తనకు తానే సేవకుడుగా వుంటాననీ చెప్పి, ప్రస్తుతం డ్యూక్‌గారుగానీ ఆయన భార్య కానీ, తదితరులు కానీ తనకు చేయగలిగిన గొప్ప సహాయమల్లా, తనను మరికొంతసేపు ఒంటరిగా వుండనివ్వటమే ననీ, సవినయంగా విన్నవించాడు.

ఘనత వహించిన గవర్నరు శాంకో పాంజాగారు కంచరగాడిద నెక్కి, అశ్వము లెక్కిన అంగరక్షకులు మేళతాళాలతో వెంటరాగా, మందగమనాన ముందుకు పోతున్నారు. ఆయన అంగరక్షకులలో ఒకడు కొంతసేపటికి ఎలాగో ధైర్యం తెచ్చుకొని యీాయనగారి ప్రక్కకువచ్చి మాటలు మొదలు పెట్టాడు. వాడడుగుతున్న ఆ ప్రశ్నలకు యీాయన ముభావంగా సమాధానాలు చెబుతున్నారు. అలా కొన్నిమైళ్లదూరం ప్రయాణం చేశాక, తాను గవ

ర్నరు కాబోతున్న బారటారియా పట్టణాన్ని యీయన సురక్షితంగా చేరుకొన్నారు.

డ్యూక్‌గారు అంతకుముందే చేసిన ఏర్పాట్ల ననుసరించి ఘ. వ. గవర్నరుగారు పట్టణపొలిమేరల్లో కాలు పెట్టగానే పురప్రముఖులు, మేజిస్ట్రేట్లు ఎదురు వచ్చి స్వాగతమిచ్చారు. అధికారచిహ్నమైన తాళం చెవుల గుత్తులను ఆయన చేతికి తాకించారు. చర్చి గంటలు గణగణ మోగించారు. పట్టణంలోని ప్రజలంతా వీధుల్లో నిలబడి క్రొత్త గవర్నరుగారికి ఘన స్వాగతమిచ్చారు. ముఖ్య వీధులలో సంబారం ముగిశాక, యీయనను స్థానికాధికారులు పెద్ద చర్చికి నడిపించుకువెళ్లారు. అక్కడకూడా క్రొత్తగవర్నరుగారి ఆయురారోగ్యాభివృద్ధికై ప్రార్థనలు జరిగాక, అటునుంచి అటే, న్యాయస్థానానికి తీసుకువెళ్ళి ప్రసన్నతమైన సింహాసనంమీద కూర్చుండబెట్టారు.

అప్పటికప్పుడే రెండుకేసులు విచారణకు వచ్చాయి. వాటిలో మొదటికేసు, ఒక రైతుకు ఒక దర్జీకి వచ్చిన తగాదావిషయం. ముందు దర్జీ బోనులోకి ఎక్కి, ఆ రైతు ఒక గుడ్డముక్క తెచ్చి తన చేతికి యిచ్చి 'యిది ఒక టోపీ తయారుచేయటానికి సరిపోతుందా' అని అడిగాడనీ, తాను సరిపోతుందన్నాననీ చెప్పాడు. అంతమీదట ఆ రైతు 'రెండు టోపీలకు సరిపోతుందా' అని అడిగాడనీ, తను సరిపోతుందన్నాననీ, మళ్లీ 'మూడు టోపీలకు సరిపోతుందా' అని అడిగా

డనీ, తాను అందుకూ, సరిపోతుందని' చెప్పాననీ, చివరకు 'ఐదుటోపీలకు సరిపోతుందా?' అని ఆ రైతు అడిగితే తాను సరిపోతుందని చెప్పి ఆ ప్రకారమే ఆ గుడ్డతో ఐదుటోపీలూ కుట్టేననీ న్యాయాధికారికి విన్నవించాడు. రైతు కోరిన ప్రకారమే తాను ఐదుటోపీలు తయారుచేసినా, ఆయన తనకు న్యాయంగా రావలసిన మజూరి యివ్వటం లేదని ఫిర్యాదు చేశాడు.

ఘ. వ. గవర్నరు శాంకోపాంజాగారు ఆ రైతువైపు తిరిగి 'నిజమేనా?' అని అడిగారు. ఆ రైతు వంగి వంగి దణ్ణాలు పెట్టి "నిజమేనండి. కానీ తమరు ఆ టోపీలను ఒక్కసారి తిలకించండి" అంటూ తన కోటుజేబులోకి చేతిని పోనిచ్చి ఐదు టోపీలనూ పైకి తీశాడు. అవి ఆ చేతి ఐదు వేళ్లకు సరిపోయేటంతే వున్నాయి! ఐదు టోపీలను ఐదు వేళ్లకు పదిలంగా తగిలించుకొని కోర్టులో వున్న వారికందరికీ కనిపించేలా చేతిని పైకి ఎత్తాడు. కోర్టులో వున్న వారందరూ ఘొల్లున నవ్వారు.

ఘ. వ. శాంకోపాంజాగారు కూడా చిన్న మందహాసం చేసి కోర్టువారంతా విస్మయంగా వున్నకేసుని చెప్పి, ఉల్లాసంగా తీర్పు యిచ్చారు. 'ఆ రైతుకీ, యీ దర్జీకీ వున్న తగాయిదాలను పూర్తిగా విచారించినమీదట, న్యాయశాస్త్రసూత్రాలను నిష్పాక్షికంగా పాటించినమీదట, దర్జీకి టోపీలు కుట్టినందుకు కూలీ గిట్టనక్కరలేదనీ, రైతు తాను కొను

కొన్న గుడ్డముక్కను నష్టపోవాల్సిందేననీ, తయారై వున్న యీ టోపీలు ప్రభుత్వ జైదులలో బందీలై వున్నవారికి వుచితంగా పంచిపెట్టాలనీ కోర్టువారు తీర్పు యిచ్చుచున్నారు. ఇంతటితో యీ తగువు తీరి పోయినట్లు కోర్టువారు భావించడమైనది."

రైతు, దర్జీల తగవు ఆ విధంగా పరిష్కారమై పోగా, యిద్దరు వృద్ధులు తమ కేదో తగువు వచ్చిందని ముందుకు వచ్చారు. ఆ యిద్దరిలో ఒకడు రెండో వాడికి కొంతకాలం క్రితం పది బంగారు నాణేలు అప్పుగా యిచ్చాడట. రెండోవాడు తానా బాకీ ఎప్పుడో తిరిగి యిచ్చేశానని బుకాయిస్తున్నాడట. తానా బంగారు నాణేలు అప్పుగా యిచ్చినప్పుడు చూసినవాళ్లు కాని, మళ్లీ బంగారునాణేలు తిరిగి పుచ్చుకొన్నప్పుడు చూసినవాళ్లు కానీ సాక్షులు ఎవరూ లేరనీ, అలాంటి సందర్భంలో రెండోవాడిచేత న్యాయస్థానంవారు ప్రమాణం చేయించి బాకీ తీర్చి నట్లుగా చెప్పిస్తే తాను తన ఫిర్యాదును వుపసంహ రించుకొంటానని చెప్పుకొన్నాడు.

చేతిలో ఒక కర్ర విడవకుండా పట్టుకొనివున్న ఆ రెండో ముసలాయన వైపుకు తిరిగి ఘ. న. గవర్నరు శాంకో పాంజాగారు "మీరేమి చెప్పుకొంటా ర" ని అడిగారు.

"అయ్యా! ఆయన నాకు పది బంగారు నాణేలు అప్పుగా యిచ్చారన్న మాట ఒప్పుకొంటు

న్నాను. తమరొక్కమారు మీ చేతిలోవున్న ఆ ధర్మదండాన్ని యిలా చాపి పట్టుకొంటే, దానిని తాకి, నేనా మొత్తాన్ని ఆయన చేతికి యిచ్చివేశానని ప్రమాణం చేసి చెప్పతాను." అని ఆ రెండో ముసలాయన అన్నాడు.

శాంకో పాంజాగారు ధర్మదండాన్ని చాపారు. దాన్ని తాకి ప్రమాణం చేస్తానన్న ఆ ముసలాడు, తన చేతిలోవున్న కర్రను కాసేపు పట్టుకోమన్నట్లుగా, ఆ మొదటి ముసలాడిచేతికి అందించి, తాను యివతలకు వచ్చి, ధర్మదండాన్ని తాకి "ఈ ధర్మదండమే సాక్షిగా, నేను ఆయనవద్ద తీసుకొన్న పది బంగారు నాణేలను ఆయన చేతికి యిచ్చానని ప్రమాణం చేసి చెప్పతున్నాను." అని, యివతలకు చక్కా వచ్చాడు.

ఫిర్యాది అయిన మొదటి ముసలాయన యీ ప్రమాణంతో సంతృప్తిపడ్డాడు. ఆయన ఎప్పుడో ఆ మొత్తాన్ని తనకు తిరిగి యిచ్చివేస్తే, తానే ఆ విషయం మరచిపోయివుంటానని తన మనస్సుకు తానే సమాధానం చెప్పుకొన్నాడు. ప్రమాణంచేసివచ్చిన ఆ ప్రతివాది యివతలకు వచ్చి, వాదిచేతికి యిచ్చిన తన కర్రను మళ్లీ తను పుచ్చుకొని, కోర్టు బయటికి వెళ్లిపోబోతున్నాడు.

కర్ర పట్టుకొనివున్న ఆ ఆసామిని ఘ. వ. గవర్నరుగారు పేరుపెట్టి పిలిచి "ఏదీ—నీ చేతిలో వున్న

ఆ కర్రను నన్ను ఒక్కసారి చూడనీ!” అంటూ చేయి ముందుకు జాపారు.

“చిత్తం; చిత్తం” అంటూ ఆ ఆసామి తన కర్రను తీసుకువచ్చి గవర్నరుగారి చేతిలో అతిభక్తితో పెట్టాడు.

కర్ర అందుకొన్న వెంటనే గవర్నరుగారు రెండో ముసలాయనను పిలిచి “నీ బాకీకి బదులుగా యీ కర్ర పట్టుకుపో” అని ఆయన చేతిలో యీ కర్రను పెట్టాడు.

ప్రతివాదిచేత ప్రమాణం చేయించిన తరువాత కూడా యింకా, బాకీకి బదులుగా యీ కర్రను ఎందుకు పట్టుకుపొమ్మంటున్నారో అనీ-అథవా బాకీ తీరకపోయినా, యీ పేదకర్రఖరీదు పది బంగారునాణేలు వుంటుందా అనీ, వాది అనుమానిస్తూ, ఎటూపాలుపోక విస్తుపోయి చూస్తూ “స్వామీ! అయితే యీ కర్ర ఖరీదు పది బంగారునాణేలు అన్నమాటేనంటారా?” అని జంకుతూనే అడిగాడు.

“అవును. దాని విలువ పది బంగారు నాణేలు వుండితీరాలి. అలా కాకపోతే నా బుర్ర ఎందుకూ పనికిరాని మట్టిబుర్ర అన్నమాటే! కావాలంటే ఆ కర్ర పగలకొట్టి చూడు”. అన్నాడు గవర్నరుగారు చిరునవ్వు నవ్వుతూ.

వాది వెంటనే కర్రను పట్టుకు, నడుముకి రెండుగా విరిచేశాడు. ఆశ్చర్యం! అందులోంచి పది బంగారు

నాణేలు ఖంగున నేలమీద రాలాయి. కర్రను లోపల అంతా డొల్లగా చేసి, అందులో పెట్టాడు కాబోలు, ఈ పది నాణేలను! అక్కడవున్న వందమందీ ఆశ్చర్యపోయారు.

కోర్టు అధికారుల్లో ఎవరో ఒకరు వుండబట్టలేక ఘ. వ. గవర్నరుగారిని అడిగేశారు - 'తమరా విషయాన్ని ఎలా కనిపెట్టా'రని. "ఏమున్నదీ ? ధర్మదండం పట్టుకొని ప్రమాణం చేయటానికి రమ్మనమంటే, ఆ పెద్దమనిషి వెతికి వెతికి వాడి చేతికే తన కర్రను యిచ్చి మరీ వచ్చాడు. ప్రమాణంలో కూడా ఏమన్నాడో గమనించారా! వాడి 'చేతిలో పెట్టానన్నా'డే కానీ, ఆయనకు తిరిగి యిచ్చేశానని కానీ, చెల్లించేశానని కానీ అనలేదు. అదీ గాక ప్రమాణం చెయ్యటం పూర్తి కావటంతోటే, ఎంత సంభ్రమంతో పోయి వాడి చేతిలోవున్న తన కర్రను లాగి పుచ్చేసుకొన్నాడో మీరు చూశారా! ఇవన్నీ గమనిస్తే కేసు అంతా యిట్టే కట్టుబడిపోతుంది. [illegible]" అని నవ్వేశాడు శాంకోపాంజా గారు.

శాంకో, డాన్‌క్విక్జోట్ [illegible]గారిని గవర్నరుగా పంపుతూ ఆయనవెంట ఒక వైద్యుని ప్రత్యేకం పంపాడు. గవర్నరుగారి [illegible] యిందున ఏ ఏ [illegible] దినుసులు తింటేనో, ఏ ఏ పరాభవాలు పొందుతాడో [illegible] ఎప్పటి కప్పుడు వ్రాసి పట్టుకునేందుకు ఆ వైద్యుని [illegible]

దంపతులు పురమాయించారు. అవన్నీ తరువాత ఎప్పుడో తీరికగా కూర్చొని చదివి సంతోషించవచ్చు గదా అని వాళ్లు అనుకొన్నారు. ఆ వుద్యోగి యీవేళ కోర్టులో జరిగిన కథ అంతా వ్రాయటానికి కూర్చున్నాడు. రెండు కేసులూ పూర్తి అయ్యేసరికి ఆవుద్యోగికి మతిపోయినంత పని అయింది. డ్యూక్ దంపతులు, తదితరులు చెప్పినదానినిబట్టి శాంకోపాంజా అంతటి శుద్ధ మొద్దు మరొకడు వుండటానికి వీలులేదని యీయన అనుకొంటూవుండగా, యీ శాంకో పాంజాగారు యింత తెలివైనతీర్పులు ఎలా యిచ్చారో, వారికా ఆలోచనలు ఎలాతట్టాయో, అతనికేమీ బోధపడక, మనిషి సదమదమైనాడు.

## 18

ఘనత వహించిన గవర్నరు శాంకోపాంజా గారిని స్థానికోద్యోగులు న్యాయస్థానంనుంచి రాజభవనానికి తీసుకువెళ్లారు. ఆ ప్రాసాదంలో అప్పటి కప్పుడే గవర్నరుగారి విడిదికి కావలసిన అన్ని హంగులూ పూర్తి అయినాయి. ఈయన భవనంలో ప్రవేశించినది మొదలు ఎక్కడినుంచో శ్రావ్యమైన సంగీతం వినిపించుతోంది. శాంకో పాంజాగారు దోవపొడుగునా గల అలంకరణాలను తనిఖీ చేస్తూ, ముసి ముసి నవ్వులు నవ్వుతూ ముందుకు పోతున్నారు.

అంతఃపురోద్యోగులు ఆయనను భోజనశాలకు నడిపించుకు వెళ్లారు. అక్కడ అప్పటికప్పుడే భోజనాలకు పెద్ద ఏర్పాట్లు జరిగివున్నాయి. నలుగురు నౌకర్లు



తలా ఒక పాత్రతో నీళ్లూ, తుండుగుడ్డ పుచ్చుకొని నిలుచొని వున్నారు. గవర్నరుగారు ఆ నీళ్లతో చేతులు కడుక్కొని, ఆ తుండుగుడ్డలతో తుడుచుకొని భోజనానికి కూర్చొన్నారు. అక్కడవున్న బల్లా, ఆ బల్లమీద పెట్టివున్న పళ్లేలూ, గిన్నెలు గ్లాసులు చూస్తుంటే తనపంక్తికి ఇంకా ఎందరు వస్తారోనని శాంకోపాంజాగారు మొదట్లో అనుకొన్నారు; కానీ నిజానికి అంత భారీ ఏర్పాట్లన్నీ తను ఒక్కడికోసమేనని తరువాత తెలుసుకొన్నారు. అసలే తిండిమీద ఎక్కువగా వుండే తత్వం కలిగిన మనిషి; దానికితోడు డ్యూక్ భవనంనుంచి బయలుదేరినది మొదలుగా యింతవరకు కడుపునిండా తిండీగానీ, కంటినిండా నిద్రకానీ ఎరుగకవున్న కారణంచేత, గవర్నరు శాంకోపాంజాగారు ఆకలిగొన్న సింహంలా వున్నారు.

వంటకాలమీద కప్పివున్న ఆ తెల్లటి వస్త్రాన్ని తొలగించి తినబోతూవుండగా ఎవరో ఒక వ్యక్తి చేతితో ఒక చిన్నదండం పుచ్చుకొని గబగబా ముందుకు వచ్చాడు. అతని ముఖం చూస్తే పంట్లో రాళ్లు కూకినట్లు ఘుమఘుమలాడుతోంది. భోజనశాలకు వచ్చి రావటమే తడవుగా, ఆ ప్రభువుగారు కూర్చొన్న కుర్చీ వెనకను వచ్చి నిలుచున్నాడు. ఇంతలో ఒక నౌకరు పెద్ద పళ్లెంనిండా నానారకాల ఫలాలను పట్టుకొచ్చి శాంకోపాంజాగారి ముందు పెట్టాడు. నిగనిగలాడే ఆ పళ్లూ, ఘుమఘుమలాడే ఆ వంట

కాలు చూస్తుంటే శాంకోపాంజాగారికి తెగ నోరు వూరింది. పళ్లల్లో ఒకదానిని ఆయన పైకి తీయబోతుండగా కుర్చీ వెనుకను నిల్చొన్న ఆమనిషి తన చిన్న చేతి కర్రతో ఆ పళ్లెన్ని తాకాడు... వెంటనే అక్కడి నౌకరు గబగబా ముందుకు చొచ్చుకువచ్చి, పళ్లు పేర్చివున్న ఆ పళ్లెన్ని ఎత్తుకు చక్కాపోయాడు. పళ్లు లేకపోతే మానే, ఆ కుర్మానైనా రుచి చూద్దామని శాంకోపాంజాగారు ఆ పళ్లెన్ని ముందుకు లాక్కోబోయారు. ఆ పళ్లెన్ని కూడా కుర్చీవెనుక నిల్చొన్న మనిషి తన కర్రతో తాకాడు; మరొక నౌకరువచ్చి ఆ పళ్లాన్ని పట్టుకుపోయాడు. కడుపులో కాలుతున్న శాంకోపాంజాగారికి, దానితో [illegible] ముంచుకు వచ్చింది. తనకుర్చీకి దగ్గరగా నిలబడివున్న ఆమనిషి వైపుకు తిరిగి 'నీ చర్యను సహించలేక పోతున్నా' మన్నట్లు ఒక్కచూపు చూశాడు.

ఆవ్యక్తి కుర్చీచాటునుంచి యివతలికి వచ్చి శాంకోపాంజాగారికి వంగి వందనంచేసి, "[illegible] ఆస్థాన వైద్యుణ్ణి, ప్రభూ. [illegible] ఆరోగ్యాన్ని [illegible] జాగ్రత్తలు తీసుకోవటం నా విధి. అందుకే నాకు జీతం యిచ్చి పోషిస్తున్నారు ప్రభువులవారు. [illegible] భోజనం చేసే సమయంలో [illegible] ప్రభూ, ఘనత వహించినవారి ఆరోగ్యానికి హానిగా [illegible] పదార్థాన్ని దేన్నీ వారు తినకుండా చూడటమే, నా విధులలో ప్రధానమైనది. [illegible]

లమూ చేసే ఆపళ్లు తమరు ఆరగించకుండా అడ్డుపడ్డాను. అల్లాగే ఆ కుర్మాకూడా: అదిగనక తమరు తిన్నారా అంటే—తమకు విపరీతమైన వృష్ణం వచ్చేస్తుంది" అన్నాడు.

"అఘోరించినట్లే వుంది ... పోనీ — ఏ చెడూ చెయ్యని ఆ పావురాయి పులావ్ తినమంటావా:" అని అడుగుతూనే శాంకోపాంజాగారు ఆ పళ్లెంమీదికి చెయ్యి పోనిస్తున్నారు.

"వద్దు: వద్దు" అంటూ ఆస్థానవైద్యుడు అడ్డుపడి, "నా గొంతులో ప్రాణం వున్నంతవరకు మీ నోట్లోకి ఆ పులావ్ పోనీయను కడుపు ఖాళీ లేకుండా తినటమే తప్పు. అందులోనూ పులావ్‌తోనే కడుపు నింపటం అంటూ సంభవిస్తే, అది దేహానికి ఎంత చెరుపు చేస్తుందో వైద్యశాస్త్రంతో పరిచయమున్న ప్రతి ఒక్కరికీ తెలుసు." అంటూ అందుకు సంబంధించిన వైద్యసూత్రమేదో వల్లించబోయాడు.

"అది సరే. నేను తినదలుచుకున్న ప్రతిదాని విషయంలోనూ నువ్వు దోషం వెదకటంకంటె, యిప్పుడు యీ బల్లమీద వున్న యిన్ని తినుబండారాలలోనూ నేను తినదగినది అంటూ ఏదైనా ఒకటి వున్నట్లు నీ మనస్సుకు తోస్తే, అది చెప్పవ చెప్పేయి. లేకపోతే యిక కొద్ది క్షణాలలో నేను ఆకలి చావు చావవలసివస్తుంది." అని శాంకోపాంజాగారు కోపంగా అడిగారు.

"మీరు అలా కరాఖండిగా అడిగేట్లయితే—యిక్కడవున్న యిన్ని తినుబండారాలలోనూ తమరు తినదగినది అంటూ ఒక్కటీ లేదని చెప్పవలసి వస్తుంది. ఏమంటారా?—మాటవరసకు చూడండి: అది కుందేటి మాంసం. దానిని రుచి చూడటంకంటే తెలివి తక్కువ పని మరొకటి లేదు, అవతల పళ్లెం లోది చూడండి: అది ఆవుదూడమాంసం. దానిని మితిమీరి వేయించారు.· అందుచేత దానిని తింటే మీ శాలేయం దెబ్బతినిపోతుంది. ఇలా కాకుండా—అంటే ఆదూడమాంసాన్ని వేయించకుండానూ, పూరా వేయకుండాను వున్నట్లయితే—అది వేరే విషయం. అప్పుడు చెప్పేవాణ్ణి తినవచ్చునో, తినకూడదో. ఇంతకీ తమరి ఆరోగ్యం దెబ్బ తినకుండా చూడవలసిన బరువు బాధ్యతలు నామీద వున్నాయి కనుక చెప్పతున్నాను. తమరు యిప్పటికి మాత్రం ఆ వంద పుప్పుబిస్కట్లు, ఆ ముల్లంగిదుంపలు తినిపూరుకోండి." అన్నాడు ఆ వైద్యశిఖామణి, అక్కడికి తాను గవర్నరుగారికోసం ప్రత్యేకం వైద్యశాస్త్ర నిషేధాలను లోలగించినట్లు! దాంతో ఘనత వహించిన గవర్నరుగారి వళ్లు మండి పోయింది. తనను గనక దేనినీ తిననీయకపోతే యీ వైద్యుణ్ణి కాళ్లూ చేతులు కట్టేయించి కోటగోడల మీదినుంచి కిందికి విసిరి పారేయిస్తానని శాంకో పాంజాగారు హెచ్చరిక చేశారు—ఆయన ఆక్రోషంలో అంతపనీ అప్పుడే చేసేస్తారేమోనని భయపడిపోయి

ఆ వైద్యుడు అప్పటి కప్పుడు ఆయన ఎదుట వుండకుండా బయటికి జారుకోవాలని చూస్తున్నాడు. అంత పనీ చేసేవాడే.

కానీ యింతలో బయట కాపలావాడెవడో కొమ్ము ఊదాడు. అందరిదృష్టీ ఆ ధ్వని వస్తున్న వైపుకు మరలింది. ప్రతి ఒక్కళ్లూ ఆత్రంగా చూస్తూ వుండగా, 'డ్యూక్' సేవకుడొకడు గబగబా శాంకో పాంజాగారి భోజనాలగదిలోకి చొచ్చుకు వచ్చాడు. వచ్చి రావటంతోనే గవర్నరుగారికి వందనమొకటి విసిరేసి, వుత్తరం ఒకటి తీసి ఆయనచేతికి యిచ్చాడు.

ఘనత వహించిన గవర్నరు శాంకోపాంజా గారికి చదువరాదు. అందుచేత ఆయన ఆ వుత్తరాన్ని ప్రక్కన నిలబడివున్న నౌకరుకు యిచ్చారు,—చదివి పెట్టమని. వాడు దానిని పట్టుకెళ్లి తన పైఉద్యోగికి యిచ్చాడు. అతను తన పైఉద్యోగికి యిచ్చాడు. ఆయన కూడా తనకంటె పైఉద్యోగికి యిచ్చాడు. మొత్తానికి యీ వుత్తరం నిచ్చెన ఎక్కినట్టుగా క్రింది వుద్యోగుల చేతుల్లోనుంచి పై వుద్యోగుల చేతుల్లోకి పోయిపోయి, చివరకు గవర్నరుగారి ఆంతరంగిక కార్యదర్శి చేతుల్లోపడి, అంతటితో ఆగిపోయింది. ఆ కార్యదర్శి వుత్తరాన్ని చేత బట్టుకొని గవర్నరుగారి సముఖంలోకి వచ్చి నిలబడి, దానిని తెరచి గట్టిగా వినిపించే ముందు అందులో రహస్యమైన విషయం ఏదో వుందని చెప్పాడు. అనుమానపడి శాంకోపాంజాగారు

అక్కడవున్న అందర్నీ తొలగి పొమ్మన్నారు. తానూ, ఆ కార్యదర్శి, మరొక వున్నతోద్యోగి తప్ప మిగిలిన వాళ్లంతా బయటకు నడిచారు.

అందరూ వెళ్లిపోయారని నిర్ధారణ అయ్యాక కార్యదర్శి వుత్తరం విప్పి చదివాడు. డ్యూక్ గారు వ్రాసిన ఆ వుత్తరంలో యిలా వుంది.

"ప్రియమైన శాంకోపాంజా గారికి—

మన శత్రువులలో కొందరు మీ దీవిపై ఎప్పుడో ఒకనాడు అర్ధరాత్రి వేళ దండెత్తి రాబోతున్నట్లు మాకు వార్తలు వచ్చినవి. అందుకై వారు మహోగ్రమైన సన్నాహములు కూడా చేస్తూ వున్నట్లు మాకు అతి విశ్వసనీయముగా తెలుస్తూ వున్నది. మాకు తెలిసిన యీ వార్తను మీకు యిందు మూలకముగా అందచేస్తూ, మీ మీ జాగ్రత్తలో వుండగలరనీ, దీనికి తగిన కట్టుదిట్టములు తక్షణమే చేయగలరని ఆశించటమైనది.

"మరియొక విశేషము. శత్రు సమూహమునకు చెందిన నలుగురు గూఢచారులు మీ పట్టణమందు ప్రవేశించి సంచరించుచున్నట్లునూ మాకు స్పష్టముగా తెలియవచ్చె. వీరు ముఖ్యముగా మిమ్ము హత్యచేయ పొంచియున్నట్లు తెలుస్తున్నందున, మీతో సంభాషించ వచ్చెడి అపరిచిత వ్యక్తుల విషయమై ఎంతో శ్రద్ధతీసుకొన వలసినదిగా కోరటమైనది. అంతియే కాక,—వీరాయి వారెవరైనా తమకు కానుకలుగా తెచ్చియిచ్చు భక్ష్యములు, శాక పాకములను స్వీకరించు సందర్భమునందు తగినంత జాగ్రత్తతో నుండగలందులకు హెచ్చరిక చేయటమైనది.

"మీ దీవిరక్షణకై తమకు ఏదైనప్ప సైన్యసహాయము కేమైనా కావలసినచో, మాకు కబురు పంపినయెడల, అందుకు తగు ఏర్పాట్లు చేయగలము. ఎట్టి సందర్భములోనూ శత్రువుల బారినుండి దీనిని సురక్షితముగా నుంచగలరని ఆశించుచున్నాము.

కోట
ఆగస్టు 16—

మీ మిత్రుడు,
డ్యూక్."

ఈ వార్త వినగానే అక్కడవున్నవారందరి మనస్సులలోనూ భయవిహ్వలత అలముకొన్నది. ఒక్కరు కూడా పెదిమ కదిలించి చప్పున మాట్లాడలేకపోయారు. ఐదారు నిమిషాలసేపు అందరూ నిశ్శబ్దంగా వుండిపోయారు.

చివరికి శాంకోపాంజాగారే, అందరిలోకీ ముందుగా తేరుకొని, "నన్ను చంపాలని చూస్తున్నవాళ్లు ఎవరైనా వుంటే, అది యీ ఆస్థానవైద్యుడే. నా ఆరోగ్యంవిషయంలో జాగ్రత్త తీసుకొంటున్నట్లుగా నటించి, నన్ను ఏ వంటకమూ తిననీయకుండా ఆకలిమంటలకు ఆహుతి చెయ్యాలని చూస్తున్నాడు. కాబట్టి మిగిలిన విషయాలమాట ఎల్లావున్నా, ముందు యీ వైద్యుణ్ణి వెంటనే చీకటికొట్టులో పడవెయ్యాలి." అన్నారు.

అక్కడే వున్న ఆ వున్నతోద్యోగి మాటల ధోరణి అందుకొని "మీ యెదుట వున్నవాటిలో దేనినీ తమరు ముట్టుకోకపోవటమే మేలు. ఏమంటారా?—వీటి నన్నిటినీ మతాధిపతులు వండి పంపించారే కాని, యిక్కడ తయారుచేసినవి కావు." అన్నాడు.

"అలాగైతే యీ పళ్లేలన్నీ తక్షణమే యిక్కడినుంచి తీయించేసి, యింత రొట్టె, కాసిని ఎండుద్రాక్షపళ్లు మాత్రం తెప్పించండి. నేనిక ఆకలికి ఆగలేని స్థితిలో వున్నాను. ఇక ఏ మాత్రం ఆలస్యమైనా, నా

ప్రాణం కాస్తా యీ బొందిలోంచి ఎగిరిపోయేలావుంది. ఎండిపోయిన ద్రాక్షపళ్ళల్లో విషం వుండటానికి వీలు లేదుకనుక, వాటినైనా తక్షణమే తెప్పించండి.” అంటూ ఆ వుద్యోగికి వుత్తరువువేసి, తన కార్యదర్శివైపుకు తిరిగి “ఆ వుత్తరం అందిందనీ వారు చెప్పిన విధంగా అన్ని ఏర్పాట్లు చేసుకొంటామనీ, వారి ఆజ్ఞలు శిరసా వహించి నడుచుకొంటామనీ డ్యూక్ గారికి సమాధానం వెంటనే వ్రాయిస్తారు కదూ!” అని అడిగారు శాంకో పాంజాగారు.

## 19

డ్యూక్ భవనంనుంచీ వచ్చిన తాఖీదును బట్టి గవర్నరు శాంకో పాంజాగారికి దీవిపై ఏక్షణాన అయినా శత్రువులు దాడి ఎత్తి రావచ్చునన్న దిగులు అందరినీ పట్టుకు వేధిస్తున్నది. అయినప్పటికీ అటువంటి సంఘటన ఏదీ జరగకుండానే ఒక వారం రోజులు ప్రశాంతంగా గడిచిపోయాయి. ఈ వారం రోజుల పొడుగునా శాంకో పాంజాగారికి పైనుంచీ వచ్చే శత్రువులవల్ల ఎట్టి బాధా కలుగ లేదన్న మాట వాస్తవమే కాని, గవర్నరుగారిని [illegible] పటంలో గల [illegible] [illegible] యియడానికి [illegible] [illegible] కాని, [illegible]

ఆ పడవనాటి రాత్రి మాత్రం హఠాత్తుగా పరిస్థితులు మారిపోయాయి. శాంకో పాంజాగారి భావి జీవితాన్నంతటినీ తారుమారు చేసి పారేసిన ఆ దుస్సంఘటన నాటి రాత్రే జరిగింది.

ఆరోజు రాత్రిఆయన పరిపాలనకు సంబంధించిన పనులన్నీ ముగించుకొని, ఆస్థాన వైద్యుడు సిఫార్సు చేసిన తిండి ఏదో యింత తిని, పొద్దుపోయాక బద్ధకంగా వచ్చి, పక్కమీద పడుకొన్నారు. పగలంతా పడ్డ చికాకుతో ఆయనకు ఎంతకీ నిద్దర రాలేదు. ఊరికే ఆ పక్కమీదనే పడుకొని యిటునుంచి అటు, అటునుంచి యిటూ తెగ దొర్లారు. అలా దొర్లగా దొర్లగా, ఎట్టకేలకు ఆయనకు కంటిమీదికి కునుకు వస్తూ వస్తూ వున్నది. ఇప్పటికైనా నిద్ర వస్తున్నది కదా అని ఆయన సంతోషించారు. కాని యింతలో బయట వున్నట్లుండి ఒక్కసారిగా పెద్దగోల బయలుదేరింది. చర్చిలో గంటలు వెర్రెత్తినట్టు మోగుతున్నాయి. కుక్కలు భౌభౌమని అరుస్తున్నాయి. మనుష్యులు పెద్దగా కేకలు పెట్టుకొంటూ శాంకోపాంజాగారి శయనమందిరం వైపుకే వస్తున్నట్లు తోచింది. పక్కమీద పడుకొనివున్న వారల్లా, ఆశబ్దాలు విని, శాంకో పాంజాగారు ఒక్కసారిగా లేచి కూర్చొని, ఆ శబ్దం ఏమిటైందీ, ఏవైపునుంచీ వస్తున్నదీ పరీక్షగా వినటం మొదలుపెట్టారు. ఆశబ్దం యింత కంతకూ దగ్గరకు వస్తున్నది. మామూలుగా మనుష్యుల గొంతుకతే

కాక, రణభేరీలు, తప్పెట్లు, తాళాలూకూడా వాయిస్తు న్నట్లున్నారు. వారం రోజులక్రితమే శత్రువులు దాడి చెయ్యబోతున్నారన్న వార్త తెలిసివుండటమూ, యిప్పుడు యిలా అర్ధరాత్రివేళ రణభేరీ మ్రోతలు వినిపించటంతో, ఘనత వహించిన గవర్నరు శాంకో పాంజాగారి గుండెధైర్యం సడలిపోయి వణుకు పుట్టు వచ్చింది. అవతల ఆ శబ్దాలు అంతకంతకు బిగ్గరగా వినిపిస్తూ వుంటే, యివతల శాంకోపాంజాగారి గుండె బెదురుగాకూడా ఎక్కువ కాసాగింది. చివరకు యిక ప్రయోజనం లేదని, పిట్టగోడమీదగా దూకి పారిపో దామనుకొన్నారు—శాంకో పాంజాగారు. కాలికి జోడు తగిలించుకొని గదిలోనుంచి బయటకు వచ్చి, పిట్టగోడ ఎక్కబోతుండగా, ఎవరో యిరవైమంది దాకా మనుష్యులు యీయనవద్దకు ఉసురులు కక్కుకొంటూ పరుగెత్తుకువచ్చారు. వారందరి చేతుల్లోనూ కత్తులు వున్నాయి. కొందరి చేతుల్లో కాగడాలు వెలుగుతున్నాయి.

ఈయనదగ్గరకు వచ్చి [illegible] ఏకకంఠంతో "ప్రభూ! ప్రభూ! మన దీవిని శత్రుసేనలు చుట్టుముట్టాయి. ఏలినవారి భృత్యానుభృత్యులమైన మేమంతా ఏం చెయ్యాలో తోచక కంగారుపడిపోతున్నాము. భీమబలులైన తాము కత్తిని చేతపట్టి శత్రుసేనలను సంహరించాల్సిన సమయం వచ్చింది." అని అరిచారు.

"అదేమిటి ? నన్ను కత్తి పట్టుకోమంటారేమిటీ? కత్తియుద్ధం ఎలా చేయాలో నాకేం తెలుసూ?" అంటూ ఘనత వహించిన గవర్నరు శాంకో పాంజాగారు తన చేతకానితనాన్ని బయట పెట్టారు.

"ప్రభూ! తమరు పిరికిపందలు కారే! ఎందుకు అలా కంగారుపడిపోతున్నారు? కత్తి పట్టకపోతే మానె. ఇవిగో - శత్రువుతో పోట్లాడటానికీ, శత్రువు విసిరే దెబ్బలను కాచుకోవటానికి తగిన ఆయుధాలు మావెంట తెచ్చాము. తమరు గవర్నరుగారైనందుకు, వాటిని వెంటనే ధరించి, మమ్మల్ని అందరిని పెద్ద బజారుదాకా నడిపించండి." అంటూనే పెద్ద డాళ్లు రెండు పట్టుకొచ్చి గవర్నరుగారికి ముందువైపున ఒకటి, వెనుకవైపున ఒకటి పెట్టి, పడిపోకుండా గట్టిగా తాళ్లతో బిగించి కట్టేశారు. ఆయన చేతికి ఒక యీటెనుకూడా అందించి యిక కదను నడిపించమన్నారు.

పాపం—శాంకోపాంజాగారు కదలబోయారు. రెండువైపులా తగిలించివున్న ఆ డాళ్లు [illegible] బరువు. వాటి బరువుకు [illegible] [illegible] [illegible] [illegible] కదలటానికి [illegible] [illegible] నరే - గవర్నరు [illegible] [illegible] ప్రజలు [illegible] [illegible] [illegible]



రెండు సార్లు ప్రయత్నం చేసి చూశారు. ఆయన చేసిన ప్రయత్నాలమూలంగా ఫలితమేమీ లేకపోగా, ఆ రెండు డాళ్ళ నడుమా కాళ్లు కదపటానికి వీల్లేక, చెట్టంత మనిషీ - నేలమీద బోర్లబొక్కిలా పడిపోయారు. ఆ భంగిమలో ఆయనగారు నేలమీద పడి

వుండగా, అదాటుగా ఎవరైనా చూస్తే, యిది ఏదో మనిషి తలకాయ, మనిషికాళ్లు వున్న కొత్తరకం తాబేలు అని పొరపాటు పడవలసిందే!

ఆయనగారు ఆ వరసను మెట్టతాబేలులా నేల మీద పడివుండి కాళ్లూ చేతులూ తెగ కొట్టుకొంటూ వుంటే, అవతల ఆ యిరవైమంది మనుష్యులూ తెచ్చిన కాగడాలన్నీ ఒక్కసారిగా ఆరిపోయాయి. అంతటా గాఢాంధకారం చుట్టుముట్టేసింది. ఆ చీకట్లో ఏదో పెద్ద చిందులాట. అందులోనే శత్రువులు దూసినట్లు, యీటెలు విసురుతున్నట్లు కొన్ని శబ్దాలు. కొంతసేపు యుద్ధోద్యమం జరిగినట్లు చప్పుళ్లు. ఇలా ఏవేవో వింత వింతశబ్దాలు విన వచ్చాయి. నిజంగా యుద్ధమే జరుగుతున్నట్లనిపించింది. ఆ యుద్ధం నిరాఘాటంగా పది పదిహేను నిమిషాలసేపు కొనసాగిపోయింది. ఆ రెండు డాళ్ళ సందునా పడి నలిగిపోతున్నందువల్ల ఆయనకు శారీరకమైన బాధ అంతకంతకూ ఎక్కువైపోతున్నది. అటు ఆ శత్రుప్రళయమూలంగానో, యిటు యీ భేతాళపు డొళ్లమూలంగానో తనకిక చావు తప్పదని శాంకోపాంజాగారు అనుకొంటూవుండగా "ప్రభూ! ప్రభూ! విజయం మనదే! శత్రుశేషం లేకుండా తోలి పారేశాం! లేవండి. వేగమే వచ్చి శత్రుసేనలు వదలి వెళ్ళిన నిధి నిక్షేపాలు మాకు పంచిపెట్టండి."

అంటూ ఆ యిరవైమంది గొంతుకలూ చీకటిని చీల్చుకు వినిపించాయి.

శాంకోపాంజాగారి ప్రాణాం అప్పటికే కడగట్టి పోయింది. నాలిక లోపలికి పీక్కుపోతున్నది. ఆపాద మస్తకం అభిషేకం చేయించుకొన్నట్లుగా చెమటలు దిగ్గారిపోతున్నాయి.

"నన్ను ముందుగా లేవదీయండి" అంటూ అతి హీన స్వరంతో పలికారు శాంకోపాంజాగారు. అది చెవినబడ్డవాడెవ్వడో చప్పున వచ్చి, మరొక రిద్దరి సహాయంతో ఆయనను ఎలాగైతేనేం, లేవదీసి నిలబెట్టాడు. మళ్లీ ఆ గొంతుకలు "శత్రుసేనలు వదిలి పెట్టిన నిధి నిక్షేపాలను మాకు మీరు చేతులారా పంచిపెట్టమని" కోరాయి.

"నిధి నిక్షేపాల మాట ఎలా తగులబడ్డానకే కాని, మీలో ఏ ఒక్కడికైనా నామీద కొస్తంత కరుణ వుంటే, గుక్కెడు సారా తెచ్చి యిచ్చి, ముందు నా ప్రాణాన్ని నిలబెట్టమని మనస్ఫూర్తిగా వేడుకొంటున్నాను" అన్నారు శాంకోపాంజాగారు, అతిదీనంగా.

ఎవరో పరుగెత్తుకొంటూ పోయి సీసాడు సారా తెచ్చి ఆయననోటికి అందించారు. మరో యిద్దరు ముగ్గురు మనుష్యులు చేరి, వొళ్లకు కట్టిన తాళ్లన్నీ విప్పి, ఆ మూడు వొంటిమైళ్ల బరువంతా తగ్గించేశారు.

మరి—అంతకు ముందు ఆయన మానసికంగా ఎంత ఆందోళనపడివున్నారో, శారీరకంగా ఎన్ని దెబ్బలు తిన్నారో కానీ, కట్లు అన్నీ తీసేసిన వెంటనే మూర్ఛపోయారు. పరిస్థితి యింతవరకూ వచ్చి, శాంకోపాంజాగారు మాటా మంతీ లేకుండా బిగుసుకు పోవటం చూసేసరికి, యిన్ని రోజులుగా యీయనను ఆడించటంకోసం, డ్యూక్ దంపతుల ఆజ్ఞల మేరకు, పాత్రాభినయం చేస్తున్న యింతమంది మనస్సులూ ఒక్కరిగా చివుక్కుమన్నాయి. నవ్వులాటకని మొదలుపెట్టిన యీ భాగోతం, చివరకు యిలా చావుల్లోకి దిగుతోందని వాళ్లు భయపడిపోయారు. అందరూ ప్రాణాలు వుగ్గపెట్టి ఆయన ముఖంకేసే చూస్తూ వుండిపోయారు.

ఉఛ్వాస నిశ్వాసాలు కూడా ఆగిపోయిన శాంకోపాంజాగారు వున్నట్టుండి డొక్కలు ఎగరవేయటం ప్రారంభించారు. అది చూశాక ఆ యిరవై మందికీ ప్రాణాలు లేచి వచ్చాయి. ఎవరికి తోచినది వారు, ఎవరికి చేతనైనది వారుగా, శైత్యోపచారాలు చేసి, శాంకోపాంజాగారిని బ్రతికించారు. ఆయనకు క్రమంగా స్పృహవచ్చింది.

శాంకో మళ్ళీ స్పృహలోకి వచ్చీ రాగానే ఆయన తనదగ్గిరగా వున్నవాళ్ళని "యిప్పుడు టైం ఎంతైందని" అడిగాడు. వాడు తెల్లవారవస్తున్నదని సమాధానం చెప్పాడు. ఇక ఆ తరవాత వేరే ఏ విష

యాన్ని గురించీ ఆయన అడగకుండా, నెమ్మదిగా మోకాళ్ళమీద లేచి, చేతులు ముందుకు జాపి నేల మీద ఆనించి డేకొంటూ డేకొంటూ ముందుకు కదిలిపోయారు. అలా నత్తగుల్లలా నేలమీద పాకుతూ పోయిపోయి, తన భవనం చేరుకున్నారు. భవనానికి చేరినవాడు తనగదికి పోకుండా సరాసరి గుర్రాలశాలవైపుకు దారితీశాడు. అక్కడ ఆ చీకట్లోనే తన ముద్దులగాడిద 'డాపుల్' ఎక్కడ వున్నదో వెతికి తెలుసుకొని, అది కనుపించగానే కళ్ళ వెంట నీళ్ళు ఏకధారగా కారుస్తూ, దాని తలను తన రెండు చేతులతోనూ పట్టుకొని, హృదయానికి హత్తుకొని, దాని నుదుటిపై ముద్దు పెట్టుకొన్నారు.

"నా 'డాపుల్'! ఇన్ని ఏళ్లుగా నాతోపాటే ప్రయాణాలు చేస్తూ, నాతోపాటే ఉపవాసాలు వుంటూ, నాతోపాటే అన్ని అవమానాలు, అన్ని హింసలు అనుభవిస్తూ వున్న నిన్ను, అర్ధాంతరంగా వదిలేసి, అప్రాకృతమైన యీ గవర్నరు పదవికోసం ఆశించినందుకు గదా - నేను యిన్నిరకాల [illegible] పడవలసివచ్చింది. నీ జంట విడకుండా వున్నంత కాలమూ, నాకు యీ మాటికి కష్టాలలో ఒక్కటి కూడా రానేలేదు. అంతటితో నేను సంతృప్తిపడి, యీ పేరాశల జోలికి పోకుండా వుండవలసింది. నన్ను నమ్మిన నిన్ను, ఏనాడైతే వదిలి గద్దెక్కి [illegible] గంతులు వేశానో, ఆనాడే నాకు అష్టకష్టాలు ప్రారంభ

మైనాయి." అంటూ ఒకటే ధోరణిలో ఆ గాడిదను కౌగలించుకుని ఏడ్చి, ఏడ్చి, ఎక్కిళ్లు తెచ్చుకొన్నారు. ఎక్కిళ్లు ఆగకముందే వున్నచోటినుంచీ లేచి ఆ గాడిద తాలూకు జీనూ అదీ, అక్కడే ఒకమూల పడేసివుంటే, - దాన్ని పదిలంగా 'డాపుల్' మూపున తగిలించి యిటు తిరిగి చూశారు.

శత్రు సంహారకాండలో పాల్గొన్న ఆ యిరవై మంది మాత్రమే కాక, ఆస్థానానికి చెందిన మరొక అరవైమందిదాకా వుద్యోగులు, యింత సేపూ యీయన పాకి వస్తూంటే ఆయన వెనకాలే వచ్చారు కాబోలు! ఇక్కడ పశువుల శాలకు చేరి యీయన గుండెలు కరిగిపోయేట్టుగా ఏడుస్తూవుంటే కూడా, వాళ్ళు ఆ వరసను జెల్లంకొట్టిన రాళ్లకుమల్లే, ప్రాణికే చూస్తూ నిల్చుండిపోయారు కాని, ఒక్కరైనా ధైర్యం చేసి 'ఏమిటి?' అని యీయనను పలకరించలేక పోయారు.

సాంకోపాంజాగారు కూడా మనస్సు అంతగా కలవరపడివున్న కారణంచేత, వాళ్లను వెంటనే పలుకరించలేక, 'డాపుల్' మూపున జీను తగిలించే పని సొంతం పూర్తి చేశారు. దెబ్బలు తగిలి కట్టుకు పోయిన కాళ్లతో ఎల్లాగో తానే తడబాటుపడి గాడిదమీదకు పాకి, ఎక్కి కూర్చొని, అప్పుడు వీళ్లందరి ముఖాలూ ఒక్కసారి కలియచూసి "సోదరులారా! నన్ను నా పూర్వపు బ్రతుకుబాటకే తిరిగి

పోనివ్వండి. ఈ గవర్నరుపదవి, యీ వైభోగం, యీ అధికారం, యీ ఆడంబరం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసేస్తున్నాయి. ఇక ఒక క్షణమైనా యీ గవర్నరు పదవిని నాతలపై పెట్టుకొని తిరగలేను; క్షణ క్షణానికి యిన్ని చావులు చావలేను. ఇన్నిరకాల మనోవ్యాకులతో యీ రాజసౌధంలో హంసతూలికాతల్పాలపై, పట్టు పీతాంబరాలు కప్పుకు పడుకోవటంకంటే, హాయిగా స్వేచ్ఛగా స్వతంత్రంగా బ్రతుకుతూ, ఏ మర్రిచెట్టుక్రిందనో, గొఱ్ఱెతోలు కప్పుకు పడుకోవటంలోనే ఎక్కువ సుఖమున్నదనీ, ఎక్కువ ఆనందం వున్నదనీ నాకు యిప్పటికి తెలిసి వచ్చింది. కనుక, నేను గవర్నరుపదవి అనే యీ దాసత్వానికి రాకముందు ఎట్లాగైతే బ్రతికానో, ఆ పద్ధతికే తిరిగి వెళ్ళిపోతున్నాను. మీరంతా యిన్ని రోజులుగా నాపట్ల దయచూపినందుకు యివే నా వందనాలు. 'డ్యూక్' గారు నా విషయ మెన్నడైనా అడిగితే, 'పుట్టు దరిద్రుడుగా పుట్టిన యీ శాంకోపాంజా గారు [illegible] బ్రదుకబోడనీ, యిక మిగిలిన ఆ రోజులైనా పుట్టు దరిద్రుడుగానే గడిపి తనువు చాలించదలచిన గవర్నరుగిరి వదిలిపెట్టి వెళ్ళిపోయాడనీ చెప్పండి. ఈ గవర్నరు పదవిని స్వీకరించే ముందు నాకు దమ్మిడీ ఆస్తిలేదు. దమ్మిడి ఆస్తి అయినా సంపాదించకుండానే యీ పదవిని యింతటితో వదిలేస్తున్నాను. ఇక నాకు

సెలవు యిప్పించండి" అంటూ చేతులు రెండూ ఎత్తి వాళ్లకు దణ్ణం పెట్టాడు.

ఆస్థానవైద్యుడి వేషం అంతబాగా యింత కాలమూ నటించిన ఆ పెద్దమనిషి, శాంకోపాంజాగారు ఆడిన మాటలకు చాలా విచారపడ్డాడు. ఆయన అన్న ప్రతిమాటలోనూ ఎంతో యథార్థముందని గుర్తించి, యింత మంచి హృదయంగల మనిషిని వినోదంకోసమని పీడించినందుకు ఆయన లోపల చాలా బాధపడి, మిగిలినవారందరినీ తప్పుకోమని శాంకోపాంజాగారి గాడిద కదిలి పోయేందుకు వీలుగా దోవ చేశాడు.

ఆ గుంపులోనే మరొకరిద్దరు మనుష్యులు ముందుకు వచ్చి, మాజీ గవర్నరు శాంకోపాంజాగారికి దారి పొడుగునా కావలాగా వుండగలందులకు తమలో ఎవరమైనా ఆయన వెంట రావటానికి సిద్ధంగా వున్నామని విన్నవించుకొన్నారు. మరొక జట్టు ముందుకు వచ్చి, అయ్యగారు ప్రయాణంలో వుపయోగించుకోవటానికి వీలుగా తినుబండారాలో [illegible] ఇప్పిస్తా మన్నారు.

"సోదరులారా! పేదరైతుల కుటుంబంలో పుట్టి, బంటుగా బ్రతికిన నాకు సేవకులా! వద్దు! వద్దు!! నా కంతటి అర్హత లేదు. కాకపోతే మీరింత యిదిగా అడుగుతున్నారు కాబట్టి, నాకు తినటానికి యింత రొట్టెముక్క, కొంత జున్ను యిస్తే చాలునండి;

నా గాడిద 'డాపుల్'కు మాత్రం యిన్ని వులవలు తెచ్చిపెట్టండి." అని చేతులు జాపాడు శాంకోపాంజా గారు. (ఒక్క విషయం—శాంకోపాంజా, గవర్నరు పదవికి రాజీనామా యిచ్చిన మాజీ వుద్యోగిగా తయారైనాడు కాబట్టి, ఆయననుగురించి మనం మాట్లాడేటప్పుడు యిక 'గారూ', 'గీరూ' అనక్కర లేదు. లోకం తీరుకూడా అంతేగా! ఏ మనిషి నైనా మనం మన్నిస్తున్నామంటే, ఆయనకు వున్న హోదాను బట్టే కానీ ఆమనిషికి వుండే విలువను బట్టి కాదాయె. అందుచేతనే యికమీదట శాంకోపాంజానుగురించి మాట్లాడేటప్పుడు మనం 'గారూ', 'గీరూ' అనకపోయినా మరేంఫరావా లేదు!)

వాళ్లు ఆయన అడిగిన రొట్టెముక్క, జున్ను, వులవలు వెంటనే తెచ్చిపెట్టారు. ఆయన వాటిని అంది పుచ్చుకొని అతిజాగ్రత్తగా మూటలు కట్టుకొని, అక్కడ నిలబడివున్న వారందరిలో ప్రతి ఒక్కరినీ బిగ కౌగలించుకొని, కనుకొలకులవెంట అశ్రువులు సంతతధారగా కారిపోతూవుండగా, పేరు పేరునా అందరివద్దా సెలవు తీసుకొని, గాడిద నెక్కి బయలు దేరాడు.

గవర్నరుపదవికి [illegible] పెద్ద కేసరి డాన్ క్విక్సొటుగారి బంటు. కావట్టే గవర్నరు గిరీకి రాజీనామా యిచ్చిన [illegible] పోవటం తన విధాయకమని [illegible], శాంకో

పాంజా, డాన్ క్విక్సెట్‌గారు వున్న డ్యూక్ భవనానికి పోవటానికే నిశ్చయించుకొని, ఆ ఊరివైపుకు తన గాడిదను నడిపించాడు.

## 20

గవర్నరు పదవిని త్యజించి తన స్వామిని వెదుక్కొంటూ బయలుదేరిన శాంకోపాంజా, ప్రొద్దుక్రుంకే వేళకు యింకా మార్గమధ్యంలో వున్నాడు. కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటిలో, ఆగకుండా ప్రయాణం చేయవలసిన తొందర ఏమీ లేదు కాబట్టి, ఆ రాత్రికి అక్కడే ఎక్కడన్నా నడుము వాలుద్దామని అనుకొన్నవాడై, రాజబాటను వదిలి, గాడిదను ప్రక్కనవున్న డొంకల్లోకి మళ్లించాడు. ఆ డొంకల్లో అంట్టేదూరం పోకముందే శాంకోపాంజా, 'డాప్పుల్' కూడా బలవంతంగా ఆగవలసినంత పని అయింది.

చీకటి అంత దట్టంగా వున్నందువల్లా, ఆ బాటలు ఆయనకు అంతకుముందు పరిచితమైనవి కాకపోయినందువల్లా, ఆయన గాడిదతోపాటుగా ఒక పెద్ద అగాధంలో పడిపోయాడు. అది బాగా ఐదు, ఆరు నిలువుల లోతు వున్నది. అంతలోతు అగాధం లోనూ పడిపోతూకూడా, శాంకోపాంజా, డాప్పుల్ మీదినుంచి తనుమాత్రం పడిపోకుండా చూసుకొన్నాడు. ఇంతకీ ఆ గాడిద లేచిన వేగానికేమం

మంచిది కాబట్టి, అంతతోనే సరిపోయింది. అంత, పాటు పడ్డాక కూడా ఆ గాడిద అడ్డదిడ్డంగా పడి, తన వొళ్ళంతా గాయాలు చేసుకోకుండా, నాలుగు కాళ్ళూ సరిగ్గా నేలకు ఆనించి నిలబడిపోయింది. ఆ గాడిద తీసుకొన్న జాగ్రత్తమూలంగా, దానివీపు మీద కరిచిపెట్టుకు కూర్చొన్న శాకకోపాంజాకు కూడా గోరంత గాయమైనా తగలలేదు.

అగాధం అడుగుభాగానికి సురక్షితంగా చేరామన్న విషయం బాగా రూఢిఅయిన అరగంటకు, శాంకోపాంజా మూసిన కళ్ళను తెరిచి, చుట్టూ కలయ చూశాడు. ఈ చీకటి కోణంలో నుంచి బయటకు పోయేందుకు ఏమూలనైనా మార్గం వున్నదేమోనని ఆ చీకటిలోనే చుట్టుపట్లవున్న ప్రదేశాన్నంతటినీ చేతులతో తడిమి చూశాడు. ఎక్కడా ఏమీ మార్గం వున్నట్లు తోచలేదు. మనిషి నీరుగారిపోయి, వుసూరు మంటూ ఒకమూల చేరగిలబడిపోయాడు.

అంతపాటు పడ్డప్పుడు పోయిన స్ఫురణ ఆ 'డాపుల్'కు యిప్పటికి తాని వచ్చినట్లు [illegible] పాటు వళ్ళు పైకి కనపడని గాయాలు దానికి ఎన్ని తగిలాయో యేమో కాని — అది ఒకటే గోడునా [illegible] ప్రతిధ్వ[illegible] మొదలు పెట్టింది. అది ఆ [illegible] నప్పుడల్లా, శాంకోపాంజాకు [illegible] తిప్పినంత [illegible] కష్టమొచ్చింది.

ఆ గాడిదను చూసి తాను ఎంత జాలిపడి, ఎంతగా కుమిలి కుమిలి ఏడిస్తే మాత్రం, యీ అర్ధ రాత్రివేళ, ఈ చీకటికోణంలో దాని బాధను తను ఎలా తగ్గించగలడు? ఇక రాత్రిలో మిగిలిన భాగ మంతా ఓపికగా యిక్కడే గడపటంకంటె గత్యంతరం లేదు. సూర్యోదయమైతే నైనా, ఆ వెలుగును బట్టి బయ టకు పోయేమార్గం ఎక్కడ వున్నదీ తెలుసుకోవచ్చు. అంతవరకు యిక్కడే పడివుండటం కంటే చేసేదేమీ లేదని తెలుసుకుని బరువుగా నిట్టూర్చాడు.

అలా నిట్టూర్పులతోనే రాత్రి అంతా గడి పాడు. తెల్లవారింది. తెల్లవారటమైతే తెల్లవారింది కానీ, అందువల్ల యీయనకు ఒరిగిపడ్డ మేలు ఏదీ జరుగలేదు. కాకపోగా యీ అగాధంలోనుంచీ బయటపడట మన్నది ఎప్పటికైనా ఎవరైనా భూమి మీద తిరిగే మనుష్యులు తనను గమనించి, కనిక రించి, పైకి లాగితేనే సాధ్యం అవుతుంది కానీ, తాను మాత్రం ఎంత ప్రయత్నించినా ఈ అగాధాన్ని ఎగబ్రాకి పోలేడని తేలిపోయింది.

ఎటువంటి స్థితిలోనూ మనిషి అన్నవాడికి ఆశ అన్నది లేకుండా పోదుగా! రెండు చేతులను దొప్పలాగ ముడిచి నోటిమీద పెట్టుకొని, ఊపిరి తిత్తులు చిరిగిపోయేటంత బిగ్గరగా కేకలు పెట్టటం మొదలుపెట్టాడు. ఆ పని అయినా, ఎంతసేపని చేయ గలడు? తాను పూర్తిగా అలసిపోవటమే తప్ప అందు

వల్ల వీసమెత్తు ప్రయోజనం లేకపోయింది. మనిషి అన్నవాడెవ్వడూ యిటు తొంగి అయినా చూడ లేదు.

ఇప్పట్లో బయటపడగలనన్న ఆశ నిరాశకాగా ఆతని దృష్టి 'డాపుల్' వైపుకు మళ్లింది. పాపం-దానికి ఎంత బాధగా వున్నదో ఏమో, తనంతట తను లేచి సరిగ్గా నాలుగు కాళ్లమీదా నిలబడలేక పోతున్నది. ఆస్థితి చూసేసరికి శాంకో పాంజాకు మళ్లీ కళ్లనీళ్లపర్యంతం అయింది. తానే పోయి, ఎలాగో తంటాలుపడి తనశక్తి సామర్థ్యాలన్నింటినీ వుపయోగించి, దానిని లేవదీసి నిల్చోబెట్టాడు.

'డాపుల్' కోసమని బార్టారియా ప్రజలు యిచ్చిన వులవలు నిన్నటితోనే అయిపోయాయి. ఇప్పుడు దానికింత తినటానికి ఏదన్నా పెట్టితే నైరా కాస్త కోలుకొంటుందేమో అనుకొంటే, ఆ వులవలూ లేవాయె! మళ్లా ఎప్పటికి అవి దొరుకుతాయో, తాను మళ్లీ ఎప్పటికి ఆ గాడిదకు ఆప్యాయంగా తిండిపెట్టగలడో తెలియని అయోమయ పరిస్థితి. ఏమి చెయ్యటానికీ అతనికి తోచలేదు. ఆలోచించాడు. తెగ ఆలోచించాడు.

చివరకు ఒక ఆలోచన తట్టింది. తను తినటం కోసం అక్కడ ఆ బార్టారియానగరంలో కొంత రొట్టెముక్కను అడిగి పుచ్చుకొన్నాడు కదా! అందులో యింకా కొంత మిగిలివుంది. దానిని తానూ

యింత పీక్కుతిని, ఆ చేత్తోనే ఆ గాడిదకు కూడా చిన్న చిన్న తుంపులుగా తుంచి పెట్టాడు. అలా దాని నోటికి రొట్టెముక్కలు అందిస్తూనే "ఏ పాటు తప్పినా సాపాటు తప్పదన్నారు. అదీ కాకుండా మనసు కలత పడినప్పుడు కడుపుకు యింత పడవెయ్యమని కూడా పెద్దలు అన్నారు. తినదగినది యిది అయినా ఒకటి దగ్గిరవున్నది కనుక తిను" అంటూ ఆ గాడిదను బుజ్జగించాడు. మరి ఆ గాడిదకు వీడు ఆడిన మాటలు ఏమైనా అర్థమైనాయో, ఏమో, - ఎంత సేపటి నుంచో మాటి మాటికీ మూల్గుతున్నదల్లా మానేసింది !

కడుపులో కాస్తంత తిండి పడేటప్పటికి శాంకో పాంజా మనస్సును ఆవరించిన మేఘాలు కొద్దిగా సర్దుకొన్నాయి. ఈ బిలంలోనుంచి బయట పడేందుకు మార్గం ఎక్కడైనా లేకపోతుందా అన్న ఆశతో దీక్షగా మళ్లీ వెదకటం ప్రారంభించాడు. అలా వెదుకగా వెదుకగా, ఒకమూలను ఓమాదిరి పెద్ద రంధ్రమొకటి వున్నట్లు తోచింది. శాంకో పాంజా తానొక్కడూ ముందుగా ఆ రంధ్రంగుండా పోయి చూతామని ప్రయత్నించాడు. ఆ సందు అంతకంతకూ యిరుకై, వొంగుని నడవటానికి కూడా కష్టమై పోయింది. చేతులుకూడా నేలకు ఆనించి, నాలుగు కాళ్ల జంతువులా ముందుకు పాకిపోయాడు. అలా పోగా పోగా కొంత సేపటికి ఒక విశాలమైన ఆవరణలో తేలాడు. దానికి పైగా ఒక రంధ్రం వున్నట్లున్నది.

అందులోనుంచి సూర్యరశ్మి పెద్ద దూలంలా వచ్చి నేలమీద పడుతున్నది. దానిని చూసేసరికి శాంకో పాంజా ప్రాణం లేచి వచ్చింది. గబగబా పరుగెత్తు కొంటూ పోయి తలపైకెత్తి చూశాడు. నిర్మలమైన ఆకాశం కంట పడేసరికి మనిషి వుప్పొంగిపోయాడు. మళ్ళీ వెనక్కి— ఆ రంధ్రం గుండా పాకుకూపోయి, తనూ తన గాడిద పట్టేటందుకు వీలుగా, ఆ రంధ్రాన్ని పెద్ద రాతిమొనతో తొలిచి వెడల్పు చేయటానికి పూనుకొన్నాడు. ఈపని గంట, గంటన్నర పట్టింది. ఎట్టకేలకు గాడిద కళ్ళేన్ని పట్టుకొని, తను వంగి నడుస్తూ ఆ రంధ్రంలోనుంచి యివతలకు వచ్చిపడ్డాడు. ఇలాగే మరొక దారి కనుపించకపోతుందా. అందులో నుంచి బయటకు వెళ్లి ఈ సజీవసమాధి తప్పించుకో లేకపోతామా అన్న ఆశ ఒకటి ఆతని మనస్సులో పాతుకుపోయింది.

దారులు వెదికే ప్రయత్నంలో శాంకో పాంజాగారు క్రిందా మీదా పడుతూ వుండగా, అక్కడ వీరకేసరి డాన్ క్విక్ సెట్‌గారి విషయం ఏమైందో కొంచెం చూద్దాం.

సరిగ్గా ఆరోజు వుదయాన్నే వీరకేసరిగారికి 'ఒకింత వీర విహారము సల్పిరావలెనన్న' కోరిక కలిగింది. ఆమాట 'డ్యూక్' గారితో చెప్పి, ఆయన అనుమతి మీదనే, భవనం వదిలి బయలుదేరాడు-తన ముద్దుల ముసలి గుర్రం 'రోజి నాన్‌టీ'ని ఎక్కి. కోడి

కూతత్తో బయలుదేరిన వాడు, అప్పటినుంచీ మొదలుకొని బాగా ఎండ ఎక్కేదాకా, అడ్డమైన చోటల్లా తిరిగి, ఏవేవో భూతాలు ప్రేతాలు రాక్షసులు తన మీదకు విరుచుకు వచ్చినట్లు, తాను వాళ్లనందరినీ ఒక్క కత్తివేటుతో పడగొట్టినట్లు ఊహించుకొని, కులుకుతూ డ్యూక్ భవనం వైపుకు వెళ్తూ, ఆ వుత్సాహంలో తన గుర్రాన్ని ఒక అగాధంమీదికి తోలాడు. సమయానికి గనుక తను మేలుకోక పోతే, తాను తన గుర్రమూ కూడా-ఆ శాంకోపాంజా, వాడి గాడిదా పడ్డట్లే - గోతిలో పడేవాళ్ళే. అన్నట్లు - శాంకో పాంజా పడివున్న గొయ్యి కూడా అదే. త్రుటి మాత్రంలో జరుగవలసిన ప్రమాదం వెంట్రుక వాసిలో తప్పిపోయిందని తెలిశాక, డాన్ క్విక్సెట్ గారి గుండె ఒకసారి ఆగిపోయి, మళ్లా మహా వేగంగా కొట్టుకోవటం మొదలు పెట్టింది. ముచ్చెమటలు పోసేశాయి.

గుర్రం దిగి ఆ గొయ్యి ఎంతలోతు వున్నదో, అందులో గనక తనూ తన గుర్రమూ పడివుంటే ఎంతలావు ప్రమాదం జరిగేదో చూడ - వచ్చాడు. తీరా గొయ్యిదగ్గిరకు వస్తే, అందులోనుంచి ఏవేవో మనుష్యుల మాటలు 'గుంయి' 'గుంయి' మంటూ వినిపించాయి. డాన్ క్విక్సెట్ గారు చాలా ఆశ్చర్యపోయాడు. ఈ గోతిలో ఏదో భయంకర రాక్షసి దాక్కొని వున్నదనీ, దానిని యిప్పుడు బయ

టకు లాగి బుద్ధిచెప్పే అవకాశం తనకు యిలా వాళ్లో వచ్చి పడుతున్నదనీ అప్పుడే వ్యూహించుకొన్నాడు.

"పైన ఎవరైనా మానవ మాత్రులు వున్నారా! ఈ చీకటికోణంలోపడి సజీవ సమాధి అయిపోతున్న మాజీ గవర్నరుపై కనికరించి పైకి తీయగల కరుణామయులెవరు లేరా ?" అంటూ శాంకో పాంజా భూమి అడుగొనుంచీ తెగ గగ్గోలుగా అరుస్తున్నాడు. ఆ అరుపుల మధ్యను ఎక్కిళ్లు కూడా వినవస్తున్నాయి.

ఆమాటల తీరు, ఆ గొంతూ అదీ వింటూ వుంటే డాన్ క్విక్ సెట్ గారికి అది శాంకోపాంజా గొంతేమో నన్న అనుమానం తగిలింది. అనుమానం తగిలీ తగలటంతోటే, మనిషి కంగారెత్తి పోయాడు. ఆ అగాధంలోకి వంగి "ఎవరు వారు? సహాయ మర్థించు ఆ కంఠమెవ్వరిది?" అని బిగ్గరగా అడిగాడు.

"ఇంకెవరండీ. దౌర్భాగ్యుడు శాంకోపాంజాకు తప్పితే యింతటి దుర్గతి మరెవ్వరికైనా పట్టుతుందా! లామంచా వీరుడు డాన్ క్విక్ సెట్ గారి బంటుగా బ్రతుకుతూ, లేనిపోని ఆశలకు పోయి 'బాక్టారియా' దీవికి గవర్నరు గిరీ వెలిగించి నందుకు, యింతటి శిక్ష అనుభవించటం శాంకోపాంజాగాడి కొక్కడికే తగు" నంటూ తనపై తనకే పుట్టుకొచ్చిన రోతను కూడా వెళ్ల గ్రక్కుతూ బదులు పలికాడు.

ఈమాటలు వినేసరికి డాన్ క్విక్ సెట్ గారి ఆశ్చర్యం రెండింత లైంది. ఆ పలుకుతున్న మనిషి

నిజంగానే శాంకోపాంజా అవునా ? - అథవా, శాంకో పాంజాయే అయితే, గవర్నరుగా వెళ్లినవాడు భూమి అడుగుకి ఎల్లా వచ్చాడా అని, ఆయన తిక మక పడ్డాడు. ఇందులో ఏదో నిగూఢమైన రహస్యం యిమిడి వుంటుందని తోచినమీదట, "నీవు నిజముగా ఎవరవో, యిందు ఎట్లు ప్రవేశించితివో, యిప్పుడు నీ వితరులవల్ల నపేక్షించు సహాయ మెట్టిదో వేగమె వివరింపుము" అంటూ గద్దించి అడిగాడు వీరకేసరి.

భూమి అడుగున వున్న శాంకోపాంజాకు యిప్పటికి అనుమానం తగిలినట్లుంది - "అరె! గొంతు, మాటలనూబట్టిచూస్తే, వీరకేసరి డాన్ క్విక్ సెట్ గారేననిపిస్తుంది. నిజంగా నాస్వామి డాన్ క్విక్ సెట్ గారేనా అక్కడ వున్నది?" అంటూ ఆశ్చర్యాతిరేకంతో అడిగాడు.

ఇంతదూరం వచ్చాకకూడా సొరంగంలో యిరుక్కుపోయిన వ్యక్తి, నిజంగానే శాంకోపాంజా అయివుంటాడన్న నమ్మకం డాన్ క్విక్ సెట్ గారికి కుదరలేదు. "ఔను! ఏను వీరకేసరి డాన్ క్విక్ సెట్ గారినే! కానీ - నీవు నిజముగా ఎవరివో, నాకు బోధపడక యున్నది. కాన యిప్పటికైనను నీ నిజనామము నెరుకపరచి, నీ వపేక్షించుచుండు సహాయమును నాచే పొందుము." అన్నాడు.

దీంతో శాంకో పాంజాకు తల తిరిగి పోయింది. ఈ సజీవసమాధిలోనుంచి బయటపడే అదృష్టం

ఇక లేదని నిరాశ చేసుకొని, మనుష్య మాత్రుడు ఎవరైనా యీ దిక్కు రావటమే అసంభవమేమో అని అనుకొంటూ వుండగా, సాక్షాత్తు తన స్వామి డన్ క్విక్ సెట్ గారే తారసిల్లినందుకు వాడు సంతోషిస్తూ వుండగా, అట్టి డన్ క్విక్ సెట్ గారే 'నీవు శాంకోపాంజావు అవునో కాదో ముందుగా చెప్పుము'ని ఎన్నిసార్లు చెప్పినా వేధిస్తూ వుంటే— పాపం—ఆ శాంకోపాంజాకు తల తిరిగిందంటే ఆశ్చర్యం ఏముంది! ఎలాగైనా సరే, తను శాంకోపాంజాయేనని ఆయనకు నమ్మకం కలిగేటట్లు చెయ్యగలిగితే అంతేచాలు ననిపించి "దైవసాక్షిగా నేను శాంకోపాంజానే నండీ, మహాశయా! నిన్న - అంటే —నిన్ననే ఆ దిక్కుమాలిన గవర్నరుగిరీకి రాజీనామా యిచ్చేసి తమరిని కలుసుకొందామనే యిటు తగలడ్డాను. చీకటిలో ప్రయాణం చేయటం ఎందుకు లెమ్మని నాగాడిదను ప్రక్కదారికి పట్టించి వస్తూండగా యీ చీకటి కోణంలో నేనూ, నాగాడిదా యిద్దరమూ అమాంతం పడిపోయాం. ఇదుగో చూడండి! నా గాడిద కూడా యిక్కడే వుంది. ఎంతో ఆశతో మీ గొంతు వినవచ్చే దిక్కే చూస్తోంది." అన్నాడు.

శాంకోపాంజా అంటున్న యీ మాటలు ఆ గాడిదకు అర్థమైనాయో యేమోనన్నట్లుగా, అది పెద్ద ఆక్రందనాలు మొదలుపెట్టింది. ఇంత సేపటి నుంచి శాంకోపాంజా అంత గోలపెట్టి చెప్పుతున్నా, వాడు

నిజంగానే శాంకోపాంజాయేనన్న నమ్మకం కుదరని డాన్ క్విక్సెట్ గారికి, ఆ గాడిద అరుపులు వినేసరికి, తక్కున నమ్మకం కుదిరిపోయింది. గాడిద అరుపును బట్టే ఆయన పోల్చుకొన్నాడు-ఆగాడిదను అంటి పెట్టుకొని వుండే ప్రాణి శాంకోపాంజా తప్ప వేరెవ్వరూ కాలేరని.

"అట్లయిన నీ వొకింత దనుక యిందే వుండుము. నేనిదే పోయి, డ్యూక్ గారి నడిగి, కొంత మందిని మనుష్యులను వెంటబెట్టుకొని వచ్చెదను" అంటూనే పరుగెత్తుకొంటూ పోయి, గుర్రం మీద ఎక్కి కూర్చొని, హుటాహుటిని డ్యూక్ భవనం చేరాడు. అక్కడ పదిమంది మనుష్యులను కూడ గలుపుకొని కొన్ని మోకులు, తాళ్లు, కర్రలు, గిలకలు పట్టించుకొని, యీ గుంటకడ్డకు వచ్చాడు. వచ్చి రావటమే తడవుగా, ఆ మోకులు అవీ దింపించి, నానాయాతనలు పడి, చివరకు ఎట్లాగైతే నేం శాంకోపాంజాను, అతని గాడిదనూ పైకి లాగించాడు. పగటివెలుగు కంటబడి, పైను పొలాలమీదినుంచి వచ్చేగాలి తగిలేసరికి, శాంకోపాంజాకు సొమ్మసిల్లి నంత పని అయింది.

ఈలోగా ఆ గుంటదగ్గర పెద్ద గుంపు చేరి పోయింది. బావిలో పడ్డమనిషిని పైకి తీసినంత యిదిగా వాళ్లందరూ ఆ వేడుకను చూస్తూండిపోయారు. శాంకోపాంజా తేరుకొన్నాక, తాను ఎటువంటి

పరిస్థితులలో గవర్నరుగిరీని వదిలేశాడో అదంతా డ్యూక్ గారికి నచ్చచెప్పటానికి గాను భవనానికి పోదా మన్నాడు. ఇద్దరూ వాహనాలు ఎక్కి బయలు దేరారు. జనం కూడా వీళ్ల వెనకాలే డ్యూక్ భవనం దాకా వచ్చారు.

తీరా భవనాన్ని సమీపించి సింహద్వారంలో కాలు పెట్టేసరికి, శాంకో పాంజా వెంటనే డ్యూక్ సమక్షంలోకి పోవటానికి ఒప్పుకోలేదు. తనతో పాటు ఆ అగాధంలో పడిపోయిన డాపుల్ విషయం ముందుగా చూడవలసిన బాధ్యత తనపై వున్నదని చెప్పి, అక్కడ వున్న కొందరు నౌకర్లను బ్రతిమాలి, ఆ గాడిదకు యింత మంచిరకం గడ్డి పెట్టించి, మంచినీళ్లు తాగించి, చల్లని చోట కట్టేసి, దాని వెన్ను కాసేపు నిమిరించి మరీ వచ్చాడు.

అప్పటి కప్పుడే డ్యూక్ దంపతులకు శాంకో పాంజా గవర్నరుగిరీకి రాజీనామాను యిచ్చిన విషయమూ, వస్తూ వస్తూ ఆ గుంటలో పడిపోయిన విషయమూ, డాన్ క్విక్ సెట్ గారు వాణ్ణి వుద్ధరించిన వైనమూ అన్నీ, వారి నౌకరులవల్ల తెలిసిపోయాయి. ఐనప్పటికీ శాంకో పాంజా తన యజమానితో బాటుగా వచ్చి, తాను డ్యూక్ భవనం వదిలి వెళ్లినది మొదలు యీ క్షణంవరకు జరిగిన అన్ని విషయాలూ, ఎక్కడా దాపరికం లేకుండా పూస గుచ్చినట్లు చెప్పుకుపోతూ వుంటే, వాళ్లు ఆ విషయా లన్నిటిని

అదే ప్రథమ పర్యాయం వింటున్నప్పుడు ఎంత శ్రద్ధగా వింటారో, అంత శ్రద్ధగానూ విన్నారు.

శాంకోపాంజా అంత నిష్కల్మషమైన హృదయంతో, ప్రతిచిన్న విషయమూ జరిగింది జరిగినట్లు చెప్పకుపోతుంటే, డ్యూక్ గారి మనస్సు కరిగి పోయింది. ఈషణ్మాత్రమైనా కపట మెరుగని యీ శాంకోపాంజాకు యింకేదైనా మంచి వుపకారం చేయాలనిపించింది ఆ డ్యూక్ గారికి. శాంకోపాంజా తన దీనగాథను చెప్పటం ముగించేసరికి, డ్యూక్ గారు వున్నచోటినుంచి అమాంతం లేచిపోయి, ఆతణ్ణి గట్టిగా కౌగలించుకొని, గవర్నరుగిరీని ఆతడు అంత త్వరలోనే త్యజించినందుకు తన విచారాన్ని వెల్లడిస్తూనే, తన యిలాకాలో ఆ గవర్నరుగిరీకంటే కష్టం తక్కువైనదీ, లబ్ధి ఎక్కువ వచ్చేదీ అయిన నౌకరీ వేరేదైనా త్వరలో ఏర్పాటు చేస్తానని మాట యిచ్చాడు. డ్యూక్ భార్యగారికి కూడా శాంకో పాంజాను ఆ స్థితిలో చూస్తే చాలా జాలి పుట్టు కొచ్చింది. వంటమనుష్యులను, ఆస్థానవైద్యులను ప్రత్యేకం పిలిపించి, శాంకోపాంజాగారికి యిష్టమైన పిండివంటలన్నీ వండిపెట్టమని ఆ వంటవాళ్ళకూ, ఆయనకు తగిలిన దెబ్బలకు మంచి మందులువేసి చప్పున నయం చేయమని ఆస్థానవైద్యులకూ హుకుములు వేసింది.

శాంకోపాంజాకు ఆ వైభోగమైనా అట్టే కాలం అబ్బలేదు. ఏ నమ్మినబంటు శాంకోపాంజా గాడి కోసమైతే తాను యింతకాలమూ కలవరిస్తూ, ఆవియోగభారాన్ని భరించలేక కుమిలిపోతూ గడుపుతూ వున్నాడో, అట్టి శాంకోపాంజా, గవర్నరు గిరీని కాలదన్ని, మళ్ళీ తనవద్దకు ఎప్పుడైతే వచ్చాడో, అప్పుడే, వీరకేసరి డాన్‌క్విక్‌సెట్‌గారికి వీర విహారాలవైపుకు గుబులు తిరిగింది. అదీ కాక, యిప్పటి కప్పుడే వారం పదిరోజులుగా యీ డ్యూక్‌గారి భవనంలో చేరి, భోగభాగ్యాలతో గడిపివేసి వున్నమీదట, యిక ఒక క్షణమైనా యింతటి సోమరిపోతు బ్రతుకు బ్రతకటం తనవంటి వీరుని లక్షణం కాదనిపించి, డాన్ క్విక్‌సెట్‌గారు ఒకనాడు డ్యూక్ దంపతుల వద్దకు వెళ్ళి తామిక శెలవు పుచ్చు కొంటున్నామని చెప్పాడు.

వారు ఉభయులూ కూడా వీరకేసరిగారు యింత త్వరలో వెళ్ళిపోతా నన్నందుకు మనస్సులు కష్టపెట్టుకొన్నారు. ఏమైతే నేం - వాడెంత బ్రతిమాలినా డాన్‌క్విక్‌సెట్‌గారు వెళ్ళి తీరవలసిందే నన్నాడు. చివరకు వాళ్ళకు ఎంత అయిష్టంగా వున్నా వీరకేసరిగారి నిర్గమనానికి వారు అనుమతించక తప్పలేదు.

మరునాటి వుదయం డాన్ క్విక్‌సెట్‌గారు, తన ముద్దుల ముసలి గుర్రం రోజినాన్‌టీని ఎక్కి, డాపుల్

నెక్కిన బంటు శాంకోపాంజా వెన్నంటిరాగా, డ్యూక్ భవనంనుంచి బయలుదేరి, బార్ సిలోనియా పట్టణంవైపుకు పయనించాడు. వీరకేసరిగారు బయలుదేరిన ముహూర్తాన డ్యూక్ దంపతులు వీధి గుమ్మం దాకా వచ్చి, అశ్రుపూరిత నయనాలతో వీరికి వీడ్కోలు యిచ్చారు. ఆయన ఎక్కిన గుర్రం కాలు కదిపి బయలుదేరేసరికి, కోటమీదనుంచి కాపాలావాళ్ళు కొందరు, విచార సూచకంగా బాకా లూదారు.

# 21

డ్యూక్ భవనంనుంచి బయలుదేరిన వీరకేసరి డాన్ క్విక్ సెట్ గారు, మాజీ గవర్నరు శాంకోపాంజా సమేతుడై బార్ సిలోనియా పట్టణానికి చేరుకున్నారు. ఆ పట్టణం సముద్రతీరాన వున్నది. వీ రుభయులు తమజీవితకాలంలో ప్రప్రథమంగా సముద్రాన్ని సందర్శించటం జరిగింది. అంత విశాలమైన సముద్రతీరాన్ని చూసేసరికి యిద్దరి మనస్సులూ వుప్పొంగిపోయాయి. ఇద్దరూ తమతమ వాహనాలను నిలిపేసి ఆ సముద్రంకేసే చూస్తూ చాలాసేపు వుండిపోయారు. తరంగంమీద తరంగంగా తరంగాలు వచ్చి ఒడ్డుమీద బద్దలైపోతూవుంటే, అదంతా ఎంతో ఆశ్చర్యకరంగానూ, ఆహ్లాదకరంగానూ తోచి, వా రుభ

యులూ కళ్ళు అప్పగించి ఆదిక్కేచూస్తూ చాలాసేపు వుండిపోయారు.

వీరి దృష్టిని యింతగా ఆకర్షించినది సముద్ర మొక్కటే కాదు. ఆ రేవులో ఎన్నో ఓడలు బారులు తీటి నిల్చొనివున్నాయి. ప్రతి ఓడమీదా రంగురంగు పతాకాలు ఎగురుతున్నాయి. అంతకుముందు అంత పెద్ద జలరాశినికానీ, అంత పెద్దఓడలను కానీ చూసి ఎరుగని కారణంచేత వీరుభయులు నోరు తెరచి ఆవంకనే చూస్తూవుండగా, రంగురంగులదుస్తులు ధరించిన కొందరు గుర్రాలు ఎక్కి- సైనికవిన్యాసాలు ఏవో కాసేపు చూశారు. వా రా విన్యాసాలు చేస్తున్నంత సేపూ, రణభేరీలు, శంఖనాదాలు వినిపించాయి.

డాన్ క్విక్ సెట్ గారు యీ విన్యాసాలు ఎంతో ఔత్సుక్యంతో చూస్తూ, అందులో పూర్తిగా మునిగి పోయి వుండగా, ఆశ్వికదళంలోని ఒక భాగం చీలి యీాయనను సమీాపించింది. అందులో ఒకడు డాన్ క్విక్ సెట్ గారివద్దకు వచ్చాక, ఆయనను వుద్దేశించి "వీరవర్గానికి ధృవతారవై వెలసిన ఓ వీరకేసరీ, నీ కిదే మా పురజనుల తరఫున స్వాగత మిస్తున్నాను" అంటూ తనూ, తనతోపాటుగా వచ్చిన యితర ఆశ్వికులు అందరూ కలిసి డాన్ క్విక్ సెట్ గారి చుట్టూ తిరిగి ప్రదక్షిణాలు చేయటం ప్రారంభించారు. సంగ తేమిటో అర్థం కాకపోయినా, తన నీవిధంగా యింతమంది గొప్పచేసి పలుకరించి ప్రదక్షిణాలు చేస్తున్నందుకు

డాన్ క్విక్ సెట్‌గారు సంబరాలు పడ్డాడు. చేట అంత ముఖం చేసుకొని శాంకోపాంజావంక చూస్తూ వుండి పోయాడు.

ఇందాక యీాయనకు స్వాగతం పలికిన ఆ ఆశ్వికుడే మళ్ళీ కల్పించుకొని, తను వీరకేసరిగారి వీరవిహారాలనుగూర్చి, ఆయన సాధించిన విషయాలనుగూర్చి విని వున్నానని చెప్పి, ఆయనను తన యింటికి వచ్చి తన ఆతిథ్యం స్వీకరించవలసిందిగా కోరాడు. ఆనంద పారవశ్యంలో మునిగి తేలుతున్న డాన్ క్విక్ సెట్‌గారు అందుకు ఒప్పుకున్నారు.

ఈసారి డాన్ క్విక్ సెట్‌గారికి ఆతిథ్య మిచ్చిన వ్యక్తి పేరు డాన్ ఆన్‌టానియో మొరీనో అని, తరువాత వాళ్ళు మాట్లాడుకొన్న మాటల సందర్భంలో వెల్లడి అయింది. ఆయనకు చాలా డబ్బూ అదీ వున్నట్లు కూడా ఋజువు అయింది. మనిషి కూడా చాలా మంచివాడే!

ఆ డన్ ఆన్‌టానియోగారు యీ వీరుణ్ణి, ఆయన బంటును తన యింటికి పిలుచుకుపోయి, వారికి సకలోపచారలు చేయించి, చక్కని తిండీ అదీ పెట్టి, పడుకోవటానికి మంచి పక్క చూపించాడు. వీరికి కావసిలన సౌకర్యాల విషయంలో అయితే ఏవిధమైన లోపమూ చేయలేదు గానీ, ఆ డన్ ఆన్‌టానియో గారు యీవీరుణ్ణి చాలాసార్లు ఎగతాళిపట్టించాడు. కల్ల కపట మెరుగని డన్ క్విక్ సెట్‌గారు మాత్రం,

తనకు ఆతిథ్యమిచ్చిన ఆవ్యక్తి తనను ఎగతాళి పట్టిస్తున్నాడని అనుమానించనైనా అనుమానించకుండా, ఆయన ఎట్లా ఆడిస్తే అట్లా ఆడాడు; ఆయన చూపెట్టిన ప్రతిదీ నమ్మాడు.

డాన్ ఆన్టానియో యీ వీరుణ్ణి ఎట్లా ఎగతాళిపట్టించాడో తెలియచెప్పటానికి ఒకటి రెండు వుదాహరణలు వ్రాస్తాను.

ఒకరోజు సాయంకాలం అలా షికారుకు పోయి వద్దాం రమ్మని యీ వీరుణ్ణి ఒక కంచరగాడిదను ఎక్కించాడు. ఆ గాడిద వీపుమీద పట్టుపీతాంబరం పరచివున్నది. దాని మెడచుట్టూ కుచ్చులు కట్టారు. చెవులకు కుప్పెలు తగిలించారు. ఇంతగా అలంకరించిన వాహనం దొరికినందుకు మురిసిపోయాడన్నమాటే కానీ, తన వీపుకు ఏదో అట్ట అంటగట్టారన్న విషయం ఆ డాన్ క్విక్ సెట్ గారు గమనించనేలేదు. ఆ అట్ట మీద యీయనబిరుదూ, యీయనపేరూ అన్నీ వ్రాసివున్నాయి. ఆ అట్టను చదివిన ప్రతివాడూ యీయన వెనుకపడ్డాడు. అంతాచేసి ఒక ఫర్లాంగు దూరమైనా పోయాడో లేదో, యిలోగా యీయనగారి వెనకాల బోలెడంతమంది మనుషులు గుమిగూడి, యీయనపేరు బిగ్గరగా వుచ్చరించి, పకపకా నవ్వడం మొదలుపెట్టారు. సముద్ర తరంగాలలాగా వాళ్ళకేకలు ఆగిఆగి వినిపిస్తూన్నకొద్దీ, యీ అఘాయికుడు మురిసిపోవటం మొదలుపెట్టాడు. తాను ఆ పట్ట

ణానికి వచ్చి యింకాపట్టుమని రెండురోజులైనా కాలేదే, అప్పటికప్పుడే తన పేరుప్రఖ్యాతులు యింతమందికి ఎలా తెలిసిపోయాయా అని ఆయన ఆశ్చర్యపోయాడే కానీ, వీపుకు తగిలించివున్న అట్టవిషయం కనుక్కోనే లేకపోయాడు.

డాన్ ఆన్టానియో మరొక చమత్కారం కూడా చేశాడు. ఆయన యింట్లో బల్లమీద మొండెం లేని తలకాయ ఒకటి కంచుతో చేసిన విగ్రహం వున్నది. తా నేవేవో మంత్రాలు వేసినట్లువేసి, ఆ విగ్రహంచేత ఎవ రడిగిన ప్రశ్నకైనా సమాధానాలు చెప్పిస్తా నన్నాడు. ఆ యింట్లో వున్న పదిమందినీ పిలిచి ఎవళ్ళకు యిష్టమైన ప్రశ్నలు వాళ్ళను వేయమని చెప్పాడు. వాళ్ళు అడిగిన ప్రతి ప్రశ్నకూ, అవతల గదిలోవున్న ఒక మనిషిచేత, యీ కంచువిగ్రహం నోట్లోవరకు వున్న ఒక గొట్టంద్వారా సరైన సమాధానాలు చెప్పించాడు.

డాన్ ఆన్టానియో చేసిన యీ చిలిపిపనుల మాటకేం గానీ,—ఈయన యిక్కడ వుండగానే జరిగిన అతి ప్రధాన సంఘటన ఒకదానినిగురించి మాత్రం చెప్పితీరాలి. ఆ సంఘటనతోడనే డాన్ క్విక్సెట్ గారి వీరవిహారాలు అంతమైనాయి. వీరవిహారాలు అంతం కావటమంటే సామాన్యమైనవిషయమా? అందులోనూ వీరకేసరి డాన్ క్విక్సెట్ గారి వీరవిహారాలు

ముగింపు కావటమంటే దానిని చులకన చేయటానికి అసలే వీలులేదు.

బార్సిలోనియా పట్టణంలో కొన్నిరోజులు గడిచాక, వీరకేసరిగారు ఒకనాటి ప్రాతఃకాలసమయాన వాహ్యాళికై అలా అలా తిరుగుతున్నారు.



ఆ సమయంలో తనలాగే డాలూ, శవాలూ, వృక్షకవచమూ, టోపీ ధరించి, గుఱ్ఱమెక్కి— తనవైపుకే వస్తున్న మరొక వీరుడు యీయనగారి కంటపడ్డాడు. ఆ వీరుడిచేతనున్న డాలుపై తెల్లనిరంగులో చిత్రించిన చంద్రబింబం ఒకటి వున్నది. ఆ వీరుడు యీయనకు బాగా దగ్గరదాకా వచ్చాక—

"డాన్ క్విక్ సెట్ వీరాగ్రణీ! ఏను శ్వేతశశాంకుడను పేరబరగు వీరుడను. నే మున్ను సలిపిన వీరవిహారోదంతములు మీరు వినియే యుందురని నమ్ముచున్నాడను. నే నిప్పుడు తమరినే అన్వేషించుకొనుచు ఇందు వచ్చితిని. అందుకుగల కారణమును యిదే వివరించెదను. నా ప్రేయసి-ఆమె నామధేయాదులు ఏవి అయిననేమి?-ఆమె, నీ ప్రేయసిఅయిన ఆ టొబోసో ప్రాన్తి డల్‌సీనియా రాకుమారిని మించిన అందగత్తె యని నీచే యుద్ధము చేసియైనను ఒప్పించుటకే యిట కేతెంచితిని. మనము సలుపబోవుయుద్ధక్రీడకు సంబంధించినషరతుల నిదే పేర్కొనుచున్నాడ. అంతిమవిజయము నాకే సిద్ధించినచో, నీవు నీఆయుధములను, కవచమును వెంటనే నా స్వాధీనము చేయుటయే కాక, మరియొక సంవత్సరము గడచునంతవరకు ఎట్టి వీరవిహారములజోలికిపోబోక, కత్తి పట్టుకొనక, మీ గృహమందే మణిగి యుండవలెను. అట్లుగాక యీ యుద్ధక్రీడయందు అంతిమ విజయము నీపరమే యగుపక్షమున నా అసువులు నీ అధీనమందుంచెదను. నా అశ్వము, ఆయుధ

ములు అన్నియూ నీకు తక్షణమే అప్పగింతును. అంతియే కాదు—నేను లోగడ ఏ ఏ సందర్భములలో పోరుసల్పి విజయములను సాధించితినో, ఆ గౌరవ మంతయు నీకు సంక్రమింపచేసెదను. నాకుగల వ్యవధి యీ ఒక్కదినమే కనుక, నేను విధించిన పై షరతుల విషయమేమో సత్వరమే తెలుపుము—" అంటూ సవాలు చేశాడు.

ఈ వీరు డెవరో యిలా అర్థాంతరంగా వచ్చి పడటమే కాక, యీవిధంగా తనను సవాలు చేసినందుకు డాన్ క్విక్ సెట్ గారు చాలా ఆశ్చర్యపోయాడు. ఆ సవాలు చేసిన వీరుడు పెద్ద బొంగురు గొంతుకే పెట్టుకు అరుస్తూవుంటే యీయనకు బలే చిరాకువేసింది. అయినా—పైకిమాత్రం తానెంతమాత్రమూ కంగారు పడనట్లు, ఎంతో గంభీరంగా వుండిపోయి, ఆయన సవాలుకు తను ఈవిధంగా సమాధానం యిచ్చాడు. –

"ఓ శ్వేతశశాంకవీరుడా! నీ వెవరవో, నీ వింతకుముందు సాధించిన విజయము లెట్టివో, వాని గూర్చి నే నిసుమంతయు వినియుండలేను. ఆ మాట ఎట్లున్నను, నీవిప్పుడు పలికెడి వైఖరినిబట్టి చూడ నీ వింతవరకును ఆ అనన్యరూపసి, అంబాలరాణి, ముత్యాలకోవ, డల్ సీనియా రాకుమారిని చూచి యైనయుండలేదని తేటతెల్లమయ్యెడిని. ముల్లోకము లలో ఆమెను మించిన అందగత్తె మరొకతె కలదని, వుండగలదని భావించుటయే దోసగు. నీవా విషయ

మును గుర్తించక ఆమె అందమును కించబరుచ సాహసించుచున్నావు కనుక, నీ సవాలును నేను అంగీకరించుచున్నాను. యుద్ధమునకు సంబంధించి నీవు నిర్ణయించినవానిలో ఒక్కటితప్ప, మిగిలిన అన్ని షరతులకు ఒప్పుకొనుచున్నాను. ఆ షరతు ఎట్టిదనిన— నాచే నీవు పరాజితుడవైనపక్షమున, నీవు లోగడ సాధించిన విజయముల తాలూకు గౌరవము నంతటినీ నాకు ధారాదత్తముచేసెద నంటివి. అది మాత్రము నాకు యిష్టము లేదు. ఏలనన— ఆ విజయములవల్ల లోగడ నీకు సిద్ధించినది కీర్తియో, అపకీర్తియో నేను ఎరుగను. కాన యింతమటుకు నాకు లోకమునందు ఎట్టి ఖ్యాతి గలదో, అదియే చాలును గానీ, నీ కీర్తి అపకీర్తులతో నాకు పనిలేదు. వేగమె మన కనువగు యుద్ధభూమిని వెదికి, యుద్ధమునకు సన్నద్ధుడవు కమ్ము!"

ఈ యిద్దరు వీరులు యుద్ధానికి తయారై, అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకొంటూ వుండగా, యీ వార్త పట్టణమంతా పాకింది. పట్టణాధికారి(వైస్రాయ్)గారికికూడా తెలిసింది. ఆ వైస్రాయ్ గారికి, డన్ ఆన్టానియో డాన్ క్విక్ సెట్ గారిని తెచ్చి తన యింట్లో అట్టే పెట్టుకొన్న విషయమూ, ఆ డన్ క్విక్ సెట్ గారిని యీ డాన్ అన్ టానియో గారు రకరకాలుగా ఎగతాళి పట్టిస్తున్న వైనమూ అన్నీ తెలుసు. ఇప్పుడు డాన్ క్విక్ సెట్ గారితో

యుద్ధం చెయ్యటానికి మరొక వీరుడు రావట మన్నది కూడా, డాన్ ఆన్టానియో అతనిమీద ప్రయోగించిన మరొక చమత్కారమై వుండవచ్చునని ఆ వైస్రాయ్ ఆశపడ్డాడు. కానీ తీరా ఆ యుద్ధభూమికి వచ్చిచూస్తే, తనలాగే ఆ డాన్ ఆన్టానియో కూడా యీ యుద్ధవార్తను పైవారిమూలంగా విని, అంతకు ముందే నురుసులు కక్కుకొంటూ అక్కడికి పరుగెత్తి వచ్చాడు. వైస్రాయ్ ఆయనను సమీపించి అడిగితే కూడా యీ క్రొత్తవీరుడు ఎవరో, యీ యుద్ధం నిజమైందీ లేక వేళాకోళానికి జరుగబోతున్నదీ తనకు ఎంతమాత్రమూ తెలియదని చెప్పాడు.

ఇప్పటికప్పుడే డాన్క్విక్సెట్గారు తన ముద్దులగుర్రం రోజినాన్టీకి పౌరుషం తెప్పించి యుద్ధానికి సిద్ధమౌతున్నాడు. ఆ రెండో వీరుడు కూడా తన గుర్రండొక్కల్లో తాపులుతన్ని రోజినాన్టీమీదికి వుసిగొల్పాడు. ఆ రెండో వీరుడు ఎక్కిన గుర్రం ఎంతదైనా, రోజినాన్టీకంటే చాలా బలమైన గుర్రం. అది వచ్చిన ఆ విసురుకు రోజినాన్టీ, ఆ రోజినాన్టీ మూపు నెక్కిన వీరకేసరి, యిద్దరూ నేలమీద పడిపోయారు. ఎప్పుడైతే తన ప్రత్యర్థి నేలమీద పడిపోయాడో, అప్పుడే ఆ శ్వేతశశాంకవీరుడు తన గుర్రాన్ని ఠక్కున ఆపేసి, కత్తిని తీసి క్రింద పడివున్న డాన్ క్విక్సెట్గారి గుండెలమీదికి గురిచూసి పట్టుకొని:—

"వీర కేసరీ! ఓడిపోయితివి. యుద్ధాత్పూర్వమే నేను నిర్ణయించిన షరతుల కన్నిటికీ ఒప్పుకొననిచో నీవిక మృతవీరులలో జమఅయ్యెదవు. గుర్తించు కొనుము." అంటూ హెచ్చరిక చేశాడు.

గుర్రంమీదనుంచీ విసిరివేయబడటంవల్ల తగిలిన దెబ్బల మూలంగానూ, పరాయి వీరుడిచేతిలో పరాజయం పొందవలసివచ్చినందువల్ల కలిగిన ఆవేదనమూలంగానూ, డాన్ క్విక్ సెట్ గారి గొంతుక హీనస్వరం పడిపోయింది. అయినాసరే ఎలాగో మాట పెకలించుకొని "యీ మూడు లోకాలలోనూ ఆ టొబోసో రాజ్ఞి డల్ సీనియాను మించిన అందగత్తె 'నభూతో న భవిష్యతి' ఆమె అందచందములు, గుణగణములు అనన్య సామాన్యము లన్న నాకుగల విశ్వాసము చెదరిపోవకమునుపే, వీరుడుగా నే నార్జించిన ఖ్యాతి వసివాడకమునుపే, నీ కరవాలమును నాకంఠసీమయందు గ్రుచ్చి, నా ప్రాణములను తీసివేయుము." అంటూ బ్రతిమాలుకొన్నాడు.

"వలదు, వలదు. నే నంతటి దారుణ కార్యమును చేయనోపను. డల్ సీనియా రాకుమారి అందచందములను గూర్చిన మీ అభిప్రాయములు మార్చుకొనక పోయిన మానె. మీరుమాత్రము నేడు మొదలుకొని సరిగా నొక సంవత్సరకాలము యింటిపట్టుననే యుండి, వీరవిహారములజోలికి పోబోనని మాట

యిచ్చిన చాలును; మిమ్ములను ప్రాణములతో విడచెదను.” అంటూ ఆ వీరుడు వుదారంగా పలికాడు.

పరాభవంపాలైన వీరకేసరి డాన్ క్విక్ సెట్ గారు అందుకు ఒప్పుకొన్నారు. అతిప్రయత్నంమీద లేచి రెండుకాళ్ళమీదా నిలబడగలిగారు. ఈలోగా విజయం సాధించిన రెండో వీరుడు యిక అక్కడ ఒక్కక్షణమైనా ఆగకుండా గుర్రాన్ని దౌడుతీయించి వడివడిగా వెళ్ళిపోయాడు.

వైస్రాయి, డాన్ ఆన్టానియో చెవిలో ఏదో వూదాడు. అది వినీ వినటంతోటే, డాన్ ఆన్టానియో తనూ గుర్రమెక్కి ఆ వీరుడు వెళ్ళిన దిక్కే వెళ్లాడు.

అలా పోయి పోయి, కొంతసేపటికి ఆ వీరుణ్ణి డాన్ ఆన్టానియో ఒక చిన్న హోటల్లో కలుసుకోగలిగాడు. ఆయనతో అవీ యివీ మాట్లాడాక, ఆయన అసలు పేరేమిటో ఊరేమిటో తనకైనా చెప్పవలసిందిగా బ్రతిమాలాడు. దానికి ఆ వీరుడు యిలా సమాధానం యిచ్చాడు.

“నా అసలుపేరు శాంసన్ కర్రాస్కో. మాది కూడా యీ డాన్ క్విక్ సెట్ గారి ఊరే - అంటే లామంచాగ్రామమన్నమాట. డాన్ క్విక్ సెట్ గారు వున్నాడే—ఆయన నిజంగా చాలా మంచిమనిషి సుమండీ. అటువంటివాడికి వీరుడుగా చలామణి కావాలన్న పిచ్చి ఒకటి పట్టుకొంది. ఇక అప్పటి నుంచీ యింటిపట్టున వుండకుండా, ఆ అడంగులను

ఏడ్పిస్తున్నాడంటే నమ్మండి. ఈయనను పట్టుకొన్న యీ పిచ్చి నెలాగైనాసరే వదలగొట్టి, ఆయన మళ్ళీ యింటిపట్టున కుదురుగా వుండేటట్టు చేద్దామని పూనుకున్నాను. ఆ ఆశతోనే వెనుక ఒకసారి, మూడు నెలల్రకితం యిలాగే వీరుడివేషం వేసుకొనివచ్చి, యీయనను ఒక అడవిలో కలుసుకొని యుద్ధం చేశాను. సరే—అప్పుడు నా అదృష్టం బాగుండక, నేనే యీయనచేతిలో దెబ్బలు తిన్నాననుకోండి. అందుకనే మళ్ళీ యిప్పుడు యీడాలూ, డవాలూ తగిలించుకొనివచ్చి యీయనతో తలపడ్డాను. ఫలితం మీరు చూశారుగా! ఆయన మనిషి స్వతహాగా నిజాయితీ కలవాడు కాబట్టి, మరి సంవత్సరందాకా యీ వీరవిహారాలజోలికి పోడని నమ్మవచ్చు. కనీసం ఒక్క సంవత్సరంపాటైనా ఆయన యింటిపట్టున వుంటే, తల్లీ తండ్రీ లేని ఆయన మేనకోడలు ప్రాణం కాస్త కోలుకొంటుంది. ఆయన కుదురుగా వుండటమన్నది ఆమెకొక్కర్తికే కాక, నాలాంటి ఆయన మిత్రులందరికీ సంతోషించదగ్గ విషయం. అన్నట్టు—తమరు నాకు ఒక చిన్నసహాయం చెయ్యాలి. డాన్ క్విక్సెట్‌గారికి తనను ఓడించిన వ్యక్తి నేను అనే విషయం ఎంత మాత్రమూ అనుమానమైనా తగలనీయకుండా చూడవలసిన బాధ్యత మీపై వున్నది. కారణం ఏమంటారా?—తనను ఓడించినవాడు నిజమైన వీరుడు కాదని గనుక ఆయనకు తెలిసిందీ అంటే— వీరవిహా

రాలజోలికి పోనని తాను ఒప్పుకొన్న విషయం లెక్క చేయక, మళ్ళీ బయలుదేరుతాడు.

డాన్ ఆన్టానియో కూడా అందుకు ఒప్పు కొని, శాంసన్ క్రాస్కో పేరు బయటపెట్టనని వాగ్దానం చేశాడు. శాంసన్‌కు అయితే తాను డాన్ క్విక్‌సెట్‌గారి పిచ్చి కుదర్చగలిగానని ధైర్యంగావుంది కాని, ఆన్టానియోకు అనుమానంగానే వుంది. ఆయ నగారికి పట్టుకొన్న పిచ్చి యింత చిన్నచిన్న మోతా దులతో తిరిపోయేది కాదని యీయన నమ్మకం. శాంసన్ చేసిన చికిత్సమూలంగా ఆ డాన్ క్విక్‌సెట్ గారి పిచ్చి శాశ్వతంగా నివారణ కాకపోయినా, తాత్కాలికంగా ఒక్క సంవత్సరంపాటైనా నిలిచిపో తుందికదా అన్న ధైర్యం యిద్దరికీ కలిగింది. ఆన్ టా నియో, నిజానికి, డాన్ క్విక్‌సెట్‌గారిని యింకా బాగా ఎగతాళిపట్టించి తనూ, తన మిత్రులూ మరి కొంతకాలం సరదాగా కాలక్షేపం చేయవచ్చునని ఆశ పెట్టుకొనివున్నాడు. ఇప్పుడు యీ శాంసన్ వుదంతంతో డాన్ క్విక్‌సెట్‌గారు యిక వీరవిహారాలు మానివేయవలసి వస్తున్నది కనుక, ఆయన యిక యీ పట్టణంలో ఆట్టే రోజులు వుండబోడు. అది తెలుచుకు న్నప్పుడు మాత్రం ఆన్టానియో కొంచెం విచార పడ్డాడు.

శాంసన్‌కు మాత్రం తను వేసిన మందు శాశ్వ తంగా పనిచేసినా చేయకపోయినా, తాత్కాలికంగా

అయినా పనిచేయబోతున్నందుకు సంతోషమైంది. తన పేరు బయటపెట్టనని ఆన్టానియో గట్టివాగ్దానం యిచ్చాక, శాంసన్, కవచాదులు విప్పేసి, సంతుష్టితో స్వగ్రామంవైపుకు ప్రయాణమై వెళ్లాడు.

## 22

వీరాభిషేకం చేయించుకొని, వీరకంకణం కట్టుకొని వీరుడుగా 'భీకరానన వీర శూరాగ్రేసరుడు'గా 'వీరకేసరి'గా పేరు ప్రఖ్యాతు లార్జించిన తాను, ఆ శ్వేతశశాంకవీరుని చేతిలో ఓడిపోవటమనేది, డాన్‌క్విక్ సెట్ గారి మనస్సుకు చాల కష్టమేసింది. ఆ శ్వేత శశాంకవీరుడితో సల్పిన పోరాటం సందర్భంలో తగిలిన గాయాలకు తోడైన యీ మనస్తాపం, డాన్ క్విక్ సెట్ గారిని ఆరు రోజులపాటు మంచంలోనుంచి లేవలేని మనిషిగా తయారుచేసింది.

ఆ గాయాలు కాస్త నయమై, వొళ్లు నొప్పులు కాస్త తగ్గగానే ఆయన, శ్వేతశశాంకునికి యిచ్చిన మాటప్రకారం సంవత్సర కాలం వీర విహారాల వూసు ఎత్తకుండా యింటిపట్టునే వుండేటందుకు నిశ్చయించుకొని, లామంచా గ్రామానికి ప్రయాణమైనాడు. ఇంత పరాభవమయ్యాక యింకా యీ వుక్కు కవచమూ, టోపీ, యీటె యివన్నీ తగిలించుకు తిరగటం ఎందుకన్న విరక్తిభావం తోచి, వాటి

నన్నిటినీ విప్పేసి ఉంగచుట్టగా చుట్టి, ఆ 'డాపుల్'



మూపున పడేశాడు. తాను మామూలు దుస్తులు ధరించి 'రోజినాన్ టీ' మూపున ఎక్కి ప్రయాణం సాగించాడు. ఆయన వెనకాలే మాజీ గవర్నరు శాంకోపాంజా కూడా బయలుదేరాడు. కానీ,—తన గాడిదమీద యజమానిగారి తాలూకు వుక్క సామాను అంతా పడవేసివున్న కారణంచేత, దాని కళ్ళేన్ని పట్టుకు, తాను అంతదూరమూ కాలి నడకనే పోక తప్పిందికాదు.

డాన్ క్విక్ సెట్ గారి మనస్సు బాగ వికలమై పోయింది. ఇన్ని రోజులపాటు సాగిన ఆ ప్రయాణంలో ఆయన ఒక్కమాట అయినా మాట్లాడలేదు. ఉండి వుండి నిట్టూర్పులు విడవటంకంటె ఆయన వేరే విధమైన శబ్దం ఏదీ చెయ్యనేలేదు. అలాటిస్థితిలో వుండగా ఆయనను పలుకరించటానికి శాంకో పాంజాకు ధైర్యం చాలింది కాదు.

ఎలాగైతేనేం - చివరకు యిద్దరూ లామంచా గ్రామం చేరారు. శ్వేతశశాంక వీరుడికి యిచ్చిన మాట ప్రకారం డాన్ క్విక్ సెట్ గారు యిక యీసారి నుంచీ ఒక్క సంవత్సరంపాటు కదలి వెళ్ళకూడదు!

లామంచా గ్రామం యింకా ఒకటి, రెండు మైళ్ళ దూరంలో వుందనగానే వీళ్ళకు ఆ కాలేజీ చదువులు చదివిన కుర్రాడు శాంసన్ కర్రాస్కో ఎదురైనాడు. వీళ్లు కనిపించీ కనుపించగానే ఆ శాంసన్ ఎక్కడలేని సంతోషంతో వాళ్లిద్దరినీ కౌగలించు

కొన్నాడు. అక్కడ వాళ్లకుకొంత ఆలస్యం అయింది. ఈలోగా లామంచా గ్రామస్థులందరికీ డాన్ క్విక్ సెట్ గారు తిరిగి వస్తున్నాడన్న వార్త తెలిసిపోయింది. గ్రామంలోవుండే ప్రతిఒక్కడూ యీాయనకు ఎదురువచ్చి స్వాగత మిచ్చాడు

డాన్ క్విక్ సెట్ గారి స్వంత యింటివద్ద ఆయన మేనకోడలు, ముసలిదాసీ వళ్లంతా కళ్లు చేసుకొని యీాయన వచ్చే వీధివంకే చూస్తూ వుండిపోయారు. శాంకో పాంజా పెళ్లామూ, పదేళ్ళపిల్లా కూడా యీా శుభసమయానికి ముందే, డాన్ క్విక్ సెట్ గారి యింటికి వచ్చి అక్కడే కనిపెట్టుకు వున్నారు. ఆనలుగురే కాక, ఆ ప్రక్కయిండ్లలో వుండేవ్యక్తులు కూడా వచ్చి, డాన్ క్విక్ సెట్ గారి యింటి వీధి వాకిట్లో పెద్ద గుంపుగా చేరిపోయారు. అందరూ వుచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా ఆపేసి, పరాజితుడైన యీా వీరుని ఆగమనంకోసం వేచివున్నారు.

ఇంత మందీ యింత ఆత్రంగా చూస్తున్న వ్యక్తులిద్దరూ ఎట్టకేలకు యింటికివచ్చి చేరారు. శాంకో పాంజా తన స్వామిని ఆయింట్లో క్షేమంగా చేర్చాక, పెళ్లాన్ని పిల్లనీ పలుకరించి, వాళ్లతో ఏవేవో కబుర్లు చెప్పుకొంటూ, గాడిదను నడిపించుకొని తన గుడిసెకు చేరాడు. అక్కడకు చేరిందిమొదలు, శాంకో పాంజా తనకు యిటీవల అయిన అనుభవాలన్నిటినీ పూస గుచ్చినట్లు పెళ్లానికీ, పిల్లకీ చెప్పేడు. ఆ అనుభవాలే

వీరగాథ లైనంత యిదిగా ఆ అమాయికు లిద్దరూ విని మురిసిపోయారు. ఈ కథలన్నీ చెప్పటం పూర్తిచేసి, తన కోటుజేబులోనుంచీ కొన్ని బంగారునాణేలను బయటకుతీసి, పెళ్లానికీ పిల్లకు చూపెట్టాడు. ఈ డబ్బు, ఎవరినీ మోసం చేయకుండా, దారులు కొట్టకుండా, న్యాయంగా, కష్టపడి చెమటోడ్చి సంపాదించి తెచ్చానన్నాడు. వాళ్లిద్దరూ ఆ డబ్బును చూసీ, ఆయనగారి అనుభవాలను మననం చేసుకొని మహా మురిసిపోయారు.

ఇక్కడ డాన్ క్విక్ సెట్ గారు తనయింట్లో అయినవాళ్ళను నలుగురినీ కూర్చోబెట్టుకొని, తాను యీ వీర విహారాలసందర్భంలో పొందిన కష్టనష్టాలను ఏకరువు పెట్టాడు. శ్వేత శశాంకవీరుని వల్ల తాను పొందిన పరాజయాన్ని వివరిస్తూ, ఆయన కంటికి మంటికి ఏకధారగా ఏడ్చాడు. వీరవిహారాలు చేసి విశ్వవిఖ్యాతి నార్జించుకోవాలని తాను కన్న కలలన్నీ యిలా కరిగిపోయాయనీ, తాను కట్టుకొన్న గాలిమేడలన్నీ కూలిపోయాయనీ, ఆయన కుమిలిపోయాడు. ఇక సంవత్సరందాకా వీరవిహారాల జోలికి పోరాదన్న విషయం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా మనిషి క్రుంగిపోయేవాడు.

ఆ ఏడాదీ గడిచాకనే కాదు - ఆతరువాత కూడా శాశ్వతంగా డన్ క్విక్ సెట్ గారు వీరవిహారాల జోలికి పోనేలేదు.

ఇంటికి తిరిగివచ్చిన కొద్దిరోజుల్లోనే డాన్ క్విక్సెట్‌గారు మంచాన పడ్డాడు - మంచాన పడ్డ వాడు మళ్ళీ లేవలేదు !

తుది ఘడియలు సమీపిస్తున్నవనగా, తన మిత్రుల నందరినీ పిలిపించి అందరివద్దా సెలవు తీసుకొన్నాడు. వీరాభిషేకం చేయించుకోకముందు తనను అందరూ అలన్‌జో క్విక్సానో అని పిలిచేవారు కనుక, తను చనిపోయాక కూడా, మధ్యలో వచ్చిన యీ డాన్ క్విక్సెట్ అనే పేరుత కాక, ఆ మొదటి పేరుతోనే తనను జ్ఞాపకం పెట్టుకోవలసిందిగా ప్రతి వారినీ ప్రతిమాలాడాడు.

ఆయన యీ విధంగా మరణశయ్యపై పడి వుండీ, మిత్రుల నందరినీ మరచిపోవద్దని ప్రతిమాలుతూ వుంటే, శాంకోపాంజా ఒకమూలకు పోయి గుండె బద్దలయ్యేటంత యిదిగా ఏడ్చేస్తున్నాడు. డాన్ క్విక్సెట్ వాడివైపు మొహ రిక్కించి చూసి "హా వెర్రి వేషాలలో నిన్నూ యిరికించాను. ఇంకా యీరోజుల్లో వీరులు వున్నారని నేను నమ్మటమే కాక, నిన్నూ ఆ నమ్మకాలకూ, ఆ వెర్రిమొర్రి విహారాలకు బలి చేశాను. ఈలోకంలో నన్ను క్షమిస్తావా, నా శాంకో ?" అంటూ కళ్ళనిండా నీళ్ళు తెచ్చుకు అతి దీనంగా అడిగాడు.

ఆయనకంటే మిక్కుటంగా ఏడుస్తూ, "స్వామీ! స్వామీ !...... వద్దు......తమరు చనిపోవద్దు!

స్వామీ! మొన్నను తమరేదో ఒక్కసారి ఓడిపోయారని, మనస్సు యింత కష్టపెట్టుకొంటే ఎట్లాగండీ? వంటిమీద నాలుగు చోట్ల గీరుకుపోయినందుకే యింత బెంగపడతారేమండీ?... కాకపోయినా తమరికి అపజయమూ, అవమానమూ వచ్చాయంటే అందుకు బాధ్యత నాదేనేమో ఎవరికి తెలుసు? మీ గుర్రం రోజినాన్‌టీకి, నేనారోజున సరిగా జీను తగిలించానో? లేదో? జీను పట్టాలు సరిగ్గా వుండనందువల్లే మీలాంటి వీరుడు పడిపోయి వుంటాడు కానీ, యుద్ధం చేసే సమర్థత లేక మాత్రం కాబోదు. నామాట విని ధైర్యంగా వుండండి." అంటూ ఆయనకు మనోధైర్యం రప్పించటానికి ఎన్నో విధాల చెప్పి చూశాడు, శాంకోపాంజా.

ఎన్ని చెప్పినా డాన్‌క్విక్‌సెట్‌గారికి మనస్థైర్యం రాలేదు.

"అల్లాకాదు; శాంకో! ఇంతవరకూ నేనేదో పిచ్చిలోపడి బ్రతికానని నాకిప్పుడు బాగా తెలిసి వచ్చింది. నాకిప్పుడే జ్ఞానోదయం అయింది (జ్ఞానోదయం అయింది కనుక ఆయన వీరగ్రాంథికభాషను వుపయోగించటం మానేశారు!)... నేను ఒకప్పుడు వీరకేసరి డాన్‌క్విక్‌సెట్‌ను అయివుంటే అయివుండవచ్చును కానీ, యీ క్షణం నుంచీ మాత్రం అలన్‌జో క్విక్‌సానో అనే సాధారణ వ్యక్తిని ... నా బ్రతుకిక

కొన్ని క్షణాలలోకి వచ్చేసింది! ఈ జన్మలో నేను చేసిన పొరపాట్లు, తలపెట్టిన పాపాలు, మీ అందరి అనుమతిన వెళ్ళగక్కు-కొని, విల్లురాసి, హాయిగా కన్నుమూస్తాను." డాన్‌క్విక్‌సెట్ గారు — (కాదు కాదు— ఆయనగారి కోరికప్రకారమే మనం కూడా ఆయనను యిక ఆపేరుపెట్టి పిలవకుండా, అలన్‌జో క్విక్‌సానోగారనే అందాం) — అలన్‌జో క్విక్‌సానో గారు యిక మాట్లాడలేకపోయారు.

హృదయాలను కదలించివేసే యీ ఘట్టం గడిచాక, అలన్‌జో క్విక్‌సానోగారు ఏ ఒకటి రెండు రోజులో మాత్రమే బ్రతికివున్నారు. ఆ తరువాత ఎప్పుడో ప్రశాంతంగా కన్ను మూసేశారు.

పరాయివారెవ్వరినీ పల్లెత్తుమాట అనకుండా అందరిపట్లనూ మంచిగా బ్రతికిన యీ క్విక్‌సానో గారు చనిపోయారంటే, ఆవూరిలో కంట తడిపెట్టని వ్యక్తి లేడు. ఊరిపెద్దలు పదిమందీ ఒకచోట సమావేశమై ఆయన మృతికి తమ విచారాన్ని ప్రకటిస్తూ అంత మంచిగా బ్రదికిన వ్యక్తికనుక యీయనను, ముందు యుగాలవారు 'సాధూ అలన్‌జో క్విక్‌సానో' అని పిలవాలనీ, ఆపేరటనే ఆయనగారి సంస్మరణ జరగాలనీ తీర్మానించుకొన్నారు.

సమాప్తం

291

# శ్రీమద్భగవద్గీత

వ్యాఖ్యాత:

## శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు

ఆరవ ముద్రణము

ఖద్దరు బైండు

**వెల రూ 4-0-0 లు.**

తపాలా ఖర్చు అ. 0-9-0

---

# కాంచనద్వీపం

## రాబర్ట్ లూయీ స్టీవెన్సన్

అనువాదం:

నండూరి రామమోహనరావు

**వెల: రూ. 1-8-0**

**ఆంధ్రగ్రంథమాల**

పోస్టుబాక్సు నెం. 212 మదరాసు-1.

292

